ద్రావిడ భూభాగమందు నానావర్ణములలో వైష్ణవోత్తములై వచ్చి యవత రించగా, సర్వేశ్వరుడును ఆళ్వారాచార్యులకు "మయర్ వర మదినలమరు ళినక్" అని సాయించిన ప్రకారము, అజ్ఞానాంధ కార నివృత్తి పూర్వకముగ భక్తిరూపాపన్నజ్ఞానము కృపచేసి తద్ద్వారా సర్వాధికారమగు ద్రావిడ వేద తదంగోపాంగ తత్తద్వ్యాఖ్యానములచేతను, శ్రీవచనభూషణాది రహస్యము లచేతను, సర్వోజ్జీవనార్థముగా, ఈదర్శనమును ప్రకాశింప జేసెను; అట్లుపర మకృపచే ప్రకాశింపజేసిన ఈదర్శన వైలక్షణ్యమును చెరుచుటకును, అనేకుల ను తమవలె బద్ధసంసారులుగా జేయుటకును,ఇందు ప్రవేశించి, ఖ్యాతిలాభా ర్చనతత్పరులై నామరూపములను ధరించి, స్వరూపాను రూపవృత్తి విశేషము లొకటియు లేకనే, స్వరూపవిరోధుల నొకటియుత్యజించజాలక, దేహాత్మా భిమానులై, దురహంకారగ్రస్తులై, కృష్ణచిహ్నములను ధరించి, కృష్ణు నెదిరించి న పౌండ్రకవాసుదేవుని వలెను, అమృతార్థులై దేవగోష్ఠిలో ప్రవేశించిన రా హు కేతువులవలెను, స్వకార్యపరులై వానరాకారమును ధరించిన శుకసారణా దులవలె తిరిగెడు,పరహింస, పరదార పరిగ్రహ, పరద్రవ్యాపహార, అభక్ష్య భక్షణ,అపేయపాన తత్పరులైన ఆసురప్రకృతుల ఉక్తివృత్తులను, ప్రమాణము గా గైకొనక, గ్రంథస్థములగు ఆళ్వారాచార్యుల వచనానుష్ఠానములనే ప్రమాణముగాగొని, వాటికి విరోధముగా సర్వేశ్వరుడైనను మనదర్శన స్థా పకులగు ఎంబెరుమానారులైనను, ప్రత్యక్షమై సాయించినను, స్వప్నాదులలో నియమించినను ఇంద్రవేషధారియై అంబరీషుని భ్రమింపజేయవచ్చిన వానివలె జేసెడు "మెణ్ణిలాప్పెరుమాయన్" ఐన సర్వేశ్వరుని మాయాకార్యమని తల చి, అప్రామాణికకృత్యములను,శిష్టాచారమని ఆచరింపదగదు.

—※ ఈ యతిమాత్ర ప్రవృత్తి కైతిహ్యము. ※—

ఎంబెరుమానారులు దర్శనము నిర్వహించుచు వచ్చెడు కాలమందు,యాదవ ప్రకాశులు వీరివైభవమంతయు దెలసియుండియు,మాతృవచనముచేతను, భగవ దాజ్ఞచేతను, వారినాశ్రయించి, శ్రీవైష్ణవ సిద్ధాంతమునందు ప్రవర్తించినది చూచి,తత్పుత్రశిష్యులు సహించజాలక, నీదర్శనమున అపథేప్రవృత్తి కలుగ జేయవలెనని తలచి "భక్తిరష్టవిధాహ్యేషా యస్మిన్ మ్లేచ్ఛేపివర్తతేసవిప్రేం

ఢోశ్రీమునిశ్శ్రీమాక్షసయతిస్సచపండితః" అనుభగవదాజ్ఞచేతపూర్వాచార్యులు నికృష్టవర్ణజాతులగువిలక్షణసంబంధస్వీకారమునంగీకరించినదేహేతువుగా, సర్వవర్ణసాంకర్యముకలుగజేసి, చరమశ్లోకమునందు, సర్వధర్మత్యాగమునువిధించినదేహేతువుజేసి "ఇదంకురు ఇదంమాకార్షీః" అను రెంటినిత్యజించవలెనని, నిషిద్ధానుష్ఠానమును ప్రవేశింపజేసి, ఇదిచరమధర్మమని కొన్ని గ్రంథములను కల్పించి, తత్కాలవర్తులైన కొందరాసుర ప్రకృతులను మోహింపజేయగా నిదియర్థకామ పరవశులకు సహకారమైనందున దావానలమువలె వ్యాపించుచు రాగా, ఆకాలమందే ఎంబెరుమానారులు కొందరినిపట్టి శిక్షించి, గ్రంథములను తీసిచించి దగ్ధముసేసినను, కలిదోషముచేత తిరుగానా నాటికి అభివృద్ధియై, శిష్టులుగహింపుదురని బయలు పరచక, స్వగోష్ఠికను కూలమైన వారికి మాత్రము ఇది శిష్టాచారమని చెప్పుకొనుచు నీదర్శనమునకు అనర్థకులై తిరుగుచురాగా పిళ్లలోకాచార్యుల కాలమందును, కొందఱు కొన్ని విపరీత ప్రశ్నలు చేయగనందుమీద శ్రీవచన భూషణ దివ్య శాస్త్రము, భగవదాజ్ఞచేనవతరించినదని కొందరు జ్ఞానాధికులు చెప్పెదరు.

ముముక్షువులైనచేతనులకాహారనియతి, సహవాసనియతి, అనువర్తననియతి, ఇవిప్రధానములయినవి. అందు ఆహారనియతియనగా — జాతిదుష్టాశ్రయదుష్టనిమిత్తదుష్టములను పరిత్యజించి పవిత్రములై విలక్షణ పరిగ్రహములై పరిశుద్ధములైన భగవద్భాగవత శేషములను స్వీకరించుట. జాతి దుష్టమనగా — "లశునమద్య మాంసాని, మూలకం గృంజనంతథా, తిలపిష్టంతథా శిగ్రుం, బిల్వం కోశాతకీం తథా, అలాబుం శ్వేత వార్తాకం విడ్వనీకం తథైవచ, ఏవ మాదీని భక్ష్యాణి శాస్త్రదుష్టాని యేనరాః, ఖాదంతి తే నరాయాంతి, విణ్మూత్ర క్రిమి భోజనం" అనిత్యాజ్యములుగా చెప్పబడునిషిద్ధ ద్రవ్యములు, అయితే ఆచార ప్రధానులైన పెరుమాళ్ "నమాంసం రాఘవోభుంక్తే నచాపిమధుసేవతే" అని సీతావిశ్లేష సమయమందు మధుమాంస వర్జనముచేసి నారని చెప్పుటచే సంశ్లేషదశయందు అనుభవించినారని తోచుచున్నదేయనగా "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" అనియు, ధర్మసంస్థాపనార్థము తిరువవతరించిన అవతారములం దాచరించిన ధర్మముపాదేయముకాదో యనగా,

పెరుమాళ్లు సామాన్య ధర్మ నిష్ఠులగుట చేత, క్షత్రియ కులముల కనుగుణమైన మాంసములును, రాజులు స్వీకరించెదరు నానా సుగంధ పుష్పరస సముదాయమైన మధువును స్వీకరించిరే కాని స్వవర్గ విరుద్ధమైన మధుమాంస పరిగ్రహము చేయలేదే, వర్ణ ధర్మికులకు తారతమ్యాను గుణముగా, కొన్ని త్యాజ్యములు కొన్ని యుపాదేయములై యున్నవి యంతయు; సత్వప్రచురులైన పరమైకాంతులకు "ఉభేవిద్వాన్పుణ్యా పాపే విధూయ" అను వచన ప్రకారము భగవదనుభవ వ్యతిరిక్తములు త్యాజ్యములుగా జేయుటతప్ప ఉపాదేయమన కూడదు "బ్రాహ్మణస్య, మధూకమైక్షవం తాళం ఖార్జురం పానసం తథా, ద్రాక్షం మధుజ మారిష్టం, మైరేయం నాళికేరజమ్, ఇత్యే కాదశమద్యాని నిషిద్ధానిద్విజన్మనాం, సురాంబు ఘృత గోమూత్ర పయ సామన్యతమ మగ్నిస్పర్శాద్దాహకశక్తింకృత్వాపీత్వామరణాత్ శుద్ధింప్రాప్నుయాత్" అనుప్రకారము సత్వప్రచురమైనబ్రాహ్మణత్వమునకే మరణాంతములైననిషిద్ధ ద్రవ్యములు, సత్వనిష్ఠులై గ్రామ కులాది వ్యపదేశములు లేక సర్వ వర్ణాశ్రమ విలక్షణులైభగవదేకవ్యపదేశ్యులైన పరమైకాంతులకు తలంచనే కూడదు, నింద్యములైన యీనిషిద్ధ ద్రవ్య స్వీకారము వర్ణమును పట్టియే నిషిద్ధమే గాక "ద్రవ్యం నింద్యసురాది దైవతమతి క్షుద్రంచ బాహ్యాగమో, దృష్టిర్దేవల కాచ్ఛదేశిక జనా ధిక్ ధిక్ ధిగేషాంక్రమః" అని, క్షుద్ర దేవతా విషయ బాహ్యాగమ ప్రవర్తక నిషిద్ధకృత్యము లగుటచే శిష్టగర్హితములైనవి "యజంతే సాత్వికాదేవాన్"అని దేవతలందరు సాత్వికులకు పూజ్యులని, పెరుమాళ్ రుద్రేంద్రాదులను అవతారములయందారాధించినారని, అనన్యార్హ శేషత్వా కారషట్కములచేత పిరాట్టితో సమమైన పరిశుద్ధాత్మలకు, దేవతాంతర భజనముచేయకూడదు; మరియు నవతార ప్రయుక్తములైన మానుషచేష్టితములుదృష్టాంతములవ్యోనేని, బ్రహ్మజన్మమైనరావణునిసంహరించినాడనిబ్రహ్మహత్యాదులును, కృష్ణునను సరించి పరహింస, పరదార పరిగ్రహ, అభక్ష్య భక్షణ, అపేయ పాన, అకృత్య కరణ, కృత్యాకరణ, పరద్రవ్యాపహారాదులును, ఉపాదేయ మగుటకు సంశయములేదు గాన, మహా పాతకములును ప్రపన్నధర్మములై ప్రవర్తించవలసివచ్చును గాన, నట్లుచెప్పుటయుచితముగాదు. అవియట్లుండ, చరమ

శ్లోకమందలి ప్రథమపదమందు సర్వశబ్దమునకు సంకోచము రాకుండునట్లు నివృత్తి రూప ధర్మత్యాగమునకై పరిగ్రహించెద మంటి మేని, అనన్యార్హ శేషత్వ స్వ రూపుడైన తనను, నిఖిలహేయ ప్రత్యనీక కళ్యాణైక తానుడైన సర్వేశ్వరుని, త్రిపాద్విభూతియందు "మేఘాలగుం తనికోల్ చెల్ల కుఘుమత్తేవర్ కుళాంగల్ కైదొళ్ళియెళుందరుళి" ఉండెడు వైకుంఠనాధుని ప్రాపించెడు పరమ పురుషార్థ ఫలమును చూడగ, అపధే ప్రవృత్తి చొరబడుటకు అవకాశము లేదనుట ముముక్షు పడిలో పరిహృతమైనది "ఉచ్ఛిష్ట మపిచామేధ్యం భోజనం తామస ప్రియం" అను వచనరీత్యా అమేధ్య వస్తువులు తామసులకే గాక సత్వనిష్ఠులకు త్యాజ్యములై యుండును, త్రిగుణాధీనాత్మక క్రియాధీనచేతనులకైతే, గుణాను గుణముగా త్యాజ్యము లుపాదేయములుగా నుండును, "సర్వం ఖల్విదం బ్రహ్మ" అని సమస్త వస్తువులును, బ్రహ్మాత్మకమని తలచెడు అధికారులకు, త్యాజ్యమైనవి కల వోయనిన, వీడు త్రిగుణాత్మకమైన ప్రకృతిని విడిచి ముక్తుడైన వెనుకనే, తదీయత్వా కారముచేత లీలా విభూతియంతయు అనుభావ్యమగును; ప్రకృతి విశిష్టుడై యుండియు "మయర్ వరమది నలమరుళ్ప్పెత్త" ఆళ్వార్ల వంటివారును, ప్రహ్లాదాళ్వాన్ వంటివారును అపరోక్షజ్ఞానులై, సమస్త వస్తువులయందు సర్వేశ్వరుని సాక్షాత్కరించి, విషశస్త్రాగ్నులు మొదలైనవి ప్రాతికూల్యములుగాక, నన్నియు ననుకూలములుగా సర్వసములై, పృథివ్యాది భూత భౌతికములయందు, మరియు నిందుగల చేతనాచేతనములయందంతట వ్యాపించిన వాడతడే యని, సర్వేశ్వరునికి యివి యన్నియు ప్రకారతయా శేషమై యుండుట ననుసంధించిరే గాని బ్రహ్మాత్మకములని లశునగృంజనాదుల్ల ననుభవించలేదే. కాన బ్రహ్మాత్మకమని ముముక్షువులకు ప్రాకృతి హేయ వస్తువు లుపాదేయము లనగూడదు. "ఆహారశుద్ధౌ సత్వ శుద్ధిః సత్వాత్సంజాయతే జ్ఞానం, జ్ఞానాన్మోక్షమయి నందున" జ్ఞాన విరోధవస్తువులు త్యాజ్యములు "మయర్ వరమదినల మరుళ్ప్పెత్త" ఆళ్వార్లకైతే "ఉణ్ణుం శోరుపరుగునీర్ తిణ్ణుంవెత్తిలయుమెల్లాంకణ్ణనెంబెరుమాన్" అనిధారక పోషకభోగ్యాదులంతయు నతడేనై యుండె, నదిలేని ముముక్షువులకందరికిని సత్వోద్రిక్తవస్తువులే పరిగ్రాహ్యములు కావున, జాతి దుష్టములు త్యాజ్యములుగా నుండును.

ఆశ్రయదుష్టమనగా— అభిశస్తపతిత చండాలాభిమాన దూషితములైనవి. నిమిత్త దుష్టములనగా— శ్రాద్ధశాంత్యాది నిమిత్తముల వలన వచ్చు నవియును, కేశోచ్ఛిష్టా పకృష్టస్పర్శ దుష్టములును ఇవి మూడును పరిత్యజించుట ఆహారనియతి యనునది. సహవాస నియతియనగా— దేహాత్మాభిమానాదులు, దేవతాంతర ప్రయోజనాంతర సాధనాంతరపరులు స్వతంత్రులు మొదలైన ప్రతికూలులను చూచునెడల సర్పాదులను చూచినట్టులొదిగి జ్ఞానానుష్ఠానములు గల పరమార్థులతో సహవసించుట. అనువర్తన నియతి యనగా— అర్థార్జనాదులకై రాజద్వారముల యందుకాచి సంసారు లనువర్తించి తిరుగక దృష్టము కర్మాధీన మగుటచే నందుకు విస్మయ పడక సదాచార్యాను వర్తన పరుడై యుండుట. ఇట్లు జ్ఞానానుష్ఠానసంపన్నుడే సదాచార్యుడని చెప్పదగినది.

జ్ఞానహీనుడు అంధకునివలె అనుష్ఠాన హీనుడు పంగువువలె జ్ఞానానుష్ఠానములు రెండు కలిగి యుండుటచే తాను తన్ననుసరించిన వాడును దరిజేర వచ్చును శరణాగతుడైన ముముక్షువుకు విధి నిషేధములు రెండును త్యాజ్యములై యుండగా రజస్తమస్సుల వలన చలించి “అధర్మం ధర్మమితియా మన్యతే తమసావృతా । సర్వార్థా న్విపరీతాంశ్చ బుద్ధిస్సాపార్థ తామసీ” అని చెప్పెడు ప్రకారము యథార్థము నిరూపించక విపరీతానుష్ఠానపరుడై అదేయితరులకుపదేశించి “శ్రుతిస్స్మృతిర్మమైవాజ్ఞా యస్తాముల్లంఘ్య వర్తతే, ఆజ్ఞాచ్ఛేదీమద్రోహీమద్భక్తోపి నవైష్ణవః” అను ప్రమాణరీత్యా భగవదాజ్ఞా రూపములైన దుష్టవృత్తులచేత భగవదనభిమతుడై తాను నశించి తన్ననుసరించిన శిష్యుని నశింపజేసి తన్నుచూచిన యితరులలో తన్నను వర్తించి కొందరుతన్ననాదరించి కొందరు నశించేటట్టు అపథీ ప్రవృత్తుడై తన్ను ఆచార్యునిగా నభిమానించి ఖ్యాతిలాభ పూజాను వర్తనముల నపేక్షించి విపరీత ప్రవృత్తులైన శిష్యులను చేర్చుకొని వారిదురభిమాన దూషితద్రవ్యమును పరిగ్రహించియందుచే దేహయాత్ర నడిపించుకొనుచు అహంకారార్థకామ పరవశులైన మూర్ఖులందరు శిరోముండనము సేసికొని కరచరణాదుల జక్కగా శుద్ధిచేసుకొని వస్త్రముల జక్కగా నుదికిమొలను సు సంగతముగా ధరించుకొని ద్వాదశోర్ధ్వపుండ్రధారులై తిరుమణి పడములను తిరు పవిత్రములను ధరించి పవిత్ర

పాణులై అధ్యయనాధ్యాపనములు కలిగినవారై వేశ్యాలంకారముల వలె సకలజన మనోహర వేషధారులై అహంకారమమకార గృహక్షేత్రదారా పుత్రాది సక్తులై రాగద్వేషయుక్తులై అర్థార్జన తత్పరులై వైష్ణవనామరూపములు కలిగినవారై యథాపూర్వ నిషిద్ధానుష్ఠాన రతులై బద్ధసంసారులై కర్మశూన్యులై మేమే విలక్షణ వైష్ణవులమనియు జ్ఞానాధికులమనియు అహంకరించి సామాన్య విశేష శాస్త్రములు రెంటికి తప్పి నడిచెడు ఉభయ భ్రష్టులననువర్తించుమని యెవరైనను చెప్పుదురా! వంచనార్థముగానైనను నామరూపములుండుటచేత తదను గుణమాత్రము కించిత్కరించి నిందించక "అవణ్ మాయంకడిరదరిం తరిం తోడుమినే" అని ఆళ్వార్లానతిచ్చినప్రకారము పరుగులిడి పోవలయు. సర్వేశ్వరుడు లీలార్థముగాజేసెడు కృషినిదూషించితిమేని యది యు లీలాలోలుడైన వాని కనిష్టమైనందున వారినినిందించక ప్రణిపాతాదుల చేత సవినయముతో అట్టివార్ల సహవాసమును దూరముగ" వర్జింపవలయు.

పెరియవాచ్చాంబిళ్లగారి సన్నిధిని నొక శ్రీవైష్ణవుడు దండము సమర్పించి, స్వామీ! మేము లీలకు విషయమో? కృపకు విషయమో? యని ప్రశ్నసేయగ, దేహమును బట్టి యుంటిమేని లీలకు విషయ మగుదుము, ఆత్మను బట్టి యుంటిమేని కృపకు విషయ మగుదుమని ప్రత్యుత్తరము నిచ్చిరి. ఇందుచే "త్వఙ్మాంసరుధిరస్నాయుమేదోమజ్జాస్థిసంహతౌ, దేహేచేత్ప్రీతిమాన్మూఢోభవితానరకేపిసః" అను వచన ప్రకారము దేహాభిమానియై తైలఘృతాదుల చేత దేహమును వృద్ధిజేసి విషయ ప్రవణులై దేహాను బంధికులైన భార్యాపుత్రాదులయందు అనురక్తచిత్తులై శాస్త్ర వశ్యులుగాక స్వైర సంచారులై రేని లీలావిషయులై పోవుదురు; ఆత్మ స్వరూపమునకు మాత్ర మనురూపముగా ఆకార త్రయసంపన్నులై అర్థ పంచక తత్వజ్ఞులై హేయోపాదేయములు తెలిసి స్వరూపవిరోధములైన ప్రాతికూల్యములంతయు ద్యజించి తిల్లతైలవద్దుర్వివేచమై త్యజించకూడని తన దేహమును చూచిన శత్రువును చూచినట్లు భయపడి అట్టి దేహమును వృద్ధిజేయక నియతాహారములను సత్తాధారక మాత్రము స్వీకరించి శాస్త్రవశ్యులై నిరహంకారులై ప్రవర్తించిరేని కృపా విషయ మగుదురని సాయించినందున సదాచార్య వరణముజేసి తేదువదిష్ట

మంత్రార్థ జ్ఞానానుష్ఠాన సంపన్నులయి లేని ముక్తి యోగ్యులగుదురు.

ఈయాచార్య వరణము జేసెడి యధికారులు ప్రథమ ప్రపన్నులనియు చరమ ప్రపన్నులనియు ద్వివిధము. మొదటియధికారి స్వాచార్యులానతిచ్చిన ప్రకారము భగవదత్యంత పరతంత్రులై తదేక ప్రవణులై "శేలేయ్ కణ్ణియరుంపెరుంచెల్వముం నల్ మక్కళుం మేలాత్తాయ్ తన్దైయుమవరే" అనియు "వాసుదేవస్సర్వమ్" అనియు చెప్పెడు ప్రకారము ఆళ్వార్లవలె ఉందువారు. రెండవ యధికారి ఆచార్యు డుపకరించిన భగవ ద్విషయ వైలక్షణ్యమును చక్కగా మనస్సున ధరింపజేసి ఇట్లు పరమ విలక్షణమైనవస్తువు నుపకరించిన మహోపకారమును చింతించి ఇందుకు ప్రతి మనమేమి చేయగల మనిఖిన్నులై "మాతాపితాయువతయ స్తనయావిభూతిస్సర్వం" అని అవిదితవిషయాంతరులైతదితరాన్యదేవతాగంధమూర్తులైమధురకవులవలెఉందువారు; ఇరువురికిపర్వభేదముతప్ప ప్రాతికూల్యనివృత్తి మొదలైనయధికారవిశేషములంతయు నపేక్షితములు గానుండును, అయితే భగవదాశ్రయణము దుర్లభము. ఇదిసులభమనిచెప్పుటకు కారణ మేమనగా నొకయర్థము శ్రుతమయ్యేనేని తెలుసు కొనదగిన జ్ఞానమును, అనుష్ఠించ తగిన శక్తియు లేని బధిరాద్యయోగ్యులకును కార్యకరమగుననియు శాస్త్రగమ్యుడు కాక చక్షుర్గమ్యుడనియు వీడు అపథప్రవృత్తుడయ్యేనేని రుచిచూచి అనుమతి ప్రదానము జేసెడు వానివలెగాక మరణాంతముగా నిర్బంధించి దిద్దుపాటుజేసి వానికిష్ట వినియోగార్హునిగా జేయునని తలచి సదాచార్యాను వర్తనము అమోఘమని చెప్పంబడినది.

ఇందుకైతిహ్యము—ఎంబెరుమానారుల సంబంధముగలవారైన అరంగమాళిగై యనునొకరు విషయ ప్రవణులై వర్తించునది చూచి బహుశః శిక్షించి గీతాధ్యాయములుపదునెనిమిదిని పాఠముచేయించి అందలయర్థము మనస్సున ధరింపజేసి నిద్రాహారములు తెలియకుండునటులవినీతునిగాజేసి కృపాపర తంత్రుడగు నట్లుకృపచేయలేదా! వీడు అవినీతుడైనను దిద్దిరక్షింప శక్తుడనువదిసత్యము. ప్రథమ చరమాధికారులయనుష్ఠానములీప్రకారమని మనపూర్వాచార్యుల ఉక్త్యనుష్ఠానములచేత పరిష్కృతములై యుండగా ఈ యధికారులగు కొందరు భగవదాజ్ఞా రూపములైన వైదిక మర్యాదల నతిక్రమించి తద్విరుద్ధములైన దు

వృ ౹ వ౹త్తులను అకృత్యకరణ కృత్యాకరణ అభక్ష్య భక్షణ అపేయపాన అస హ్యాప చారాదులు చేయుచు నివి ఆచార్యముఖోల్లాసమని భగవ దనభిమతు లై అపథప్రవృత్తులై తమరినిఆచార్యులుగ నభిమానించి ఖ్యాతిలాభ పూజానువ ర్తనముల నపేక్షించి విపరీత ప్రవృత్తులైన శిష్యుల జేర్చుకొని వారిదురభిమా నదూషితద్రవ్యమును పరిగ్రహించి యందుచే దేహయాత్ర నడిపించుకొనుచుం డునదిగాక నాథయామున యతివర కూరనాథ గోవింద భట్టారక లోకగురు వర వరముని ప్రభృతుల వచనానుష్ఠానములకు విపరీతార్థములు కల్పించి తా ము జ్ఞానాధికులమనియు చరమోపాయ నిష్ఠులమనియు జెప్పుకొనుచు భగవ దాజ్ఞాకైంకర్య శూన్యులై తిరుగుచుండెదరు. ఉడయవరులు సాయించినగీతా భాష్యమందు జ్ఞానాధికులును లోకసంగ్రహార్థము కర్మమనుష్ఠించవలయు నని యు "నమేపార్థాస్తికర్తవ్యం త్రిషులోకేషు కించన, నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవచకర్మణి" అనియు "ఉత్సీదేయురిమేలోకా నకుర్యాం కర్మచేదహమ్ సంకరస్య చకర్తాస్యా ముపహన్యామిమాః ప్రజాః" అనియు అకర్మవశ్యుడై వేదవేదాంత వేద్యుడైన గీతాచార్యుడును కర్మవశ్యునివలె ఆనృశంస్యముచేత శిష్యవు త్రోజ్జీవనార్థము తానాచరించి నట్లు భగవద్వాక్యమే ప్రమాణమైనం దున తామొకటి యాచరించి ఇది యెంబెరుమానారులు సాయించిన అను ష్ఠానమని చెప్పెడు వార్తలను విని యేమరక శ్రీభాష్య భగవద్విషయ శ్రీవచ నభూషణాది గ్రంథస్థములైన అర్థవిశేషములకు బూర్వోత్తర విరోధ పర స్పర విరోధములు లేనట్లు చక్కగ నిదానించి అర్థనిశ్చయము జేసెడు పరమ వైదికులైన యధికారుల ఉక్త్యనుష్ఠానములే ఉద్దేశ్యమని యెంచి "కాలాఘ్రుం నెంజఱియుం కణ్ శుఝలుం" అని ఆళ్వార్లు వలె ముక్తప్రాయులు తప్పప్రకృ తి విశిష్టులై అన్నపానాదులచేత దేహమును ధరించి యుండెడు దృష్టాధికా రులందరు "మయర్ వరమదినల మరుళ్ప్పెత్త" ఆళ్వార్ల దివ్యప్రబంధములం దును తదర్థవిశదీకరణములైన శ్రీవచన భూషణాద్యఖిల రహస్యముల యందు ను సంసారిచేత నోజ్జీవనార్థముగా విధించబడిన మర్యాదల నతిక్రమించక వేద శాస్త్రవిరుద్ధములయిన దురనుష్ఠానములను చక్కగ బరిత్యజించి ఆనృశంస్య ముచేత పరిగృహీతమైన విహిత కర్మములయందు ఉపాయత్వ బుద్ధిని మహా

పాతకాదులవలె సవాసనముగ విడిచి యథోచితముగ భగవదాజ్ఞారూప కైంకర్యమని యనుష్ఠించవలయు.

మంత్రార్థజ్ఞానముచేత త్యాజ్యోపాదేయములు తెలిసి దేహాభిమానాదులుపరిత్యజించి శేషత్వ పారతంత్ర్య కైంకర్యము లంగీకరించి ప్రవర్తించిన యెడల స్వరూపసిద్ధి కలిగి భగవదనుగ్రహ పాత్రులై ముక్తియోగ్యులగుదురు తదనురూపానుష్ఠానములు లేక మంత్రార్థ కాల క్షేపము నిత్యము శతాభిషేకము జేసినను నిత్యసంసారులై పోవుదురని భట్టరు సాయించుచుందురు. ప్రబంధములు సేవించి నందుకు ఫలితము అందు సాయించిన ప్రకారము తెలిసికొనుటకును అనుష్ఠించుటకును శక్తులైనగాని, వైష్ణవత్వసిద్ధి కలిగి "తళువప్పాడియాడవల్లార్ వైకుందమేరువరే" అనుప్రకారము ముక్తులగుదురు. కేవలపాఠమమాత్రమైన యెడల "దర్వీపాకరసంయథా" అనియు"చతుర్వేదధరోవిప్రోవాసు దేవంనవిన్దతి । వేదభార భరాక్రాన్తస్సవై బ్రాహ్మణగార్దభః" అనియు"భాగవతసన్నికేట- వేదార్థజ్ఞానాదికళై యుడయవళ్ కుఱుక్కుమశుమన్ద కఴుత్తైయోపాతి" అను శ్రీవచన భూషణ వాక్య ప్రకారము మాకు నాలాయిరము వచ్చును మూవాయిరను వచ్చునని యహంకరించడమునకు హేతువై అప్రయోజకమై పోవును "పాఠాదేవ ప్రశమితతమః" అని చెప్పబడియున్నదే యనగా శబ్దార్థజ్ఞానము లేక పోవుటచే హేయోపాదేయము లివియని తెలిసి వ్యవహరింప యోగ్యత లేనందున తమోనివృత్తి కానేరదు. అయితే ఇట్లు చెప్పుట తత్ప్రభావపరము "కూరుతల్ వల్లారుళ్ళేల్ కూడువర్ వైకుందమే" అని ఈ పదిపాశురముల నను సంధించు వారు ముక్తులగుదురని సాయించిరని ఆపదిపాటల నను సంధించి తద్విరుద్ధమైన భాగవతాప చారాది ప్రవృత్తియందన్వయించి రేని ముక్తులు కానేరరు. ప్రతికూల్య నివృత్తి కలిగినచో పాఠమే చాలునని చెప్పినను చెప్పవచ్చును గాన ఈ పదిని సేవించి నారనునది తదర్థ జ్ఞాన తదను రూపానుష్ఠాన పర్యంతము వివక్షితము.

"మ్లేచ్ఛనుం భక్తనానాల్ పావన తీర్థ ప్రసాదనామెన్ను" పరమవిలక్షణ సంబంధ స్వీకారమును జగద్విదితముగా భగవదాజ్ఞా సిద్ధమని నిర్భయులై

గ్రంథస్థములుగవిధించెడుపూర్వాచార్యు లొకరైనను ఒకరహస్య గ్రంథములో నైనను భగవత్ప్రపన్నుడు అహంకార నివృత్తి కొఱకును సర్వధర్మ పరిత్యాగమునకును కలంజ భక్షణాదులు జేయుమని చెప్పియుండలేదే చెప్పక పోయినను దూషణము లేక పోయెనేని గ్రంథములయందుక్తమైన అహంకార నివృత్తికిని విలక్షణ వర్తనమునకు నుపయుక్తములని చేయవచ్చునే యనగా ప్రబంధరాజ వచన భూషణాది దివ్యశాస్త్రములందు శతశః దూషించిన అకృత్యాకరణాదులు జేయుట భగవన్మాయా ప్రభావమని యెన్న తగినదే గాని శిష్టాచారమని చెప్పకూడదు గ్రంథస్థముగ జెప్పినయెడల అనధికారులు గర్హించి నశింతురని ఐతిహ్య సిద్ధముగనైనను సంప్రదాయ యుక్తముగనైనను ప్రవర్తించుచున్నారని తలచితిమేని పూర్వాచార్య వచనానుష్ఠాన విరోధముగాక యుండెనేని ఒప్పుకొనవచ్చును. అట్లుగాక వైదిక పరమవైదిక విరోధము లనేక ములుండుటచేత అట్లు చెప్పకూడదు, శాస్త్రములలోనొక పరమార్థము చెప్పిరేని అందు కపేక్షితమైన అంగోపాంగములు ఐతిహ్యములచేతను సంప్రదాయాదులచేతను సంగ్రహించ వలయును ఇంతియకాని సకల శాస్త్రదూషితములై శిష్ట గర్హితములైన తదర్థము లుపదేశ పరంపరా ప్రాప్తములని గ్రహించ కూడదు. ఇట్లు శాస్త్రములచే తెలిసికొన వలయునో, రజస్తమోద్రేకములై "అత ఏవాహారదోషం జ్ఞాన విరోధి" యను న్యాయ ప్రకారము అర్థపంచక జ్ఞానవిరోధములై జాతిదుష్టములై ప్రాకృత స్పృష్టదుష్టములై అత్యంత హేయములై లోక సాధారణముగ నందరు పరిత్యజించెడు నింద్యములైన నిషిద్ధ ద్రవ్యములు ఆకారాంతరముల చేత కూడునని ఆసుర ప్రకృతులకు తోచునది తప్ప విశేషశాస్త్ర వశ్యులైన శిష్టజనములకు తోచనేరదు. అనధికారులు గర్హింతురనే భయములేక విలక్షణ జన్మవైష్ణవాను వర్తన తీర్థ ప్రసాదస్వీకారములు విధించెడు అధికారులు ఈ నిషిద్ధములను సహిత ముపదేశించిరేని అధికారిభేదముచేత కూడునని తోచును కదా! ఇది అవైదికులకు సయితము విరుద్ధమగునాచారముకదా! మఱియునిది బాహ్య మతస్థులకుఆగమోక్తాచారములు గానుండవచ్చునుగాని భగవత్ప్రవృత్తి విరోధిస్వప్రవృత్తి నివృత్తి విధించినదే హేతువు జేసి అవి విలక్షణుల కంగీకార మంటిమేని శాస్త్ర పరిగ్రహమై

నను భగవదుక్తిర్యైనను ప్రాక్తన శిష్టాచారమైనను ఒకటియులేని బౌద్ధమతస్థు లవలె ఆభాసోక్తులచే విపరీతార్థములు జెప్పుకొనుచు భగవన్మాయా కల్పిత ములగు కొన్ని ప్రత్యక్షములను జూపి భ్రమింపించి తిరిగెడి కొందరి అప్రామా ణికుల ఉక్త్యనుష్ఠానములు ఉజ్జీవనేచ్ఛ గలవారికి ప్రమాణముగ గ్రహించకూ డదు. అదియేమి వారుస్వతంత్రముగ నొక యనుష్ఠానమును కల్పించలేదే "ధ ర్మజ్ఞసమయః ప్రమాణం" అనియు "యద్య దాచరతి శ్రేష్ఠస్త త్త దేవే త రోజనః" అను న్యాయముచే శిష్టాచారమునే ప్రమాణముగ నంగీకరించి "ఆచార్యస్యప్రసాదేన మమ సర్వమభీప్సితమ్ । ప్రాప్నుయామీతి విశ్వాసోయ స్యాస్తి స సుఖీ భవేత్" అని స్వాచార్యవిశ్వాసముచేత తదాజ్ఞానువర్తనము జేసినయెడల యది యనర్థకర మగునా యని యంటిమేని స్వాచార్యాత్ క్షే యమని యంగీకరించునది. వారు తల్లక్షణ లక్షితులై శాస్త్రపాణులై ప్రబల ప్రమాణ పరతంత్రులై శ్రీవచన భూషణాది దివ్యశాస్త్రోక్తరీత్యా శిక్షించిరే ని గ్రాహ్యమగును అట్లు జేయక "తన్నైంజిల్ తోన్రినదే శొల్లి ఇదు శుత్త ఉపదేశవరవార్తై" యని కొన్ని విపరీతార్థములను కల్పించి "అణంగుకట్రారు మరుం తెన్నంగోరాడుం కళ్లుం పరాయ్" అను పాశుర ప్రకారము నిషిద్ధమ గు నీయనుష్ఠానములే సిద్ధోపాయమని శిష్టజనములకు తెలియకుండునటుల నొ కరి కొకరు సాంకేత్య భాషణాదులతో జెప్పుకొనుచు శతాంధన్యాయముగా పడు కూపములో బడెడు అప్రామాణికులను శరణుజొచ్చి తదాజ్ఞాపరిపా లనము జేసితిమేని "వోట్టైయోడత్తోడాఘు గలోడమాయ్" అను న్యాయప్ర కారము ఇరువురును మునిగిపోవుదురు గాన అట్టివారి సహవాసమును దూర ముగ పరివర్జించవలయు.

ఆచార్యుడు అహంకారార్థ కామోపహతుడు గాక లోక పరిగ్రహము గలవాడై "సాక్షాన్నారాయణోదేవః కృత్వామర్త్యమయీంతనుం మగ్నా నుద్ధరతేలోకాన్ కారుణ్యాచ్ఛాస్త్రపాణినా" అనువచన ప్రకారముశాస్త్ర పాణియై రక్షించువాడు ఆశాస్త్రము గుణానుగుణముగ బహువిధములై యుండుటచే "అసార మల్పసారంచ సారం సారతరం త్యజేత్ । భజేత్సార తమం శాస్త్రం రత్నాకర ఇవామృతమ్" అను వచనప్రకారము అసారమైన

బాహ్య శాస్త్రము, అల్పసారమైన పూర్వభాగము, సారమైన ఉత్తరభాగము మొదలగు విస్తరించి చెప్పునవి యంతయు విడిచి సారతరమైన విష్ణుగాయత్రియందు సారతరముగ మొదలు జెప్పబడు సంసార నివర్తకమగు పెరియతిరుమంత్రమును తదను రూపా నుష్ఠానములను విధించి ఆళ్వారాచార్యులు గ్రంథస్థములుగ నానతిచ్చి తామాచరించెడు ప్రకారములలో నొకటియైనను తప్పక తామాచరించి వీనినాచరింపం జెసెడు వాడైతేనే ఇరువరుల కుజ్జీవనము సిద్ధించునది. నీచస్పర్శము గల గురు మంత్రి దేవతలు పరిత్యాజ్యములని అచ్చాంబిళ్లె యానతిచ్చుచుందురు. అర్థస్థితి యిట్లుండ సంసార నివర్తకమూలమంత్రోపదేష్ట ఆచార్యుడని వాచామాత్రము చెప్పుకొనుచు "తృష్ణాతోయే మదన పవనోద్ధూత మోహోర్మిమాలే ధారావర్తే తనయ సహజ గ్రాహసంఘాకులేచ'' అనువచన ప్రకారము సంసార సాగరమునందు మునిగి తాను గట్టెక్క జాలక తన్నను సరించిన వానిని బద్ధసంసారినిగాజేసి ''పాపే కృతే యది భవంతి భయానుతాప లజ్జాఃపునః'' అనువచన ప్రకారము దుర్వాసనచేత పాపము జేసిన భయమును అనుతాపము లజ్జ మొదలైనవి కలిగి కృపా పాత్రుడు గాక మన కాచార్య సంబంధము కద్దని భయము జెరచి "కాదు శెయ్‌వాన్ కోదైశెయ్‌దు కడ్డై మురై వాళ్ళికైయుం పోమేక్" అను ప్రకారము నదియు లేకుండునటుల జేసి వ్యభిచారి చెప్పెడు పతివ్రతా ధర్మములవలె హాస్యాస్పదములై అప్రయోజనములై యుండును. వారి యందు పసలేక పోయినను "విశ్వాసః ఫలదాయకః" అనువీని దృఢాధ్యవసాయముచేత మాత్రము ఫలప్రదము కాదోయని యంటిమేని ఈ విశ్వాసము వేద బాహ్యునికి సయితము కలదు. "గురూపదిష్ట మార్గేణ జ్ఞానకర్మసముచ్చయాత్ । మోక్షోబంధ విరక్తస్య జాయతే భువి కస్యచిత్", అను నట్లువేదబాహ్యునికిని గురు విశ్వాసము తదుపదిష్ట మార్గప్రవర్తకత్వమునుఅందుచే మోక్షము తప్పదను దృఢాధ్యవసాయమును మిక్కిలి కలదు ప్రమాణపరతంత్రుడైన వానికి ఆచార్యుడు శాస్త్రజ్ఞుడు కావలయు. జ్ఞానానుష్ఠానసంపన్నుడు కావలయు సత్సంప్రదాయసిద్ధుడు కావలయునను నవియంతయు నపేక్షితములుగా నుండును. బాహ్యమతస్థులకు ప్రమాణాపేక్షయొకటియు

లేనందున ఆచార్యనిష్ఠ మిక్కిలి పరిపూర్ణముగనుండును ఇది కలిగిన మాత్ర ముచే పరమపురుషార్థ విలక్షణ మోక్షప్రాప్తి చెప్పకూడదు. గురుమంత్రదేవతా భేషజ విషయములందు దివ్యశక్తి కలిగి యుండినను విశ్వాసము లేనిచో కార్యకరముకాదని విశ్వాసావశ్యాపేక్షితత్వము చెప్పినదింతియకాని శుక్తి యందురజత బుద్ధిజేసి విశ్వసించిన నది నిశ్చయము కానేరదు.

ఈశ్వరుని దయాది గుణములకు ప్రకాశకముగాన స్వాశ్రితుల నిషిద్ధానుష్ఠానము లతనికి మిగుల ప్రీతిగా నుండుననియు "దోషోయద్యపి తస్యస్యాత్" అని చెప్పియున్నదేయనియు, కొందరు తమ విద్యాబలముచే కుతర్కములు చెప్పుకొనుచు వేదశాస్త్ర పురాణేతిహాసాదులు కట్టలేని కావేరివలెనున్నందున బాహ్య కుదృష్టులవలె శాస్త్రవిరుద్ధార్థములుపన్యసించుచు నందు చెప్పబడినది యొకటిగానుండ వేఱేకొన్నియర్థములను చెప్పుకొనుచు తమకిష్టమైనటులసంచరించుదురు. మఱియు నిషిద్ధప్రవర్తకులు చెప్పుటయేమనిన; తిరుమంత్రమునందుస్వరక్షణేస్వాన్వయనివృత్తిచెప్పబడి యున్నందున నిషిద్ధములు కూడదని త్యజించిన యెడల స్వరక్షణేస్వాన్వయము వచ్చునుగాన తనరక్షణమునందు తన కన్వయము లేదని చెప్పెడు మంత్రమునకు ఈనిషిద్ధానుష్ఠాన ప్రవృత్తియే యర్థమనియు తద్వివరణములైన ద్వయమునకును చరమశ్లోకమునకును ఇదేతాత్పర్యమనియు "సూక్ష్మః పరమ దుర్జ్ఞేయః సతాం ధర్మః ప్లవంగమ" అనురీతిని సాధువులాచరించునది పరమ దుర్జ్ఞేయమైన ధర్మసూక్ష్మముగాన అహంకారరాహిత్యమునకు హేతువైన ఈనిషిద్ధానుష్ఠానము ధర్మసూక్ష్మమనియు వేదశాస్త్రములందు "బ్రాహ్మణోవై సర్వాదేవతాః" అని చెప్పుచుండగమహర్షులు ధర్మసూక్ష్మ దర్శనముచే అహంకారరాహిత్య జన్మములని "స్త్రియస్సాధుః" శూద్రస్సాధుః" అనియు "శ్వపచోపిమహీపాల విష్ణుభక్తోద్విజాధికః" అనియు చెప్పిరిగాన ఈనిషిద్ధానుష్ఠాన మహంకార నివృత్తికి హేతువైనందున అవశ్యమాచరణీయమనియు, మరియు ననేకములుగా వినువారి చెవులకు తీక్ష్ణమయ్యెడు విపరీతార్థములు చెప్పుకొనుచు దార పుత్రాదులను విషయ ప్రావణ్యమును అహంకారమమకారములను విడువజాలక విడచితిమేని స్వరక్షణే స్వా

న్యాయము వచ్చునని సకలేతర పరిత్యాగ పూర్వక స్వీకారము విధ్యనుష్ఠానములచేత చూపించెడు ఆళ్వారాచార్యుల ప్రాక్తన శిష్టాచారముల నంతయు భస్మముజేసి తిరుగుచున్నారు. ఇది భగవన్మాయా కార్యమని యెంచ వలయు.

ప్రపన్నునికి అకృత్య కరణాది చతుర్విధ నిషిద్ధానుష్ఠానములును ఉపాయాంతర ప్రతిపత్తియును ప్రయోజనాంతరములైన దార పుత్త్రాద్యైహిక భోగములును స్వర్గాది పరలోక సుఖములును స్వాత్మానుభవసుఖము మొదలగునవి యంతయు బరిత్యజించి "శైలేయ్‌కణ్ణియరుం పెరుంశెల్వముం నన్మక్కళుం మేలాత్తాయ్ తంప్పైయుమవరే యినియావార్" అనునట్లుండవలయు. ప్రపన్నునికి ఉపాయాపాయ ప్రవృత్తులు రెండును త్యాజ్యమను నర్థము తిర్వాయ్ మొழிనాల్గవపది ఆఱవతిరువాయిమొழியందు "తీర్పారైయామిని" అని స్వాపదేశాన్యాపదేశములచేత సుస్పష్టమై యున్నది. అందుస్వాపదేశము నసిద్ధోపాయము శీఘ్రముగ చేకూరనందున ఉపాయాంతర ప్రవృత్తులచేత దేవతాంతరముల నారాధించి "సోమపాః పూతపాపాః" అనుప్రమాణ ప్రకారము సోమపానాదులచేత నిష్పాపులు కావలయునని తదనుష్ఠాన ప్రవర్తకులైన సాధనాంతరనిష్ఠులను చేర్చుకొని ఉపాయా నుష్ఠానమున కుపక్రమించుసమయమునందు సంబంధజ్ఞానము పైకొని యధ్యవసాయ చాంచల్యము దీరునట్లు నీవు స్వతంత్రుడై స్వప్రవృత్తి యందన్వయించ వచ్చునా అనన్యార్హశేషత్వాద్యాకార షట్కములచేత పిరాట్టితో సమమైన పరిశుద్ధాత్మ స్వరూపమునకు దేవతాంతర సాధనాంతరములును తన్నిష్ఠులసహవాసమును స్వరూపనాశకమగు గాని ప్రాప్తి సాధనమగునే యని స్వరక్షణవృత్తులను నివారించుట చేత ప్రపన్నునికి ఉపాయాంతర ప్రవృత్తి కూడదని చెప్పబడినది.

ప్రపన్న జనకూటస్థులైన ఆళ్వార్లు "తీర్పారైయామని" అని తిరువాయ్ మొழிకి అన్యాపదేశమందు నాయకుని ప్రాపించలేక ఆழ்వార్ నాయకిమోహంగతయైయుండగ తల్లిచలించి ఈసతి మోహము నికృష్ట దేవతారాధనచేతను క్షుద్ర దేవతలకు ప్రియమైన మద్యమాంసాదులచేతను తీర్చవలెయునని యెరుకలసాని యొకతె చెప్పిన ప్రకారము నిషిద్ధానుష్ఠానమునకుపక్రమించగా నొకసఖి శీఘ్రముగ వచ్చి అయ్యయో! దీని ప్రకృతి తెలసిన మీను స్వరూపనాశకము

లైన నిషిద్ధ ప్రవృత్తులయందు అన్వయింప దగునా! ఈయాడ కూతురికి క్షుద్ర దేవతా ప్రసంగము కలదా "ద్రవ్యాం నింద్యసురాధి దైవతమతిక్షుద్రంచబాహ్యాగమః" అను వచనరీత్యా తనస్పర్శమాత్రముచేత తనతో సమానముగా జేసెడు అత్యంత నిషిద్ధ ద్రవ్యములైన మద్యమాంసాదుల స్పర్శమును ఈయెరుకలసాని మొదలుగా గల యతిక్షుద్రులగు విపరీతార్థ బోధకుల స్పర్శము సహించునా! భగవన్నామ సంకీర్తనమును పరమ వైదికులై ప్రమాణ పరతంత్రులైన శ్రీమహా భాగవత పాదరేణు స్పర్శము తప్ప వేఱొకటి కూడునా! మనవైష్ణవ కుల మర్యాదకు నిషిద్ధప్రవృత్తులు చేరునాయని "తీర్పారైయామిని" యని ప్రారంభించి ఈమెవ్యాధిని యోచించి చూడగా పార్థసారథియైనవాని ఆశ్రిత పారతంత్ర్యముచేత మోహంగతయైనది" ఇదిక్షుద్రదేవతా ప్రసంగముకాదు వాని చిహ్నముల జెప్పగా ఈమె మోహము దీరును మీరట్లు చేయక విప్రతి పన్నభాషిణియైన యెరుకలసానిమాటవిని చేయకూడని వైష్ణవత్వ హానికరములైన నిషిద్ధ కృత్యములందు అన్వయించి మద్యమాంసములచేత ఈమెజీవించుటకు ఇదేదివ్యౌషధమని రాజసతామసదేవతా ప్రియములైన నిషిద్ధాన్నములచేతను కళాహీనమై దేవతా విష్టమై యిదిఆడెడు ఆటచేతను ఈమె మనకు లభించునా, ఈమె రూప శ్రీ నశించుచు వచ్చుచున్నది, ఈ నీచస్పర్శమునకు ప్రాయశ్చిత్తముగ భాగవత శ్రీపాదరేణువును ఈమె మీదనుంచి అప్రామాణికమైన దీని విరుద్ధ వాదములను వదలి వేదవిదగ్రేసరులై ప్రమాణ పరతంత్రులైన జ్ఞానాధికులను పురుషకారముగా గొని నిత్య సూరి నిర్వాహకుని నాశ్రయించి ఈమె మోహంగతమైన వ్యాధిని తీర్చుకొనక మద్యపానము జేసి దేహము మరచి, గీతములు పాడెడు దీనితో మీరుకూడి యుదుక వాద్యములచేత నర్తనమాడు ఈ యన్యాయమును నేను చూడజాలను. కణ్ణపిరానుదివ్యసంకీర్తనములచే నీమెయొక్క మోహంగతమైనవ్యాధితీరును అనినిషిద్ధానుష్ఠానమును తన్నిష్ఠుల సహవాసమును నివృత్తింపించుటచేత ప్రపన్నునికి అకృత్యకరణాదినిషిద్ధానుష్ఠానమును, తన్నిష్ఠుల సహవాసమును త్యాజ్యమని చెప్పడమైనది.

నాథయామున యతివర ప్రభృతుల ఈ కృత్యానుష్ఠానముల గొని తదనుగుణ

సమ్యగనుష్ఠానము గలవారై ప్రాప్యప్రతిబంధక నిషిద్ధానుష్ఠాన పరిత్యాగపూర్వకమైన అనుష్ఠానమే యితరుల కుపదేశించి ధరిజేర్చ గలవారైన నమ్మాళ్వార్ భూత భవిష్య ద్వర్తమాన కాలత్రయ వ్యవసాయ జ్ఞానము గలవారైనందున "శ్రుతిర్నష్టా స్మృతిర్లుప్తా ప్రాయేణ పతితా ద్విజాః। అంగానిచ విశీర్ణాని హావృద్ధోవర్ధతే కలిః" అను ప్రకారము కలి ప్రవృద్ధమగుచుండగా విపరీతార్థ బోధకులును విపరీతానుష్ఠానములును ప్రబలమైయ్యే వర్తించునని కటాక్షించి విష్ణు సిద్ధాంతమునందు అవిచారబడ కుండు నటుల జేయ దలచి ఎంబెరుమానార్ల భవిష్యదాచార్యావతారమును చూచి "పొలిగ పొలిగ పొలిగ" యని తాము మంగళా శాసనము చేసి "చెన్నుతో ఇదుయ్మిక్ తొండీరెన్ను" వారినే ముముక్షువుల కందరికి సమాశ్రయణీయులుగా చెప్పి మధురకవి నాథమునులకు త్రిదండ కాషాయాదులతో కూడా ఆయవతారమును తెలియ వచ్చునటుల విశేషకటాక్షము జేసి మనకు చరణీయులుగా, మన కార్యమునకు నిర్వాహకులుగా నుందురని, ఈ యవతారమే సర్వోత్తారకము వీరే మనదర్శనమున కంతయు గురుపరంపరామూర్ధాభిషిక్తులని సాయించినందున, నాథమునులు మొదలు అస్మదాచార్యుల పర్యంతము ఎంబెరుమానారే ఉత్తారకాచార్యులుగాను గ్రంథస్థములుగ సాయించినవారి ఉక్త్యనుష్ఠానములనే ప్రమాణములుగ నంగీకరించి వారినే ఉత్తారకులుగా జూపెడు అద్వితీయ సదనుష్ఠాన సంపన్నులగు సదాచార్యులే మహోపకారకాచార్యులుగా బుద్ధి చేసి, ఇతరుల కుపదేశించి "రామానుజార్యో గురు రితి చ పదం భాతి నాన్యత్ర" యని మరియొక విషయమందలి ఇట్టి ఆచార్యత్వమున్నదని చెప్పిరేని రుచి భేదములచే, ననేక విపరీతార్థములు జొరబడునని ఆగామ్యనర్థమును నిరీక్షించి ఇతర నిషేధము చేయుటచేత గ్రంథస్థములైన వారి ఉక్త్యనుష్ఠానములే ఉపాదేయములుగా నుండును గాన, ఎంబెరుమానార్ తిరువడిగళే శరణమని చూపెడు ఆచార్యులే "మాతా పితా యువతయః" "ఇహాకాముష్మికంగురుః" "ఇరుప్పిడం వైకుందం వేంగడం" అను మొదలైన వియంతయు వారుగా తలచి సర్వోత్తారకులైన ఎంబెరుమానారులే ఉత్తారకాచార్యులుగా నధ్యవసించి "క్షేమస్య పవహా యతీంద్రభవ చ్ఛ్రితానాం" అను ప్రకారము వారుచేసిన

చరమకాల ప్రవృత్తియే రక్షకమని బుద్ధిజేసి "జగదాచార్య రచితే శ్రీమద్వచనభూషణే, తత్వ జ్ఞానంచతన్నిష్ఠాం దేహినాథయతీంద్రమే" అనిప్రార్థించుచు క్రమముగ నందు జెప్పియుండెడు సదనుష్ఠానముల ననుసంధించు కొనుచు అవి హస్తంగత మగునటుల తదనుష్ఠాన సంపన్నులగు పరమార్థులతో సహవాసముచేయుచు, అహంకార మగ్నిస్పర్శము వలె దగ్ధము చేయుననియు, విషయస్పర్శము విషభక్షణము వలె సమాప్తిజేయుననియు, భాగవతాపచారము త్రిశంకువు వలె కర్మచండాలునిగా జేసి అనంతరము దగ్ధపటమువలె విరూపిగాబోవునటుల జేయునని భయపడి, పరదోష నిరీక్షణము చేయక సర్వభూతదయాపరుడై ఆనృశంస్యముచేత విహిత కర్మమునులోకసంగ్రహార్థముయధోచితముగ ననుష్ఠించుచు ఆహారానువర్తన సహవాస నియతులు గలవాడై దేహమందును దార పుత్రాదులయందును అనురాగమును వదలి ప్రకృతి వికారము కలిగినేని ధర్మభోగ బుద్ధుల రెంటిని విడచి శాస్త్ర విహితమైన స్వదార విషయమునందు కాదాచిత్కముగ, మూత్రోత్సర్జనము వలె నివర్తించు కొనుచు "కులాల కీటవత్" అను ప్రకారము కుమ్మర పురుగువలె వర్తించువాడుభగవత్ప్రియతముడై తదనుగ్రహముచే చరమ కాలమునందు అత్యంతార్తిగలవాడై "నలమందమిల్లతోర్ నాడు" యనునట్లు పరమపద ప్రాప్తియం దానందనిర్భరుడై యుండును "కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి" అను వచనరీతి నీయర్థము సత్యము; మీరిప్పుడు దృష్టాధికారమునందు నిలచి నిర్భయులై సుఖముగ నుండు డని మన పూర్వాచార్యుల ఆజ్ఞావచనము. పైన సూచించిన విహిత విషయమగు స్వదారగమనము ధర్మభోగ బుద్ధుల రెంటిని విడచి కాదాచిత్కముగమూత్రోత్సర్జనమువలెనివర్తించుకొనుచునుండవలయునని జెప్పినది శ్రీవిభూతి యందు స్వరూపజ్ఞానానుష్ఠానములు లేని సంసారులకు నీమాత్రమైనను జెప్పక కేవలము త్యాజ్య మని యంటిమేని అది వారలకు నతృప్తిని కలుగజేసి శ్రీదర్శనమునకు విముఖులగునటుల చేయునని తలచి జెప్పడమైనదేకాని భగవదనన్య భోగత్వైకరూప స్వరూపజ్ఞానముగల యధికారికి యివి మిక్కిలి త్యాజ్యమగుట స్పష్టమైయున్నది.

విశిష్టవేషవిషయమగు శాస్త్రముచేవిధింపబడెడుస్వదారయందు భోగము

తాదృశ శాస్త్రనిషిద్ధమై స్వపర వినాశహేతువైనపరదారభోగము వలె లోకవిరుద్ధము కానిదై, తప్త లోహప్రతిమల నాలింగనము సేయించెడు మొదలగు ఘోర దుఃఖానుభవస్థానమగు నరక హేతువు కానిదై,యిట్లు ప్రత్యక్ష పరోక్ష సిద్ధములగు లోకవిరుద్ధత్వ నరక హేతుత్వములు గానివైనను యనన్య భోగత్వరూప మగు స్వరూప మునకు విరుద్ధమై "శాన్తోదాన్త ఉపరత స్తితిక్షు స్సమాహితో భూత్వా త్మ న్యేవాత్మానం పశ్యేత్'' ఇత్యాదుల చేతను తిరుమంత్రాదులచేతను ఉపాసకునికి గాని ప్రపన్నునికి గాని తార తమ్యము లేక ఇరువరులకు విషయ భోగము కూడదని ప్రతిపాదించెడు వేదాన్తమునకు విరుద్ధమై దోషదర్శనముచేతను అప్రాప్తవిషయ దర్శనము చేతను విషయ భోగమును పరిత్యజించి యుండెడు ఆచార ప్రధానులైన శిష్టులచేత హేయమని నిందించబడినవై అప్రాప్త విషయవిరక్త ప్రియుడగు నాచార్యుని కనభిమతమై ఆచార్యముఖకమల వికాసానుభవరూప ప్రాప్యమునకు ప్రతిబన్ధకమై ఇట్లనేక ప్రకారములుగ ననర్థావహమై యుండుటచే నీయధికారికి పరిత్యాజ్యమని సాయించబడినవి.విహితవిషయ ప్రవృత్తియందు కామముచే గలిగెడు భోగ్యతా బుద్ధిని విడచి ఉపాసకులగు మహర్షులు మొదలగు శిష్టులు పైతృక ఋణమోచక ప్రజోత్పాదనార్థముగ ఋతుస్నాన దినమున నంగీకరించకపోవుటచే, భ్రూణహత్యాది దోషముకలదని చెప్పుటవలన ధర్మబుద్ధిచే ప్రవర్తించువాని వలె, ఈ యధికారి ధర్మబుద్ధిచే ప్రవర్తించినను సిద్ధధర్మనిష్ఠుడైన వీనికన్య ధర్మాన్వయము విరోధియగుటచే,ననన్యోపాయత్వ రూపమగు స్వరూపము నశించును; ఇట్లు ధర్మభోగ బుద్ధులచే ప్రవర్తించుట వలన అనన్య భోగత్వరూప మగు స్వరూపము నశించును గాన నేవిధముచేత నైన నీయధికారికి విహిత విషయప్రవృత్తి కూడదనియు నట్లన్వయించి రేని స్వరూపహాని తప్పదనియు నందుచే పరిత్యజించ వలయుననియు; ఇవి శ్రీవచనభూషణ దివ్యశాస్త్రమునందు పిళ్లె లోకాచార్యులానతిచ్చిన వాక్యములకు శ్రీశైలనాథార్య పరిపూర్ణ కృపాపాత్రులై యతివర పునరవతారమగు శ్రీమణవాళ మహామునులు ఆనతిచ్చిన వ్యాఖ్యాన పఙ్క్తులయందు పరిష్కృతమై యున్నవి.

ముముక్షువులకు పూర్వాచార్యులు ఆనతిచ్చిన యింకొక పరమార్థముకలదు.అవి యెవ్వియనగా ఈయాత్మ గుణములన్నియు కలిగినను మనకు యివికలవనియహంకరించిరేని నహుష నృగ యయాతులయజ్ఞ దాన తపస్సుల వలె ఆత్మగుణములన్నియు వ్యర్థములై వారును భగవన్నిగ్రహపాత్రులగుదురు.కనుక తన్నునిత్యసంసారుల కయిననునికృష్టునిగనను సంధించుకొనుచు నిరహంకారిన్నై వర్తించవలయు. ఇప్పరమార్థము తిరువుళ్లమయ్యే "నీశనేనిరైవొన్నుమిలె" యనియు "అమర్యాదః"క్షుద్రఃయనియు"తతోనికృష్టే"యనియు"పాపానాంప్రథమోస్మ్యహం" అనియు "వృత్త్యాపశుః" అనియు మన పూర్వాచార్యులందరను సంధించుకొనుచు నుండుట ప్రాప్తమై యుండగా భాగవతుల యందు అహంకరిచి తాను వారితో సముడనియు వారికంటె దానధికుడనియు తలచెనేని ఆత్మనాశమగును.

ఇక భాగవతాను వర్తనక్రమము,పిళ్లలోకాచార్యు లానతిచ్చిన ప్రకారము భాగవతులు సత్కారయోగ్యులనియు,సహవాస యోగ్యులనియు, సదానుభవయోగ్యులనియు త్రివిధముగ నుందురు;అందు సత్కార యోగ్యులను వారు నామరూప ప్రధానులు "యే కంఠలగ్న తులసీ నళినాక్షమాలా, యే బాహుమూల పరిచిహ్నిత శంఖ చక్రాః। యే వా లలాట ఫలకే లసదూర్ధ్వపుండ్రాస్తే వైష్ణవా భువన మాశు పవిత్రయంతి" అను ప్రకారము భగవన్నామములను చిహ్నములను ధరించియుండువారు "చోరోప్యవధ్యాఃశ్వపచోప్యదూష్యాః ఋణ్యాప్యపీడ్యో పశురప్యబాధ్యాః । యోహ్యంకితో వైష్ణవ లాంఛనేన, పూజ్యశ్చ విష్ణోః ప్రతిమాసమానః" అనువీరి జన్మవృత్తములు యెట్లుండినను అవమతి చేయక శక్త్యను గుణముగ కించిత్కరించి భగవ ద్విగ్రహమునందపచారమునకు భయపడునటుల ఆవిషయమందును భయపడి అర్ఘ్యపాద్యాదులచేత తిరువుళ్లము సుప్రసన్నమగునటుల నారాధించుచు బ్రవర్తించవలయు; అవమతి చేసిరేని "మద్భక్తం శ్వపచం వా పి నిందాం కుర్వంతి యే నరాః,పద్మకోటి శతేనాపి న క్షమామి వసుంధరే" అనువచనప్రకారము భగవన్నిగ్రహపాత్రులై "అనాచారాత్ దురాచారానజ్ఞానాత్ హీనజన్మనః । మద్భక్తియోనిందకః సద్య శ్చండాలతాం వ్రజేత్" అనువచనప్రకార

ము కర్మచండాలురై పోవును గాన, జన్మవృత్తములచేత నెట్టి హీనులైనను బ్రహ్మహత్య వచ్చుటకు, శిఖాయజ్ఞోపవీతధారణము చాలినట్లు, అపచారము ఘటించునుగాన, వారి నవమతిచేయక కించిత్కారము చేతను,స్వనైచ్యోక్తులచేతను సంతోషింపజేసి యొదిగి వర్తించవలయు. సహవాస యోగ్యులను వారు జ్ఞానప్రధానులు "అపగతమదమానై రంత్యమోపాయనిష్ఠై, రధిగతపరమార్థై రర్థకామానపేక్షైః, నిఖిలజన సుహృద్భిస్సర్జితక్రోధలోభై ర్వరవరముని భృత్యైరస్తుమేనిత్యయోగః" అనుప్రకారము త్యాజ్యోపాదేయ వివేకజ్ఞాన పరిపూర్ణులై, త్యాజ్యములను పరిత్యజించియుపాదేయములనుపరిగ్రహించి, చరమోపాయనిష్ఠులైన దృఢాధికారులు, సహవాసము చేయుటకును "బోధయంతఃపరస్పరం" అను వచనప్రకారము ఒకరికొకరు ప్రకృతిసంబంధనిబంధనముగ, కొంచమైనను కాలుష్యము రాకుండునట్లు బోధకులగుటకు యోగ్యులు. సదానుభవయోగ్యులనువారు, అనుష్ఠాన ప్రధానులు, వారలెవరనగా, త్యాజ్య భూమిన్నైన ఈవిభూతియందు జిజ్ఞాసగలిగి భగవదనుభవలాభముచేత పరమార్తులై బాలోన్మత్తపిశాచావిష్టులవలె, తమదేహము మఱచి యొకచోటనుండక,సంసారులను చూడజాలక "ఇవియెన్నవులకియురేర, కొడువులకంకాట్టైలే" అని వీరలతో నిచ్చటనుండుస్థితి, "వరంహుతవహాజ్వాలాపంజరాంతర్వ్యవస్థితిః" అనుప్రకారము అత్యంతమసహనై దివారాత్రులు నిద్రమాని, బాష్పాకులలోచనులై, లజ్జవిడచి తిరునామములుజల్పించుచు, రోదనముసేయుచు, నవ్వుచు, పాడుచు, మోహించుచు, దీర్ఘనిశ్వాసముచేయుచు, భ్రాంతులని లౌకికులునవ్వునట్లు సంచరించుచు,సుఖదుఃఖమానావమాననిందాస్తుతి, శత్రుమిత్రలోష్ఠకాంచనసములై జగత్తునంతయు భగవదాత్మకముగా భావించుచు, సమస్తవస్తువులయందు, ప్రాతికూల్యనివృత్తికలిగిసకలముభగవదాత్మకముగా దర్శించుచు, తత్ప్రాప్తియందపేక్షచే, అనుత్తమభుక్తిముక్తులను తృణీకరించి యందుచేవానికి క్షణమైనను తమ్ము విడనాడి నిలువజాలని అత్యంతప్రియతములగు మహాత్ములు.

ఇట్టి యధికారులే ఆచార్యులుగా వరింపబడుటకు, తీర్థప్రసాదస్వీకారము చేయుటకు యోగ్యులై ఈచేతనులను దరిజేర్చశక్తులని విశ్వసించితగి

ఈముప్వురిలో ప్రథమాధికారులు జన్మాంతరములోతప్ప, యీజన్మమునందు దరిజేరలేరు, తమయందు అపచారపడినవారిని నశింపజేయశక్తిమాత్రమేవారికి అధికారము. రెండవ యధికారి, సహవాస యోగ్యుడై, జ్ఞానప్రధానముచేత నొకరికి సహకరించి, తనఆచార్య ప్రసాదముచేత, తాను దరిజేరగలవాడై, ఉజ్జీవించునదే వానికివైభవము. మూడవ యధికారి సర్వేశ్వరునికి పిరాట్టి వలె అత్యంతప్రియుడై, సర్వేశ్వరుని భ్రుకుటీభటునిగా వశీకరించి "శ్రీమేలెమరే తాళుపిరప్పుమ్మాశత్తిరిదుపెత్తునమ్ముడై వాళ్ళ్వు వాయ్కిన్దవా" అనియు, "యేమర్ క్కీళ్మేలెళుపిరప్పుంవెడియావెన్నరకత్తైన్నుం శేర్ తల్ మూరినరే" అని చెప్పెడు ప్రకారము, తమసంబంధ సంబంధులనుద్ధరింపించసమర్థులు. ఆచార్యవరణము చేయునదియు, తీర్థప్రసాదములు స్వీకరించునదియు, తత్సంబంధముచేత, తనఅవిద్యాకర్మవాసనారుచులు నశించి తాను జీవించవలెనుగాన అనధికార సంబంధము "పోట్టైయోడత్తోడాళుగలోడమాయ్" అనుప్రకారమువినాశహేతువుగాచెప్పబడును. అభిమానదూషితుల తీర్థప్రసాదాద్యంగీకారము జ్ఞానమాంద్యహేతువు; ఉపాయాంతరనిష్ఠుల తీర్థ ప్రసాదాద్యంగీకారము జ్ఞానమాంద్యహేతువు. ప్రయోజనాంతర పరులతీర్థ ప్రసాదాద్యం గీకారము జ్ఞానమాంద్యహేతువు అని చెప్పబడుటచేత ప్రణవోక్త భాగవత శేషత్వ పర్యంతభగవచ్ఛేషత్వ జ్ఞాన శూన్యులైన అహంకార గ్రస్తుల యొక్కయు, మధ్యమ పదోక్తసిద్ధోపాయాధ్యవసాయములేని వారైన ఉపాయాంతర నిష్ఠులయొక్కయు, చరమ పదోక్త అనన్యభోగత్వ స్వరూపజ్ఞాన శూన్యులై శబ్దాది విషయప్రవణులై పుత్రదారాది సక్తులై సంసార బద్ధులైన ప్రయోజనాంతర పరుల తీర్థప్రసాద స్వీకారము తత్సహవాసము జ్ఞాన మాంద్యహేతువులైనందున త్యాజ్యములనిప్రమేయరత్నమునందుచెప్పబడినవి కావున, మంత్రార్థ జ్ఞానానుష్ఠానహీనులై అహంకారార్థ కామ పరవశులైన వారి సహవాస సదానుభవములు దూరతః పరిహరణీయములుగా నుండును, అయితే సత్కార యోగ్యులవద్ద తీర్థాద్యంగీకారము పరిహరించితే తా నధికారియను అహంకారముచే ౹రివ్యాదయమునకు బాధకమైనందు వలన దోషము సంభవించ దోయనియంటది వారియందు దోషమును తనయందు గుణాధిక్యము కద్దని తలచితేని

దోషము వచ్చును; అట్లు తలపోయక వారేమి చేయుదురు అవిద్యా ప్రభావమ దియని తనకు సిద్ధించిన మాత్రము సహించి దోషము వారిమీదనారోపించి నిందించక ప్రణిపాతాదులచేత సవినయముగా వర్తించిరేని నొకదోషము రానేరదు తన్ను సంసారుల కంటె నికృష్టునిగా ననుసంధించుకొనుచు తనకు కలిగిన గుణములకు మూలము "అదువుమవన దిన్నరుళే" అనియు వానిని పోకా తుక కటాక్షము కలిగిన అహంకారము రానేరదు వారు కలవరపడుదు రని వారి తిరువుళ్ళమునను సరించితిమేని వారొకనిషిద్ధానుష్ఠానము చేయుమని నియ మించిరేని నదియు జేయవలసి వచ్చును గాన తనవలన వారికి నొక విరోధము రాకుండునట్లు వర్తించుటయే యపేక్షితము. సహవాస యోగ్యులవద్ద తీర్థప్రసా దాంగీకారమునకు గుణ దోషములు రెండును లేవు చరమాధికారి వద్ద యంగీకారమే, వీనికి సముత్తారక హేతువు. ఇందుకు వర్ణాశ్రమ నియమముత దను గుణవృత్తి నియమము లేదు. అధికారి నియమమే యపేక్షణీయము. ఈయ ర్థము "పయిలుం తిరువుడైయార్ యెవరేలుం" అనియు "వానుళారరియలా గా వానవా వెక్ పరాగిల్ । పోనతంశెయ్‌దశేషు తరువరేల్ పునిదమన్నే" అనునట్లుయెట్టి నిహీనజన్మవృత్తులుగల వారైనను భగవ దనుభవ సంపత్తుకల వారై ఉపాయోపేయాధికారులైరేని మనకు స్వాములనియు తీర్థాద్యంగీకార మునకు యోగ్యులనియు ఆళ్వార్లు సాయించి యున్నందుచే ప్రపన్నుని కుజ్జీ వన హేతువై యుండును.

ఇట్లు సర్వ ప్రకారములచే నాశహేతువైన అహంకారమునకును వాటి కార్యమైన విషయ ప్రావణ్యమునకున్ను ఉత్పత్తిస్థానము తానగుటచే తన్నుబా చు నెడల సర్పదర్శనము చేసినట్లును, సంసార నివర్తకులగు శ్రీవైష్ణవుల చూచు నెడల బంధువుల చూచునట్లును, ఈశ్వరుని చూచు నెడల పితృవును చూచు నట్లును, ఆచార్యునిచూచు నెడల ఆకలి గొన్నవాడన్నము చూచు నట్లును, శిష్యుని చూచు నెడల అభిమతవిషయ దర్శనము చేసినట్లును, తలచిఅహం కారార్థ కామములు మూడును, అనుకూలురయందనాదరమును, ప్రతికూలు రయందు ప్రావణ్యమును, ఉపేక్షించు వారియందపేక్షయు, గలుగ చేయు లక్షించి, ఆత్మగుణములు మనచేతను అన్యులచేతను కలుగ నేరదనియు,

చార్య ప్రసాదముచే రాగల భగవత్ప్రసాదము వలన గలుగుననియు తెగించి, దేహయాత్రయందు పేక్షయు, ఆత్మయాత్రయందపేక్షయు, ప్రాకృత వస్తువులయందుభోగ్యతాబుద్ధి నివృత్తియు, దేహధారణము పరమాత్మ సమారాధన సమాప్తి ప్రసాధ ప్రతిపత్తియను బుద్ధి విశేషముగలిగి, తనకొక క్లేశము కలిగి నేని అవికర్మ పలమనిగ్నైన కృపాఫలమనిగ్నైన భావించి, తత్ప్రాప్తియందు ప్రీతియును స్వానుష్ఠానమునందు సాధనత్వ బుద్ధినివృత్తియును, విలక్షణులజ్ఞానానుష్ఠానములయందు వాంఛయును, ఉగన్దరుళిన స్థలములందాదరాతిశయమును ఆహారనియతియును అనుకూల సహవాసమును ప్రతికూల సహవాస నివృత్తియును, జ్ఞానానుష్ఠానములు గల సదాచార్య ప్రసాదముచే వృద్ధిచేయుచు ఉండవలయు నని, శ్రీవచన భూషణ దివ్య శాస్త్రము నందు సకలార్థ తత్వ విదగ్రేసరులగు పిళ్లలోకాచార్యులు నిగమించి సాయించిన వాక్యముల ప్రకారము భగవత్ప్రాప్తియందపేక్షగల ప్రథమ మధ్యమ చరమ పర్వప్రపన్నాధికారులకు ఇవి అవశ్యానుష్ఠేయములు.

శ్రీమతే రామానుజాయ నమః

జియర్ తిరువడిగళే శరణమ్.





శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమద్వరవర మునయేనమః



# ప్రపన్నానుష్ఠాన భాస్కరము.

## ( సంగ్రహము. )



౧. ప్రాతఃకాలమున ప్రపన్నుడు మేల్కొని యంజలిహస్తుడై వాక్య గురుపరంపరా పూర్వకముగ ద్వయము మొదలగునవి యనుసంధించ వలయు.

౨. అనంతరము జల మల విసర్జనము చేసి విధ్యుక్త ప్రకారముగ మృత్తికతో శౌచము జేసి నోరు పుక్కిలించి దంత ధావనము చేసి ఆచమనము చేయవలయు.

౩. తీర్థమాడునపుడు.— "అయిరంతోళ్" మొదలైనవి యను సంధించి స్నానముచేసి "శ్రీమతేరామానుజాయనమః" యని తుడుచుకొని మడివస్త్రము ధరించి ఆచమనీయము అంగన్యాస కరన్యాసములు చేయవలయు.

౪. తిరుమణ్ కాప్పు ధరించునపుడు.— "శ్రీమతే నారాయణాయనమః" యని స్థలశుద్ధి చేసి యొక యాసనముపై తిరుమణి పెట్టెను వేంచేపుచేసి "శ్రీ భూదేవ్యైనమః" యని తిరుమణికోపు అభిమంత్రించిశ్రీశైలేశతనయనుప్రారంభించి తిరుప్పల్లాండు మొదలైనవి తిరుమణి శ్రీచూర్ణము ధరించు పర్యంతము అను సంధించి తదనంతరము తిరుమణిత్తాళ్వడములు మొదలైనవి ధరించుకొని అంజలిహస్తుడై కేశవాదినామములు మొదలైనవి సేవించవలయు.

౫. కాలక్షేపము చేయుట. — శ్రీభగవద్విషయాది వ్యాఖ్యాన గ్రంథ కాలక్షేపము చేసి తీర్థవడిచేర్చి తీర్థము స్వీకరించి తిరుమణి పెట్టెను కట్టియుంచవలయు.

౬. సన్నిధి తిరుకాప్పులు తెఱచుట. — పెరుమాళ్లసన్నిధికి నఖిముఖముగదండము సమర్పించి తిరుప్పళ్లి యెఱుచ్చి మొదలైనవి యనుసంధించి "నాయకనాయక" యను పాశురాను సంధానముతో మూడుమారులు చెయితట్టి తిరుకాప్పులు తీసి తిరువాల వట్టము సమర్పించి తిరుప్పళ్లి శోధించి "మారిమలై" యను పాశురముతో పెరుమాళ్లకు మంత్రాసనము సమర్పించి "అన్రివులగ" మను పాశురముతో మంగళాశాసనము చేసి వాక్యగురు పరంపరాదులనను సంధించవలయు.

౭. సన్నిధి పాత్రలయందు తీర్థముచేర్చుట. — తిరుకావేరిచెంబులో తీర్థముతిరుత్తుళాయి మొదలైన పరిమళ ద్రవ్యములు చేర్చి చెంబును దక్షిణహస్తముతో మూసికొని అయిదు మారులు, ఉత్తర వాక్యముచేత అభిమంత్రించి ఆతీర్థమును సన్నిధి పంచపాత్రలయందు పూరించి తిరుత్తుళాయ్ చేర్చి అభిమంత్రించి పెరుమాళ్లు మొదలగు వారిపై ప్రోక్షించవలయు.

౮. స్వాచార్యునకు తిరువారాధనము సమర్పించుట. — ఆచార్యునకు పృథక్కుగా నుండెడు రెండుసన్నిధి పాత్రలయందు ఆ తిరుకావేరి చెంబుయందుండు తీర్థముచే పూరించి "అస్మద్గురుభ్యోనమః" యని అర్ఘ్యపాద్యాచమనీయమును, "వెణ్ణయళంద" యను పాశురము చేత తిరు మంజనమును "వగయాన్" అనుపాశురముచేత ధూపమును, కేశవాది నామములచేత తిరుమణ్ కాప్పును "పూశుంచాందు" అను పాశురముచేత చాత్తుపొడి మొదలైనవియు "పరివదులీశన్" యను పాశురముచేత ధూపమును "వైయిత్తకళియా" యనుపాశురముచేత దీపమును పల్లాండు యను పాశురము చేత కర్పూరమును అర్ఘ్యపాద్యాచమనీయములను "శెన్రార్ కుడైయాం" అను పాశురము చేత మంత్రపుష్పమును సమర్పించ వలయు.

౯. ఆళ్వారాచార్యులకు తిరువారాధనము సమర్పించుట. — స్వాచార్యునకువినియోగింపబడిన పృథక్కుగానుండెడు ఆ రెండు సన్నిధి పాత్రలనుశోధించి

అందుల ఆతిరు కావేరి యందుండు తీర్థము చేపూరించి "పరాంకుశపరకాలయతివరా దిభ్యోనమః" అని యను సంధించి ఆచార్యుని శ్రీహస్తముచే తిరువారాధనము సమర్పించునట్లు భావనాప్రకర్షముతో పైనస్వాచార్యునకుగాను వివరించిన ప్రకారము తిరువారాధనము సమర్పించవలయు,

౧౦. పెరుమాళ్లకు పిరాట్టిమార్లకు అనంతగరుడ విష్వక్సేనాదులకు తిరువారాధనము సమర్పించుట.— ఆపంచ పాత్రలయందు పూరించియుంచిన తీర్థముచే "సర్వమంగళ విగ్రహాయ సమస్త పరివారాయ శ్రీమతే నారాయణాయనమః" యని పైన స్వాచార్యునకు వివరించిన ప్రకారము తిరువారాధనము సమర్పించవలయు.

౧౧. దివ్యప్రబంధము సేవించుట.— "గురుముఖ" మను తనియ ప్రారంభించి తిరుప్పల్లాండు మొదలైనవి సేవించవలయు.

౧౨. ప్రసాదము కండరుళచేయుట.— "సర్వమంగళ విగ్రహాయ" మొదలైన వాక్యములచేత పెరుమాళ్లు మొదలైన వారలను భోజ్యాసనముల యందు వేంచేపుచేసి అర్ఘ్యపాద్యాచమనముల సమర్పించి ఉత్తర వాక్యముచేతస్థల శుద్ధిచేసి తళిగకు తీర్థము ప్రోక్షించి "నారునరుంబొళిల్" "ఇన్నువన్ది త్తనై" "కూడార" అనుపాశురములును "సర్వమంగళ విగ్రహాయ సమస్తపరివారాయ శ్రీమతే నారాయణాయనమః" యని అనుసంధించి పెరుమాళ్ మొదలైన వారలకును "పరాంకుశ పరకాల యతివరాది భ్యోనమః" అని ఆళ్వారాచార్యులకును "అస్మద్గురు భ్యోనమః" అనిస్వాచార్యునకును, ప్రసాదము తీర్థము కండరుళచేసి తదనంతరము అర్ఘ్యపాద్యాచమనము సమర్పించవలయు.

౧౩. అడైక్కాయ మదు సమర్పించుట.— పెరుమాళ్లు మొదలగు ఆళ్వారాచార్యులను పర్యంకాసనమున వేంచేపుచేసి అర్ఘ్యాదులు సమర్పించి "పోయిప్పాడుడయ" అను పాశురముచేత పెరుమాళ్లు మొదలుకొని స్వాచార్యపర్యంతము వరుస ప్రకారము అడైక్కాయమదు అర్ఘ్యాదులు కర్పూరహార తిరామ సమర్పించ వలయు.

౧౪. చాత్తుచేయుట.— "చిత్తం, వజ్ఞం, ఇరుప్పిడం, ఇన్బుత్త, అంగయత్, పూమన్ను, పల్లాండు, అడియోమోడు" మొదలగు పాశురములను, సర్వదేశ మొదలైన శ్లోకములను, వాళిత్తిరునామములను సేవించవలయును.

౧౫. సన్నిధి తిరుకాప్పులు చేర్చుట.— పెరుమాళ్లు మొదలగుఆళ్వారాచార్యులను శయ్యాసనమున వేంచేపుచేసి "ఉపచారాపదేశేన" అను శ్లోకమునుఅను సంధించి తిరుకాప్పులుచేర్చి దండము సమర్పించవలయు.

౧౬. ప్రసాదము స్వీకరించుట.— పెరుమాళ్లు మొదలగు వారలకు కండరుళి చేసిన ప్రసాదమును ఆచార్యుని తనయనను సంధించిస్వీకరించవలయు.

౧౭. కాలక్షేపము చేయుట.— భగవద్విషయ అష్టాదశ రహస్యాది వ్యాఖ్యానముల కాలక్షేపము చేయువలయు.

౧౮. రాత్రికాలములయందు పెరుమాళ్లు మొదలగు వారలకు తిరువారాధనము సమర్పించి ప్రసాదము కండరుళిచేయుట.— రాత్రికాలముల యందు తాను మడిగానుండి హస్తములచే మూడుమారులు చప్పిడిచేసి సన్నిధి తిరుకాప్పులు తెఱచి క్రొత్త తీర్థముతో సన్నిధి పాత్రలు పూరించి పూర్వోక్త ప్రకారము అర్ఘ్యాదులు సమర్పించి "శ్రీశైలేశ" తనయ ప్రారంభించి తిరుప్పల్లాండు "ఆనిరై, ఇన్ దిరన్, శెన్ని, అమల్ నాథ, కణ్ణినుణ్ చిరుత్తాంపు, మేప్పైయేదలక్, ఆళిమెళ్ళచంగు" వీటిని కాలోచితముగ సేవించి పైనచెప్పిన ప్రకారము ప్రసాదము తీర్థము కండరుళిచేసి తచ్ఛేష ప్రసాదమును స్వీకరించి వాక్యగురు పరంపరయు ద్వయము ననుసంధించి భగవద్భాగవతాచార్యులను భావనాప్రకర్షముచే సేవించుచు శయనించి తిరుగామేల్కొను నప్పుడు పూర్వవద్గురు పరంపరయు ద్వయము ను సంధించవలయు.

శ్రీమతే రామానుజాయ నమః

జీయర్ తిరువడిగళే శరణం.





శ్రీమతే రామానుజాయ నమః.

శ్రీమద్వరవరమునయేనమః.

# ప్రపన్నానుష్ఠానభాస్కరము.

(*)

( శ్రీభగవచ్ఛాస్త్రే - శ్రీభగవానువాచ. )

శ్లో॥ శ్రుతిః స్మృతి ర్మమై వాజ్ఞా య స్తా ము ల్లంఘ్యా వ ర్తతే ।
ఆజ్ఞాచ్ఛేదీ మమ ద్రోహీ మద్భక్తోపి నవైష్ణవః ॥

తా॥ శ్రుతిస్మృతులు నాయాజ్ఞచే కలిగినవనియు, వీనిని మీరి వర్తించువాడు నాయాజ్ఞను ఛేదించినవాడనియు, నాకు ద్రోహియనియు, నాయందు భక్తిగలవాడైనను వాడవైష్ణవుడనియు భగవంతునిచే జెప్పంబడియె.

శ్లో॥ యథాహివల్లభోరాజ్ఞా, నదీంరాజ్ఞా ప్రవర్తితామ్, లోకోపయోగినీం రమ్యాంబహుసస్యవివర్ధినీమ్ ॥ లఙ్ఘయన్ శూలమారోహే దనపేక్షోపితాంప్రతి, ఏవంవిలఙ్ఘయన్మర్త్యో మర్యాదాం వేదనిర్మితామ్ ॥ ప్రియోపినప్రియో సామేమదాజ్ఞా వ్యతివర్తనాత్, ఉపాయత్వ గ్రహాంతత్రవర్జయేన్మనసాసుధీః ॥

తా॥ ఒకరాజునకు మిక్కిలి అంతరంగుడై, తన యధీనమగు దేహయాత్రాదులుగలవాడగు నొకడు, లోకమునకు ఉపయోగముగను, అనేకులకుదాహముగను ఆరాజుచే తనదేశమునందు ప్రవర్తింప చేయబడిన, నదీప్రవాహమును తనకునిందుచే ప్రయోజనకారి కాదను హేతువుచేత, తెగగొట్టి విడిచె

నేని, ఆరాజు వీనిని యెట్లా అప్పుడే శిరశ్ఛేదముచేయించునో అట్లాగే, యేమ నుష్యుడు వేదనిర్మితమైనమర్యాదలను చెఱచునో వాడు నాకు ప్రియుడైనను నా యాజ్ఞను మీరినడిచెనేని నాకు వాడు అప్రియుడేయనియు; బుద్ధిమంతుడు శా ష్త్రయమందలి ఉపాయత్వబుద్ధినిమాత్రము విడువవలెననుట శ్రీభగవద్వాక్యము.

( శ్రీభగవచ్ఛాస్త్రే - శ్రీరువాచ. )

శ్లో॥ అవిప్లవాయ ధర్మాణాం పాలనాయకులస్యచ । సంగ్రహాయః లోకానాం మర్యాదాస్థాపనాయచ॥ ప్రియాయమమ విష్ణోశ్చ దేః దేవస్య శార్ఙ్గిణః। మనీషీ వైదికాచారంమనసాపినలంఘయేత్

తా॥ ధర్మములు చెడకుండుటకును, కులములను పరిపాలించుకొరకును లోకసంగ్రహార్థము కొరకును, మర్యాదాస్థాపనము కొరకును, నాయొక్క యు, శ్రీభగవంతునియొక్కయు ప్రియముకొరకును బుద్ధిమంతుడగువాడు వేదో క్తానుష్ఠానమును, మనస్సుచేనైనను మీరినడువకూడదని పిరాట్టివాక్యము.

( పరాశరః. )

శ్లో ॥ చతుర్ణామపివర్ణానా । మాచారోధర్మపాలకః ।
ఆచారభ్రష్టదేహానాం । భవేద్ధర్మఃపరాఙ్ముఖః ॥

తా ॥ చతుర్వర్ణస్థులకు ఆచారమనునది ధర్మమును కాపాడుచున్నది, ఆచారభ్రష్టులగు వారిని చూచి ధర్మము మరలి పోవుచున్నది.

( భారతమున అనుశాసనిక పర్వమునందు. )

శ్లో ॥ ఆచారాల్లభతే చాయురాచారాల్లభతేశ్రియం । ఆచారాత్కీ ర్తిమాప్నోతిపురుషః ప్రేత్యచేహచ ॥ దురాచారోహిపురుషో । నేహాయుర్విందతేమహత్ । త్రాసయంతిచ భూతానితథాపరి భవంతిచ॥తస్మాత్కుర్యాదిహాచారం । యదిచ్ఛేద్భూతిమాత్మనః। అపిపాపశరీరస్య ఆచారోహంత్యలక్షణం ॥ ఆచారలక్షణోధర్మ స్సంతశ్చాచారలక్షణాః । సాధూనాంచ యథావృత్తమేతదా చారలక్షణం ॥

తా॥ పురుషుడు ఆచారముచే ఆయుస్సును సంపాదించుకొనుచున్నాడు, ఐశ్వర్యమును పొందుచున్నాడు, దేహవియోగానంతరము కీర్తినిపొందుచున్నాడు, ఆచారభ్రష్టుడు దీర్ఘాయువును పొందనేరడు వానిని పిశాచములు భయపఱచును అవమానపరచును, కావున తన హైశ్వర్యముకోరువాడు భువియందు ఆచారమును అవలంబించవలయు. పాపదేహముగలవానికిని ఆచారము అవలక్షణములను పోగొట్టుచున్నది. ధర్మమునకు ఆయాచారమేలక్షణముగనున్నది. సత్పురుషులగువారలు ఆచారమేలక్షణముగ గలిగియున్నారు. సాధువులు యేలాగున నడుచుచున్నారో ఆచారలక్షణము అలాగేయున్నది.

( వాసిష్ఠసంహితాయాం. )

శ్లో॥ తస్మాత్సర్వప్రయత్నేన సత్కృత్యం సర్వదా చరేత్ ।
ఆజ్ఞాతి క్రమణా ద్విష్ణో ర్విముక్తో పి నిబధ్యతే ॥

తా॥ సర్వప్రయత్నములచేతను సర్వకాలములయందు సత్కృత్యములనే ఆచరించవలయు, భగవదాజ్ఞనుమిరినడిచెనేని ముక్తుడుగాక బద్ధుడగును.

{ శ్రీవచన భూషణదివ్యశాస్త్రమునందు సకలార్థ తత్త్వవిద గ్రేసరులగు పిళ్లలోకాచార్యులు సాయించిన వాక్యములు. }

౧. వేదార్థంఅఱుదియిడువదు స్మృతీతిహాసపురాణఙ్గళాలే.

౩౨. కర్తవ్యమాచార్యకైఙ్కర్యముమ్, భగవత్కైఙ్కర్యముమ్.

౩౩. కీళ్చొన్న భగవత్కైఙ్కర్యమఱివదు శాస్త్రముఖత్తాలే. ఆచార్యకైఙ్కర్యమఱివదు, శాస్త్రముఖత్తాలు మాచార్యవచనత్తాలుమ్.

౩౪. కైఙ్కర్యస్థానిరణ్ణు.

౩౫. అతావతు ఇష్టమ్ శెయ్‌కైయు మనిష్టమ్ తవిరుకైయుమ్.

౩౬. ఇష్టానిష్టఙ్గళ్ వర్ణాశ్రమఙ్గళైయు మాత్మస్వరూపత్తైయు మవలమ్బిత్తిరుక్కుమ్.

౩౭. పుణ్యాత్తుక్కున్ జు కిఅవర్ పాపత్తైపణ్ణానిఱే ।

౩౮. ఇవర్ పుణ్యత్తై పాపమెన్నిరుక్కుమ్ ।
అవర్ పాపత్తై పుణ్యమెన్నిరుక్కుమ్ ।

అవనుక్కు-దుకి డైయాదు, ఇవనదు శేయ్యాక్.

౩౯. కైఙ్కర్యమ్ తాన్ భక్తిమూలమల్లాతపోదు।
భీతిమూలమాయ్‌వరవేణుమ్.

౪౦. అదువు మిల్లాతపోదు అధికారత్తిలుమ్।
ఉపాయో పేయఙ్గళిలుమ్ అన్వయ మిన్ఱి కేట్టు-యొళియుమ్.

౪౧. కైఙ్కర్యమ్ తన్నై ఫలసాధన మాక్కా-తె ఫలమాకవేణుమ్.

౪౨. అతావతు, తాఙ్కళై యేఱాతే అవనైకైఙ్కర్యమ్బణ్ణుకై.

౪౩. కుడుక్కైక్కు-ళ్ళారైతే కొణ్డుతుక్కు-కైకూలికొడుకవేణుమ్.

( శ్రీరంగరాజస్తవే. )

శ్లో॥ హర్తుం తమస్సదసతీచ వివేక్తుమీశో । మానం ప్రదీపమివకారుణికో దదాతి । తేనావలోక్యకృతినఃపరిభుంజతే తం । తత్రైవకేపి చపలాశ్శలభీభవంతి.

తా॥ పరమకారుణికుడైన శ్రియఃపతి, చేతనుల అజ్ఞానాంధకారమును తొలిగించుకొని వీరలకు సదసద్వివేకము కలుగజేయుటకై ప్రదీపమువలె శాస్త్రము నుపకరించెను బుద్ధిమంతులు ఆశాస్త్రదీపముచే సర్వేశ్వరుని స్వరూప రూప గుణ విభూతిచేష్టితములంతయు దెలసికొని ఉజ్జీవించుచున్నారు; దీపమునార్పెడి పురుగులు దీపమునార్పి తామును నశించునట్లు కొందరు చపలులు శాస్త్రములను అపార్థములచే చెరచి దానిచే భగవన్నిగ్రహపాత్రులై తామును నశించుచున్నారని శ్రీభట్టరుఆనతిచ్చిరి.

భగవదాజ్ఞా కైఙ్కర్యములగు శుభా శుభ కర్మములను
ప్రపన్నుడనుష్ఠించవలయు. అందుత్రైవర్ణికులు
వేదోక్తముగను, అత్రైవర్ణికులు
పురాణోక్తముగను అను
ష్ఠించుటశిష్టాచారసి
ద్ధమైయున్నది.

—*—

## — ప్రాతఃకాలమున మేలొ్కనునపుడు. —

ప్రపన్నుడు నిత్యము—కూర్మపురాణే—"బ్రాహ్మేముహూర్తఉత్థాయ ధర్మమర్థంచచింతయేత్ । కాయక్లేశంతదుద్భూతం । ధ్యాయీత మనసేశ్వరం." అనుప్రకారమును"పంచపంచ ఉషఃకాలః" అనుప్రకారమును ప్రాతఃకాలమున నిద్రమాని లేచి "దర్పణంపూర్ణకుంభంచ దక్షిణంకరమేవచ ।పూజ్యాంశ్చమంగళద్రవ్యం ప్రాతఃపశ్యేన్మహీపతిం." అను ప్రకారము అద్దము, పూర్ణకుంభము, తన ఎడమచెయ్యిని, తలిదండ్రులు ఆచార్యుడు వీరలతిరువడిగళులను భగవద్భాగవతబింబములను, మంగళ ద్రవ్యములు మొదలగు వాట్లనుచూడవలయు,పిదప పడకలోనె కరములు మొగిడ్చి కూర్చునిధర్మార్థకాయ క్లేశములను చింతించి "ఉత్తిష్ఠ చింతయహరిం" అను రీతిని హరిస్మరణతో వాక్యగురుపరంపరను ద్వయమును అను సంధించి, తన యాచార్యుని మొదలు ఆళ్వార్లవరకును పెరియపిరాట్టి పరమపద నాథులు కోవెల తిరుమలపెరుమాళ్ కోవెల మొదలగు నూటయెనిమిది దివ్యదేశ ములయందలి పెరుమాళ్లనుధ్యానించి, శ్రీశైలేశాది తనయులు తిరుప్పళ్లి యెళుచ్చి తిరుప్పావు యావత్తుతనయులు సహా అను సంధించ వలయు. అందు కవకాశము లేనియెడల, మొదటిపాశురము "చిత్తంచిరుగాలె, వంగక్కడల్" అను మూడుపాశురములైన ననుసంధించ వలయు. తదనంతరము పడకలోనుంచిలేచి శ్రీకుల శేఖరాళ్వారులు ఆనతిచ్చిన ముకున్దమాలతనయు, "ఘుష్యతే యత్రనగరేరంగయాత్రా దినేదినే । తమహంశిరసావందే రాజానంకులశేఖరం ." అను శ్లోకమును సంధించిశ్రీరంగయాత్రచేయునటుల భావించి కోవెలపార్శ్వముచూచుచు ముందుగ భూమిమీద కుడికాలుంచి లేచి,అడుగు పెట్టినడువవలయు.

## — జలమలవిసర్జనక్రమము. —

జలమల విసర్జన కాలములందు — విష్ణుపురాణె —"నైరృత్యామిషువిక్షేపమతీత్యాప్యధికంబుధః । దూరాదావసథాన్మూత్రం పురీషంచ సమాచరేత్" అనుప్రకారము, ఊరికివెలపట నైరృతి,దక్షిణము, పడమర పార్శ్వములయందు, బాణము పారెడు దూరమునపోయి "తృణైరాస్తీర్యవసుధాంవస్త్రప్రావృతశిరస్తకః." అనుప్రకారము వస్త్రముతో మస్తకమును చక్కగాఘ్రా

సుకొని— అంగిరాః— "కృత్వా యజ్ఞోపవీతంతు పృష్ఠతః కంఠలంబితం విణ్మూత్రంతు గృహీకుర్యాద్యద్వా కర్ణేసమాహితః" అనుప్రకారము, యజ్ఞోపవీతమును తనపృష్ఠమునజారవిడచి గాని కుడిచెవికిచుట్టికొనిగాని—శ్రీవిష్ణుపురాణే— "ఆత్మచ్ఛాయాంతరుచ్ఛాయాంగోసూర్యాగ్న్యనిలాంస్తథా । గురుద్విజాదీంస్తుబుధోనాధిమేహేత్కదాచన ॥ నకృష్టేసస్యమధ్యేచ గోవ్రజేజనసంసది । నవర్త్మనినదద్యాదితీర్థేషు పురుషర్షభః ॥ నాప్సునైవాంభసస్తీరే శ్మశానేనసమాచరేత్ । ఉత్సర్గం వైపురీషస్య మూత్రస్యచ విసర్జనం." అనియు మనుః—"నమూత్రంపథికుర్వీతనభస్మనినగోవ్రజే।నఫాలకృష్టేనజలేనచిత్యాం నచపర్వతే । నజీర్ణదేవాయతనే నవల్మీకే కదాచన ॥ నససత్త్వేషుగర్తేషునగచ్ఛన్నాపిచ స్థితః । ననదీతీరమాసాద్యనచ పర్వతమస్తకే ॥ వాయ్వగ్నివిప్రానాదిత్యమపః పశ్యంస్తథైవగాః । నకదాచనకుర్వీత విణ్మూత్రస్య విసర్జనమ్ ॥ ప్రత్యగ్నింప్రతిసూర్యంచ ప్రతిసోమోదకద్విజాన్ ।ప్రతిగాంప్రతివాతంచ ప్రజ్ఞానశ్యతిమేహతః." అనియు — ఆపస్తంబః—"నచసోపానాన్మూత్రపురీషేకుర్యాత్." అనుమొదలగు ప్రమాణములచే, తనఛాయ, వృక్షముల నీడ, గోవు, సూర్యుడు, చంద్రుడు, అగ్ని, వాయువు, గురువు, బ్రాహ్మణులు శిష్టులు, మొదలగు వారల కెదుటయును వాట్లను తాను చూచుచును పుట్టయందును, జంతువులు వాసముచేసెడు భూబిలములయందును, నడుచుచుగాని నిలుచుకొనిగాని, దున్నినభూమియందును, పైరునడుమను, పశువుల కొట్టమందును, జనసంగమమందును, బాటయందును, బూడిదెయందును, యాగభూమియందును, పర్వతములందును, పాడుపడిన దేవాలయములందును, తటాకములుమొదలగు వాట్లగట్టులయందును,జలమునందును ,శ్మశానమందును, పర్వతోచ్చస్థానములందును ,సోపానములం దుండియును,మల మూత్రంబులు విసర్జింపకతక్కినప్రదేశములందు—వసిష్ఠః—"అయజ్ఞియైరనార్ద్రైశ్చతృణైస్సంఛాద్యమేదినీమ్." అనియు "తిరస్కృత్యోచ్చారేత్కాష్ఠలోష్ఠపత్రతృణాదికాః." అనియుఎండుగడ్డిచేగాని యెండుచెత్తచేగాని యాగమునకుపయోగముగాని రాళ్లు మన్ను వీనిచేగానిభూమిని గప్పి—మనుః— "మూత్రోచ్చారసముత్సర్గం.। దివాకుర్యాదుదఙ్ముఖః । దక్షిణాభిముఖో రాత్రౌసంధ్యయోస్తుయథా

దివా." అను ప్రకారము ప్రాతర్మధ్యాహ్న కాలములందును ఈ రెంటిసంధ్య లయందును ఉత్తరముఖముగాను రాత్రి కాలములందు దక్షిణ ముఖముగాను కూర్చుని "వాచస్సంయమ్యయత్నేనష్ఠీవనోచ్ఛ్వాసవర్జితః." అనునట్లును "నియమ్యప్రయతోవాచం" అనునట్లును శ్వాసమును లోపలికి విడువక మౌనముగా నుండి జలమల విసర్జనముచేయవలయు.

## — శౌచక్రమము. —

పిమ్మట ఈవలవచ్చి— దక్షః— "తీర్థేశౌచంనకుర్వీత కుర్వీతోద్ధృతవారిణా." అనుప్రకారము నదులు తటాకములు కూపములువీనియందు శౌచముచేయక జలము ముంచుకొని—మరీచిః—"విప్రేశుక్లాతుమృచ్ఛ్రేచెరక్తాక్షత్రేవిధీయతే। హరిద్రవర్ణావైశ్యేతు। శూద్రేకృష్ణాప్రకీర్తితా". అనియు—విష్ణుపురాణే—"వల్మీకమూషికోత్ఖాతాంమృదంనాంతర్జలాంతథా। శౌచాంవిశిష్టాంగేహాచ్చనాదద్యాల్లేపసంభవాం । అణుప్రాణ్యుపపన్నాంచ హలోత్ఖాతాంచ పార్థివ । పరిత్యజేన్మృదోహ్యేతాస్సకలాశ్శౌచకర్మణి."అనుప్రకారము పుట్టది యుపందికొక్కుతోడినదియు, జలములోనుండునదియు, శౌచముచేయ శేషించిన దియు, ఇంటిగోడకు బూసినదియు, మిక్కిలి క్రిమికీటాదులతో గూడినదియు, నాగేటిచే పెల్లగింప బడినదియు నగు మంటిని విడిచి పృథక్కుగా నుండెడు,విప్రులకు తెల్లనిదియు, క్షత్రియులకు యెఱ్ఱనిదియు, వైశ్యులకు పసపువర్ణముగలదియు, శూద్రులకు నల్లనిదియునగు మృత్తికతోగాని, లేక —యమః— "వాపీకూపతటాకేషు నాహరేద్బాహ్యతోమృదం । ఆహరేజ్జలమధ్యాత్తుపరతో మణిబంధనాత్." అను ప్రకారము త్రోవ్వబడిన కాలువ కూపము గుంట మేరు మొదలగు వాట్లయందు నొక మూరలోతున నుండగల మంటిని ఈవలతెచ్చి—వసిష్ఠః— "పంచాపానేదశైకస్మిన్నుభయోస్సప్తహస్తయోః। మృత్తికాః పాదయోస్సప్త లింగేద్వేపరికీర్తితే." అనియు —మనురపి— "ఏకాలింగేగుదేతిస్రస్తథైకత్రకరేదశ । ఉభయోస్సప్త దాతవ్యా మృదశ్శుద్ధిమభీప్సతా." అనియు "ఏతచ్ఛౌచం గృహస్థస్య, ద్విగుణం బ్రహ్మచారిణః । వానప్రస్థస్యత్రిగుణం యతీనాంతుచతుర్గుణమ్". అను ప్రకారము మేఢ్రమునకొ నొకమారు, గుదమునకు మూడుమారులు, వామహస్తమునకుపది

మారులు, పిదప రెండుహస్తములకు నేడేసి మారులు ఆమలక ప్రమాణమంతమృత్తికనుంచి, గృహస్థులు శుద్ధి చేయవలయు; బ్రహ్మచారులు గృహస్థులకుచెప్పిన శౌచవిధికంటె రెండింతలును, వానప్రస్థులకుమూడింతలును, సన్న్యాసులకునాల్గింతలుననితెలియగలది. మరియు—ఆదిత్యపురాణే—"స్త్రీశూద్రయోరర్ధమానం|ప్రోక్తంశౌచంమనీషిభిః । దివాశౌచస్యచార్థం పథిపాదంవిధీయతే । ఆర్తః కుర్యాద్యథాశక్తి। శక్తఃకుర్యాద్యథావిధి." అనుప్రకారము స్త్రీ శూద్రులకు పైనగృహస్థులకుచెప్పిన శౌచమున అర్ధమేచాలును, తక్కిన త్రైవర్ణికులుశౌచ మంతయు చేయవలయు. రాత్రి కాలములందు వారి వారికి చెప్పి యుండెడు శౌచవిధులలో అర్ధమే చేయవలయు. దుఃఖముగలవారలు శక్తికొలది చేయవచ్చును, శక్తిగలవారలు విధిప్రకారము శౌచవిధియందుచెప్పినవంతయుపూర్తిగ చేయవలయు.

—శుద్ధజలముచే నోరుపుక్కిలించు క్రమము.—

ఆపస్తంబః— "ఏవంశౌచవిధింకృత్వాపశ్చాద్గండూషమాచరేత్ । మూత్రే రేతసి విట్సర్గే, దంతధావన కర్మణి । భక్ష్యాణాంభక్షణేచైవ । క్రమాద్గండూషమాచరేత్ । చతురష్టద్విషడ్వష్ట । గండూషైష్షోడశైస్తథా । ముఖశుద్ధింప్రకుర్వీత హ్యన్యథా దోషమాప్నుయాత్ । పురస్తాద్దేవతాస్సర్వాదక్షిణేపితరస్తథా । పశ్చిమేమునిగంధర్వా । వామేగండూషమాచరేత్" అనుప్రకారము,శౌచవిధి ముగియగానే శుద్ధజలముచే నోరుపుక్కిలించవలయు.జలవిసర్జనముచేయుట, శుక్ల విసర్జనముచేయుట, మలవిసర్జనముచేయుట దంతధావనము చేయుట, భక్షణము చేయుట, ఈయయిదు కార్యముల యందు క్రమ ప్రకారము నాలుగు యెనిమిది పదిరెండు పదినాలుగు పదియారు మారులు నోటజలము నుంచుకొని పుక్కిలించి, తనకెదుట దేవతలు, కుడిపార్శ్వమున పితృదేవతలును పృష్ఠపార్శ్వమున మునులును గంధర్వులుండుటచే యెడమ పార్శ్వమున నుమియవలయు.

— ఆచమనక్రమము.—

వృద్ధపరాశరః—"కృత్వాథశౌచం ప్రక్షాళ్యపాదౌ హస్తౌ చమృజ్జలైః। ప్రబద్ధశిఖకచ్ఛస్తుద్విజ ఆచామమాచరేత్ । కృతోపవీతం సవ్యాంసేవాఙ్మనః

కాయసంయతః" అనియు—శంఖః—"అద్భిస్సముద్ధృతాభిస్తుహీనాభిః ఫేనబుద్బుదైః । వహ్నినానవతప్తాభిరక్షారాభిరుపస్పృశేత్" అనియు—భారద్వాజః—"ఆయతం సర్వతః కృత్వాగోకర్ణాకృతితత్కరం । సంహృతాంగుళినాతోయం । గృహీత్వాపాణినావ్రజః । ముక్తాంగుష్ఠకనిష్ఠేన శేషేణాచమనంచరేత్ । మాషమజ్జనమాత్రాస్తుసంగృహ్యత్రిఃపిబేదపః" అనుప్రకారముచున్న నీరు వీట్లచే కరచరణాదులుచక్కగాశుద్ధిచేసికొని, శిఖను ముడి వేసుకొని, ధరించుకొనియుండు వస్త్రమును చక్కగా సవరించుకొని, మాలెగానుండెడు యజ్ఞోపవీతము క్రమప్రకారము వామభుజముమీదధరించుకొని, యేకాంతస్థలము నందు మౌనముగాకూర్చుని, నురుగు మొదలగునవి లేనిదియు ఉప్పు కారము మొదలగు క్షారములతోకూడనదియు అగ్నిచే వెచ్చనకానిదియునగు క్రొత్తతీర్థమును తనదక్షిణహస్తమునుగోకర్ణాకృతిగానుంచుకొని, అందుమినపగింజమునుగునంత తీర్థముతో అచ్యుతాయనమః అనంతాయనమః గోవిందాయనమః అనిగాని యైనను ఉత్తరవాక్యముచేనైనను అస్మద్గురుభ్యోనమః అస్మత్ పరమగురుభ్యోనమః అస్మత్సర్వగురుభ్యోనమః అనిగానియైనను నుచ్చరించి—మనుః—"హృద్గాభిఃపూయతేవిప్రః కంఠగాభిస్తుభూమిపః । వైశ్యోద్భిః ప్రాశితాభిస్తుశూద్రః స్పృష్టాభిరంతతః" అనియు, "త్రిరాచామేదపః పూర్వంద్విః ప్రమృజ్యాత్తతోముఖమ్ । ఖానిచైవ స్పృశేదద్భిరాత్మానం శిరఏవచ" అనియు, బ్రాహ్మణులు రొమ్ము వరకుపోతగ్గ జలముచేతను, క్షత్రియులుకంఠము వరకుపోతగ్గ జలముచేతను, వైశ్యులు చిరునాలుకవరకు పోతగ్గజలముచేతను, శూద్రులు పెదవులు తడిసెడు మాత్రమగు జలముచేతను, మూడుమారులు ఆచమనముచేసి పిదప జలముచేనోటిని రెండుమారులు తుడిచి, తదనంతరము నేత్రములు, కర్ణములు, నాసికము, గర్భము, వక్షము, శిరస్సువీట్లనుతుడుచుటయే ఆచమనమనంబడును. ఇట్లుచేయుటచే పరిశుద్ధుడగును. మనుః—కృత్వామూత్రంపురీషంవా, పాణ్యాచాంతఉపస్పృశేత్, పీత్వాపోధ్యేష్యమాణశ్చ, వేదమగ్నించసర్వదా" అనియు—మనుః—"సుప్త్వాక్షుత్వాచ, భుక్త్వాచనిష్ఠీవ్యోక్త్వానృతంవచః । రథ్యాంశ్మశానంచాక్రమ్య ఆచామేత్ప్రియతోపిసన్ । అధోవాయుసముత్సర్గే ఆక్రందే క్రోధసంభవే । మార్జాలమూషకస్పర్శేప్రహాసేనృతభాషణే । నిమిత్తేష్వేషుసర్వేషుకర్మకుర్వన్నుపస్పృశేత్" అనియు—కూర్మపురాణే—"చండాలమ్లేచ్ఛసల్లాపే స్త్రీశూద్రోచ్ఛిష్టభాషణే

ఉచ్ఛిష్టం పురుషంస్పృష్ట్వాభోజ్యంచాపితథావిధం। ఆచమేదశ్రుపాతేవాలోహితస్యతథైవచ। అగ్నేర్గవామథాలంభేస్పృష్ట్వాప్రయతమేవచ। స్త్రీణామథాత్మనస్స్పృష్ట్వానీవీంవాపరిధాయచ'' అనియు, మలవిసర్జనముచేసినను,మూత్రవిసర్జనము చేసినను శౌచముచేసిన పిదప, మూడుమారులు ఆచమనముచేసియే ఋుక్కులు మొదలగువారిని చెప్పవలయు.మరియు నిద్రించిలేచినను తుమ్మినను భోజనముచేసినను జలమల విసర్జనము చేసిననుఅనృతము లాడినను వెలపటపోయినను శ్మశానమునుతొక్కినను అపానవాయువులను విడిచినను రోదనముజేసినను కోపముగలిగినను మార్జాలమునుగాని మూషకమును గాని తాకినను విశేషముగానవ్వినను చండాలునితోగాని మ్లేచ్ఛునితోగాని కూడిమాటలాడినను స్త్రీశూద్రులు ఉచ్ఛిష్టులైయుండగా వార్లతో సంభాషించినను ఉచ్ఛిష్టులస్పర్శించినను ఉచ్ఛిష్టాన్నమును తాకిననుకన్నీరు విడిచినను రేతస్సు విసర్జించినను శవమునుతాకినను చూచినను స్త్రీలదేహము తనదేహమునకు తాకినను జపహోమామనిత్యనైమిత్తిక ఆహ్నికములు తిరువారాధనము చేయ యోగ్యత లేనందున పైనచెప్పినవిధిచోదితమగు ఆచమనముచేసిఇట్టికార్యములనుపక్రమించవలయు.

## —దంతధావన క్రమము.—

అంగిరాః— "ఆమ్రపున్నాగ బిల్వానా మపామార్గ శిరీషయోః।భక్షయేత్ప్రాతరుత్థాయ వాగ్యతోదన్తధావనం।ఉదఙ్ముఖఃప్రాఙ్ముఖోవాకాషాయంతిక్తకంతథా।ప్రాతర్భుక్త్వాచయతవాగ్భక్షయేద్దన్తధావనం" అనుప్రకారముమామిడిపొన్న,బిల్వం, యుత్తరేణి,దిరిసెన మొదలగువానిపుల్లలలోనైనను వొగరుచిరిచేదుగలపుల్లలలోనైననునొకటినిచక్కగాశోధించి, తూరుపుముఖముగనైనను,ఉత్తరముఖముగనైనను నొకతావునకూర్చుని దంతధావనము చేసికొని జలముచే కోరుచక్కగాపుక్కిలించియెడమప్రక్కనుమియవలయు.అట్లుచేయక—యాజ్ఞవల్క్యః—"ఇష్టకాలోష్టపాషాణైరితరాఙ్గుళిభిస్తథా। ముక్త్వాచానామికాంగుష్ఠౌవర్జయేద్దన్తధావనం" అనుప్రకారము ఇటికె,మంటిపెళ్ల, పెంకు, బొగ్గుబూడిదె మొదలగువీట్లచేతనుగాని, బొటనవ్రేలు పవిత్రవ్రేలుతప్పతక్కినమూడువ్రేళ్లచేతనుగాని దంతధావనముచేసెనేని "విష్ణోరపిహరేచ్ఛ్రియం" అను ప్రకారము, విష్ణువుయొక్క అయిశ్వర్యమునైనను తొలగించును.

— స్నాన క్రమము. —

వ్యాసః— "ఉషఃకాలేతుసంప్రాప్తే కృత్వాచావశ్యకంబుధః । స్నాయాన్నదీషుశుద్ధాసుశౌచంకృత్వాయథావిధి । అస్నాత్వానాచరేత్కర్మజపహోమమాదికంచయత్ । లాలాస్వేదసమాకీర్ణ శ్శయనాదుత్థితః పుమాన్ । అత్యంతమలినఃకాయోనవఛిద్రసమన్వితః । స్రవత్యేవదివారాత్రం । ప్రాతస్స్నానం విశోధనం । ప్రాతస్స్నానం ప్రశంసంతిదృష్టాదృష్టఫలంహితత్ । సర్వమర్హతి శుద్ధాత్మా ప్రాతస్స్నాయీజపాదికం" అనుప్రకారము ఉషఃకాలమునలేచి చేయతగిన విధి చోదితమగు శౌచాదులు అయినపిదప పరిశుద్ధమగునదియందు స్నాన మాచరించవలయు.అదిలేకనే జప హోమ నిత్యనైమిత్తిక ఆహ్నికములు చేయకూడదు గాన— శ్రీవిష్ణుపురాణె—నదీనదతటాకేషు దేవఖాతబిలేషుచ । నిత్యక్రియార్థంస్నాయీతగిరిప్రస్రవణేషుచ ॥ కూపేషూద్ధృతతోయేన స్నానంకుర్వీతవాభువి । గృహేచోద్ధృతతోయేన । హ్యథవాభువ్యసంభవే ॥ అనుప్రకారము—మనుః—"నాన్నమద్యాదేకవాసాననగ్నఃస్నానమాచరేత్ ॥ అనుప్రకారము గృహస్థులేక వస్త్రముతో భుజించకూడదనియువస్త్రహీనులై స్నానమాచరించకూడదనియు చెప్పియుండుటచే వస్త్రములతో స్నానముచేయవలయుగాన ఉదయానంతరము నదీనదములయందైనను చెరువులయందైనను గుంటల యందైనను తటాకముల యందైనను మడుగులయందైనను దొవలయందైనను అట్లనుకూలింపని యెడల నూతిలో జలము చేదుకొని గానైనను అంతకు శక్తి లేనియెడల నుదకము తెప్పించుకొని గానైనను తాను స్నానముచేయుటకు గాను సిద్ధపరచి యుండు తీర్థములో నొక చెంబు తీర్థమెత్తుకొని *"ఆయిరంతోళ్ పరప్పి" అనియు † "ఇలైత్తలైచ్చరంతురంద" అనియు

* పెరియాళ్వార్ తిరుమొళియందలి పాశురము.

ఆయిరంతోళ్ పరప్పిముడియాయిరమిన్నిలగ, ఆయిరంపైందలైయ వనన్తశయననాళుమ్మలై, ఆయిరమారకళుం శునైకళ్ పలవాయిరముం, ఆయిరం పూమ్బొళిలుముడై మాలిరుం శోలయదే ॥

† తిరుచ్చన్దవిరుత్తమందలి పాశురము.

ఇలైత్తలైచ్చరంతురంది లఙ్గైకట్టళిత్తవన్, మలైత్తలైప్పిఱన్దిళిందువందునుందు చందనం, కులైత్తలైత్తిఱుత్తెఱిందకుంకుమకుళుంబినో డలైత్తొళుగు కావిరియరంగమేయ యవణ్ణలే ॥

*"త్రిస్సః కోట్యర్ధకోటీచ" అనియనుసంధించుచు శ్రీమత్ భగవద్భాగవత సమస్తాచార్యుల శ్రీపాద తీర్థమనియభిమంత్రించి శిరస్సున ప్రోక్షించుకొని శ్రీమద్భగవద్భాగవతసంశ్లేషమున కనుగుణముగా స్నానమాచరించెదనని యనుసంధించవలయు. — మార్కండేయపురాణే — "అపమృజ్యాన్న చస్నానే గాత్రాణ్యంబరపాణిభిః । న చ నిర్ధునుయా త్కేశా న్వాసశ్చైవ న పీడయేత్" అను ప్రకారము స్నానమాచరించునపుడు కట్టువస్త్రముచే గాని చేతులచే గాని దేహమును తుడుచుకొన కూడదు, శిరోజములు విదిలించ కూడదు "ఉత్తీర్య పీడయేద్వస్త్రం" అన్నట్లు తాను స్నానముచేసిన కట్టు వస్త్రమును ఇవల వచ్చి పిడవ వలయు. పిదప ఎంబెరుమానార్ తిరువడిగళే శరణ మనియు, లేక † "అనిశంభజతామనన్యభాజాం" అను రామానుజచతుశ్శ్లోకములననుసంధించియు — యాజ్ఞవల్క్యః — "స్నాత్వైవంవాససీశు క్లేఅచ్ఛిన్నే పరిధాయచ" ॥ అను ప్రకారము స్నానానంతరముపొడి వస్త్రముతో దుడిచికొనిజీర్ణముకానివియు తెల్లనివియు నగు రెండు ధౌతవస్త్రము లను ధరించవలయు; అట్లులేనిచో యోగ యాజ్ఞవల్క్యే — "అలాభే ధౌతవస్త్రస్య శాణ క్షౌమాదికానిచ । కుతపం యోగపట్టంచ ద్వివాసాస్తునవై భవేత్" అనుప్రకారము నారమడిగానైన

* తీర్థప్రభావశ్లోకము.

త్రిస్సః కోట్యర్థకోటీచ తీర్థాని భువనత్రయే, వైష్ణవాంఘ్రి జలైః పుణ్యాత్, కోటి భాగేన నోసమం.

† రామానుజ చతుశ్శ్లోకి.

౧. అనిశంభజతామనన్యభాజాం, చరణాంభోరుహ మాదరేణపుంసాం,
వితరన్నిభృతంవిభూతిజాతం, జయతురామానుజ రంగధామ్నినిత్యమ్ ॥

౨. జయినాంవిమతాంతవాదియూక్తిః, కలుషీభూయకుదృష్టిభిస్సమేతాం ।
శకలీకురుతే, విపక్షవృత్తిం, జయరామానుజశేషశైలశృంగే ॥

౩. శ్రుతిమస్మృతిమ ప్రమాణతత్త్వం, కృపయాలోచ్యవిశుద్ధయైవ బుద్ధ్యా ।
అకృతాహితదైక భాష్యరత్నం జయరామానుజహస్తిధామ్నినిత్యం ॥

౪. జయమాయిమతాంధకారభానో, జయబాహ్యభ్రమభాటవీకృశానో ।
జయసంశ్రితసింధు శీతభానో, జయరామానుజయాదవాద్రిశృంగే ॥

౫. రామానుజ చతుశ్శ్లోకీం, యఃపఠేన్నియతంనరః,
ప్రాప్నుయాత్ పరమాంభక్తిం,యతిరాజపదాబ్జయోః ॥

ను పట్టు వస్త్రమైనను తెల్లకంబళి యైనను ధరించి కరచరణములు గడుగుకొని కూర్చుని మనుపటివలె మూడాచమనములు చేయవలయు.

దక్షః. శ్లో" ప్రాతర్మధ్యాహ్నయోస్స్నానం వానప్రస్థ గృహస్థయోః।
యతేస్త్రిషవణస్నానం సకృచ్చ బ్రహ్మచారిణః" ॥

తా. వానప్రస్థునికి గృహస్థునికి ప్రాతస్స్నానము, ఉచ్చ కాలస్నానము ఈ రెండును విధించబడి యున్నది. సన్యాసికి త్రికాలస్నానము విధించబడియున్నది. బ్రహ్మచర్యస్థునికి నొకేతూరిస్నానము విధించబడియున్నది.

విష్ణుః "బ్రహ్మక్షత్రవిశాంచైవ మంత్రవత్స్నానమిష్యతే। తూష్ణీమేవ
హిశూద్రస్య స్త్రీణాంచ కురునందన" ॥

తా. బ్రాహ్మణునికి క్షత్రియునికి వైశ్యునికిని మంత్రముతో గూడి నస్నానము విధియించబడియున్నది; స్త్రీ శూద్రులకు అవిలేకనే వట్టిస్నానముచాలునని ధర్మరాజునకు కృష్ణను ఉపదేశించిరి.

మార్కండేయః "పురాణానాం నరేంద్రాణా మృషీణాం చమహాత్మ
నాం। స్నానంకూపతటాకేషు దేవతానాంసమాచరేత్"

తా. పూర్వకాలమునందు రాజులు, మహాత్ములగు ఋషులు, దేవతలు వీరలచే నిర్మితమైన, కూపములు, ఏఱులు, మడుగులు, మొదలగు వాట్ల యందుస్నానమాచరింపవలయు.

వ్యాసః" అసత్స్వప్రాప్తేషుసస్నాయాత్తథైవా సంస్తుతేషుచ। అత్మీయే
ష్వపినింద్యేషుదుష్టేష్వల్పజలేషుచ" ॥

తా. తాను కట్టించినదైనను, తగనివారు తాకినను, శ్రేష్ఠము కానిదియును, నిందింప బడినదియును, దోషము కలిగినదియును అనగా వ్యాధికి ఎడమైనదియును జలముచుండిపోయినదియును నగునట్టి తటాకములలోస్నానమాచరించతగదు.

వృద్ధమనుః—వ్యతేజన్మనిసంక్రాంతౌ శ్రాద్ధేజన్మతిథౌతథా। అస్పృశ్యస్పర్శనే చైవనస్నాయాదుష్ణవారిణా, సంక్రాంత్యాం భానువారేచ, సప్తమ్యాంరాహుదర్శనే, ఆరోగ్య పుత్రమిత్రార్థీ నస్నాయాదుష్ణవా

రిణా । పౌర్ణమాస్యాంతథాదర్శేయః స్నాయా దుష్ణవారిణా ।
సగోహత్యాకృతంపాపం ప్రాప్నోతీహానసంశయః" ॥

తా. జననమరణ సంబంధమగు ఆశౌచములు సంక్రాంతిపండుగ పితృశ్రాద్ధదినము తానుజనంచినదినము తాకకూడనివారిని తాకినప్పుడును సంక్రమణము భానువారము సప్తమి గ్రహణము ఈకాలములయందు పుత్రమిత్రులను కోరువాడు ఉష్ణజలస్నానముచేయందగదు. పౌర్ణమి అమావాస్య ఇట్టిదినములయందు యెవరేని వెచ్చని జలమునందు స్నానమాచరించిరేని అట్టివారలు గోహత్యచేసినపాపమునపోవుదురని విధించబడియున్నది.

జాబాలిః. "స్నానంకృత్వార్ద్రవాసాస్తు విణ్మూత్రం కురుతేయది ।
ప్రాణాయామత్రయం కృత్వాపునస్స్నానేనశుద్ధ్యతి"॥

తా. స్నానముచేసి తడి వస్త్రముతో మలమూత్ర విసర్జనముచేసిరేని ముమ్మారు ప్రాణాయామముచేసితిరుగా స్నానమాచరించిపరిశుద్ధులగుదురు.

మనుః— "చండాలశవయూపాంశ్చస్పృష్ట్వాస్నాతాంరజస్వలాం ।
స్నానార్హస్తుయదాస్నాతిస్నానంనైమిత్తికంహితత్ ॥

తా. తాకకూడని పంచముని శవమును రజస్వల స్త్రీని "చ" అనుటచే తురుష్కులుమొదలగు హూణులు శునకము సూకరము మల మూత్రములు ఉచ్ఛిష్టము మొదలగువానిని తాకిలవిపోగొట్టుకొనుకొరకు చేయు స్నానము నైమిత్తికస్నానమనబడును.

ఆగ్నేయపురాణే - "నిత్యంనైమిత్తికం కామ్యంక్రియాంగంమల కర్షణమ్
క్రియాస్నానంతథాషష్ఠం షోఢాస్నానంప్రకీర్తితం "

తా. నిత్యనైమిత్తికం కామ్యం క్రియాంగం మలాపకర్షణం క్రియ అనిస్నానములు ఆరువిధములని విధించబడినది.

యాజ్ఞవల్క్యః—"ఆపఃపవసదాపూతాస్తాసాంవహ్నిర్విశోధకః। తతస్సర్వేషుకాలేషు ఉష్ణాంభః పావనం స్మృతం" ॥

తా. నీరు యెల్లప్పుడు శుద్ధమైనది అగ్నివాటిని శోధించుటచే యెల్లప్పు

ము ఉష్ణజలమే శ్రేష్ఠమనిస్మృతులయందు ప్రతిపాదింపబడినదని కొందరుచె ప్పుచుందురు.

—వ్యాసః—శీతాస్స్వప్సునిషిచ్యోష్ణామంత్రసంభారసంభృతాః।
గేహేపిశస్యతే స్నానం నదీఫలసమంవిదుః॥

తా. చల్లని జలమున ఉష్ణజలముచేర్చి మంత్రములచే అభిమంత్రించిగృహమునందు స్నానముచేసిన అట్టిస్నానము నదీస్నానముచే లభించుఫలమును పొందుదురు.

సంగ్రహకారః— అబుద్ధి పూర్వసంస్పర్శేద్వయోస్స్నానంవిధీయతే। త్రయాణాంబుద్ధిపూర్వేతు, తత్స ఎత్రి ప్తిర్నాన్యయకల్పనా॥

తా. అబుద్ధిపూర్వకముగా తాకినపక్షమున రెండు మార్లుస్నానముచేయవలయుననియును బుద్ధిపూర్వకముగా తాకినపక్షమునమూడుమార్లుస్నానము చేయవలయుననియును స్పర్శదోషన్యాయమునకుయేర్పఱచబడినది.

—విష్ణుః— స్నానార్హోయో నిమిత్తేనకృత్వా తోయావగాహనమ్,
ఆచమ్యప్రయతఃపశ్చాత్స్నానం విధివదాచరేత్॥

తా. ఏదైన నొకకారణముచేత అశుద్ధుడగువాడు శుద్ధుడగుటకుగాను స్నానముసేయగోరినయెడల మొదటనూరక నీటమునిగిలేచి వెనుక నాచమనముజేసి విధిప్రకారము మరలస్నానముచేయవలయు.

—మార్కండేయపురాణే - సర్వకాలంతిలైః స్నానంపుణ్యంవాసోబ్రవీన్మునిః, తుష్యత్యామలకైర్విష్ణురేకాదశ్యాం విశేషతః, శ్రీకామస్సర్వదా స్నానంకుర్వీతామలకైర్నరః, సప్తమీం నవమీంచైవ పంచపర్వసువర్జయేత్॥

తా. ఎల్లప్పుడు తెల్లనినువ్వులచేతస్నానముసేయుట పుణ్యలోకమునవసిరిచెదు ఆధిక్యతకలుగును అనిమార్కండేయులుచెప్పిరి. ఆమలకముచే నూరిపూసిస్నానముచేసెనేని విష్ణుప్రీతినొందును.ఏకాదశి యందైనయెడల విశేషతృప్తినొందును. సంపత్తునుకోరువారు ఎల్లప్పుడు నెల్లికాయనూరిపూసికొని స్నానముచేయవలయు. సప్తమి నవమి పంచపర్వములు అనగా అమావాస్య

పౌర్ణమి కృష్ణాష్టమి అనంత చతుర్దశిసూర్యసంక్రమణము అనుదినములయందు నెల్లికాయనూరిపూసికొని స్నానముచేయవలదు.

—విష్ణుః— బాలాశ్చ తరుణావృద్ధా నరనారీనపుంసకాః । స్నాత్వా మాఘేశుభేతీర్థే ప్రాప్నువంతీప్సితంఫలమ్॥ మాఘమాస్యుషసిస్నాత్వావి ష్ణులోకంసగచ్ఛతి॥

తా. బాలురైనను, యౌవనులైనను, వృద్ధులైనను, స్త్రీలయినను నపుం సకులైనను మాఘమాసమున పుణ్యతీర్థములయందు ప్రాతఃకాలమునస్నానము చేసిరేని తాము కోరు ఫలములను జెంది తుదను విష్ణు సాయుజ్యము నొం దుదురు.

—మనుః— పక్షాదౌచరవౌషష్ఠ్యాంరిక్తాయాంచతథాతిథౌ, తై లేనాభ్యజ్యమానస్తు ధనాయుర్భ్యాం విహీయతే॥

తా. పాడ్యమి భానువారము షష్ఠి చవితి నవమి చతుర్దశి మొదలగు రి క్తతిథులయందును "చ" అనుటచే- అమావాస్య పౌర్ణమి ఇట్టి దినములయం దును నువ్వులనూనెచే స్నానముచేసిరేని ఐశ్వర్యము ఆయువు క్షీణించును.

— గర్గః — పంచదశ్యాం చతుర్దశ్యా మష్టమ్యాం రవిసంక్రమే ద్వాదశ్యాం సప్తమీషష్ఠ్యోస్తైలంస్పర్శంవివర్జయేత్ ॥

తా. షష్ఠి సప్తమి అష్టమి ద్వాదశి చతుర్దశి పౌర్ణమిమొదలగుపిన్న దినములయందు నూనెస్పర్శించకూడదు.

—ప్రచేతాః—సార్షపంగంధ తైలంచయత్తైలంపుష్పవాసితమ్ । అన్య ద్రవ్యయుతంతైలం నదుష్యతి కదాచన ॥

తా. ఆవనూనె చందనాదితైలము పుష్పరస సముదాయమగు పరిమళ తైలములు అనగా సంపంగి మల్లె ఆమలకముఘృతము మఱియు ననేక విధము లగు తైలములతోగాని, మంచినూనెను మిశ్రముచేసిగాని ఎల్లప్పుడుస్నానము చేసిరేనిదోషమురానేరదు.

—శాతాతపః— అన్యైరపి కృతేకూపేసరోవాప్యాదికేతథా।తత్ర స్నాత్వా చపీత్వాచ ప్రాయశ్చిత్తంసమాచరేత్.

తా. అన్యులచే నేర్పరచబడిననే విధమైన నీటియందునస్నానముసేయ

కూడదు, ఒకవేళ స్నానముచేసినను, పానముచేసినను ప్రాయశ్చిత్తము చేసికొనవలయు.

మను:—అలాభే దేవఖాతానాంసరసాం సరితాంతథా । ఉద్ధృత్యచతురః పిణ్డాన్పారక్యే స్నానమాచరేత్॥

తా ॥ దొనలు మడుగులు నదులులేనిచో అన్యులచే నేర్పరచబడిన తటాకములు కూపములు మొదలగువాట్లయందు నాలుగు ఉంటలుమన్ను అడుసు చెత్త మొదలగువానిని ఎత్తిపారవైచి స్నానముచేయవలయు.

## ఊర్ధ్వపుండ్ర ధారణక్రమము.

శ్రీమన్నారాయణుండు సకలచేతనోజ్జీవనార్థముప్రవర్తింపజేసిన* ఋగ్యజుస్సామాథర్వణవేదములయందును, వాసుదేవ వరాహ కాత్యాయననారద ముఖ్యోపనిషదాదులయందును, పాద్మబ్రహ్మాండస్కాందాదిపురాణములయందును, శ్రీవరాహనైనారుల ఘోషదంష్ట్రపాదకేసరములవలనకలిగినవై, ఐశ్వర్యారోగ్యజ్ఞాన మోక్షప్రదములైన, కృష్ణరక్త పీత శ్వేత మృత్తికలలో ముముక్షువులైనప్రపన్నులు శ్వేతమృత్తికచే లలాటాదులయందుఊర్ధ్వపుండ్ర

*ఋగ్వేదే,శ్రుతయః—ఊర్ధ్వరేఖం ప్రదధదూర్ధ్వలోకంయాత్యంతేవిష్ణురియమింద్రాగ్నీ అవతంధియావామదీయం దధానముదాదీర్ఘమాయురస్మైయస్తుపురుభుజాపరంధీమహి.

యజుషి, శ్రుతయః — ధృతోర్ధ్వపుండ్రః కృతచక్రధారీ విష్ణుంపరంధ్యాయతియోమహాత్మా । స్వరేణమంత్రేణ సదాహృదిస్థితం పరాత్పరం .యన్మహతోమహాంతం.

అథర్వణే, శ్రుతయః — హరేఃపాదాకృతి మాత్మనోహితాయ మధ్యేఛిద్రమూర్ధ్వపుణ్డ్రంధారయతి, సపరస్యప్రియోభవతి సపుణ్యవాన్భవతి, సముక్తిభాగ్భవతి.

ము హరిపాదాకృతిగను తన్మధ్యప్రదేశమున రక్తవర్ణహారిద్రాచూర్ణ సహితముగను ధరించుకొనవలయుననియు, ఇట్లుధరించుటచేత పిరాట్టిసహితముగ పెరుమాళ్లువేంచేసియుండి సంతోషించుచున్నారనియు చెప్పబడియున్నది. మరియు క్షీరాబ్ధినాథుని అనుజ్ఞచే శ్వేతమృత్తికను క్షీరఖండమును పెరియతిరువడినయినారు తెత్తుకొనివచ్చి నఖములచే వివిధప్రదేశములయందు విదిలించగా

---

భల్లశాఖాయాం.— అర్చనాదౌయజ్ఞమూర్తేర్ధృతోర్ధ్వపుండ్రోద్విజోత్తమః, కులంతారయతే సప్తసగచ్ఛేత్పరమాంగతిం.

శ్రీవరాహోపనిషత్, — శ్రీచూర్ణం శ్రీకరందివ్యం శ్రియశ్చాంగసముద్భవమ్, పుణ్డ్రద్వయస్యమధ్యేతు ధార్యంమోక్షార్థిభిర్నరైః, తిస్రస్తిస్రోర్ధ్వరేఖాఃప్రకుర్వీతక్షీరాబ్ధౌశ్వేతద్వీపే, క్షీరఖండేవైనతేయేనానీయ్యానఖాభ్యాం దళనాచ్ఛ్వేతమృత్తికాముక్తిసాధికాభవతి.

స్కాందే, ఈశ్వర ఉవాచ.— ఊర్ధ్వపుణ్డ్రవిధానంతే వక్ష్యామి పరమంశుభమ్, సంపదారోగ్యవిజ్ఞాన మోక్షప్రదముమాసుత, కృష్ణారక్తాతథాపీతాశ్వే తామృత్స్నాచతుర్విధా, కథ్యతే పురుషైః పుణ్డ్రైర్యైశ్వర్యాదిఫలార్థిభిః,పురా విష్ణుర్హిరణ్యాక్షంవినిహంతుంమహాభుజః, వారాహంవపురాస్థాయ సాగరానవిలోడయత్, కృష్ణాఘోణోద్గనాజ్జాతారక్తాదంష్ట్రాగ్రఘాతనాత్, పాదైశ్చఖననాత్పీతాశ్వేతా కేసరచాలనాత్, కృష్ణాసంపత్ప్రదానిత్యం రక్తారోగ్య ప్రదాభవేత్, పీతాజ్ఞాన ప్రదాప్రోక్తాశ్వేతా మోక్షప్రదానృణామ్.

బ్రహ్మాండే.— విమలాన్యూర్ధ్వపుండ్రాణి సాంతరాళానియోనరః, కరోతివిపులం తత్రమందిరంయఃకరోతిసః, ఊర్ధ్వపుణ్డ్రస్యమధ్యేతు విశాలేసుమనోహరే, లక్ష్మ్యాసార్థం సమాసీనో రమేహంతత్రనిర్వృతః.

పాద్మేపురాణే, శంకరః. — ఊర్ధ్వపుండ్రస్యమధ్యేతు, విశాలేసుమనోహరే, లక్ష్మ్యాసార్థం సమాసీనో, దేవదేవోజనార్దనః, తస్మాద్యస్యశరీరేతు, ఊర్ధ్వపుణ్డ్రంధృతంభవేత్, తస్యదేహో భగవతోవిమలంమందిరంశుభమ్.

నందుచే ముక్తిసాధనమైన శ్వేతమృత్తిక కలిగినట్లు చెప్పబడియున్నది. శ్రీవి ష్ణుక్షేత్రములయందుండు విమలమైన శ్వేతమృత్తిక నెత్తుకొనివచ్చి పెరుమాళ్లకు సమర్పించిమూలమంత్రముచే అభిమంత్రించి ఊర్ధ్వపుణ్డ్రమును హరిపా దాకృతిగధరించుకొనుమని చెప్పబడియున్నది, లలాటాదిద్వాదశస్థానములయందు కేశవాదిద్వాదశమూర్తులను పిరాట్టి మార్లసహితము ధ్యానము చేయుచు కేశవాది మంత్రానుసంధానముతో ఊర్ధ్వపుణ్డ్రము ధరించుకొనవల యునని చెప్పబడియున్నది.

*. శ్రీమత్ పరమహంసేత్యాదివాది కేసరి అళగియ మణవాళజీయర్ ఆహ్నికమునందు ఉదహరించబడినపరాశరసంహితయందు.—శుచియగుప్రదేశమునశుద్ధాసనమందు పద్మాసనుడై తూరుపుముఖముగకూర్చునిహస్తములనుశోధించి శుద్ధాత్ముడైతనదక్షిణహస్తముతో తిరుమణ్ పెట్టెనెత్తి బెత్తముచేగాని దారువుచేగాని చేయబడిన ఆసనముపైనునిచ్చి, సువర్ణరజతాదులచేచేయబడిన ఉద్ధరిణి పాత్రలలోనైననులేక ముఖ్యముగనారికేళ ఉద్ధరణిపాత్రలలోనైనను

పరాశరస్మృతౌ.— ఆదాయవైష్ణవక్షేత్రాన్మృత్తికాంవిమలాంసితాం, మూలమంత్రేణాభిమంత్ర్యోర్ధ్వపుండ్రాణి ధారయేత్, లలాటాదిషుచాంగేషు కేశవాద్యభిధాక్రమాత్, ద్వ్యంగుళంత్ర్యంగుళంవాపిసాంతరాళం ప్రకల్పయేత్, పార్శ్వమంగుళమాత్రేతుఊర్ధ్వపుణ్డ్రస్యలక్షణం,హరేః పాదాకృతింరమ్యంసుపార్శ్వంసుమనోహరం। నాసికామూలమారభ్యలలాటాంతంమువిన్యసేత్, ఏవంసర్వాణిపుణ్డ్రాణి సచ్ఛిద్రాణ్యేవధారయేత్, ప్రమాణహీనం బద్ధాగ్రమచ్ఛిద్రంచైవవర్జయేత్.

*.ఊర్ధ్వపుండ్రవిషయమైనఅళకియ మణవాళజీయ్యార్ ఆహ్నికమునందుదహరింపబడినపరాశరసంహితయందు.

శుద్ధాసనేశుచౌదేశే। స్థిత్వాపద్మాసనేతథా। ఆదాయప్రాఙ్ముఖోభూత్వా। శ్రీసృత్స్నాద్యాదిపేటికాం। హస్తౌప్రక్షాళ్య శుద్ధాత్మా। గృహీత్వాదక్షిణేన[illegible]। సౌవర్ణేన చ రౌప్యేణ। నాళికేరేణ ముఖ్యతః। కృత్వా చోద్ధరణీపాత్రం [illegible]వేత్రదార్వాదిపీఠకమ్। జలంసంపూర్యతత్పాత్రే। ఉద్ధరిణ్యా చ తద్ధరేత్। కించిజ్జలం వామహస్తే। ధృత్వామూలమనుస్మరన్। ప్ర

జలమునుపూరించి ఉద్ధరిణిచే కించిత్తు జలమును ఎత్తి తిరుమంత్రానుసంధాన ముతో వామహస్తమున నుంచి పరిశుద్ధమైన శ్వేతమృత్తికను ద్వయానుసంధానముతో చాది "భూ" బీజాది మంత్రములచే అభిమంత్రించి శ్రీహరిస్మరణజేసి తర్జనిశ్రేణితో చాదిన తిరుమణి లలాటమునందు ధరించుకొనవలయుననియు, దర్పణకాంస్యములనుచూచుచుఊర్ధ్వపుండ్రముఋజుత్వముగచక్కగహరిపాదాకృతిగ ధరించుకొనవలయుననియు, ఆఊర్ధ్వపుండ్రము నాసాదియందు రెండు అంగుళముల నిడివిగల పాదమును మధ్యయొకటిన్నర అంగుళప్రదేశ వైశాల్యముగలిగి యిరుప్రక్కల నొక్కొక యంగులము వెడల్పుగల రేఖలునుగలిగియుండవలయుననియు - లలాట భుజ యుగ్మ పృష్ఠ కంఠ కూపక ప్రదేశములగునీ యారు స్థళములయందుండు ఊర్ధ్వపుండ్రము నాలుగు అంగులముల నిడివిగలిగియుండవలయుననియు కుక్షితత్పార్శ్వములయందుండునవి పదియంగుళముల నిడివిగలిగియుండవలయుననియు, బాహువక్షస్తలములయందుండునవి యెనిమి

---

ప్తిఫలసిద్ధ్యర్థమ్ । విష్ణుసాయుజ్యహేతవే । పంకీకృతాం ధ్వయేనైవ । శుద్ధాం శుద్ధేన మృత్తికామ్ । విష్ణోర్నుకేతిమంత్రేణ । గంధద్వారేతిమంత్రతః। సుదర్శనానుష్టుభేన । నృసింహైకాక్షరేణచ । భూ బీజేనైవ మామంత్ర్యాభిమంత్ర్యహరిం స్మరన్ । తర్జన్యామృదమాదాయ । లలాటే ధారయేద్ద్విజః । అంగుష్ఠః పుష్టిదః ప్రోక్తో । మధ్యమాయుష్కరీభవేత్ । అనామికాతథానిత్యం । ముక్తిదాతర్జనీసదా । దృష్ట్వాసుదర్పణం కాంస్యం । గణదేవాఖ్యమానుషం । ఊర్ధ్వపుండ్రంఋజుంసమ్యక్ । హరిపాదాకృతింశుచిః । నాసాదౌ ద్వ్యంగుళంపాదం । మధ్యంస్యార్థాంగుళం భవేత్ । పార్శ్వమంగుళమాత్రంతు । సుస్పష్టంధారయేద్ద్విజః । లలాటేభుజయుగ్మేతుపృష్ఠయోః కంఠకూబరే । పార్శ్వమంగులమాత్రంతు । ఆయతంచతురంగులం । కుక్షౌతత్పార్శ్వయోశ్చైవ । ఆయతంతుదశాంగులం । బాహ్వోర్వక్షస్థలే పుండ్రమష్టాంగుల ముదాహృతమ్ । ఫలాదన్యత్రబిల్వస్య । యద్వర్ణం పూరయేచ్ఛ్రియం । అవైష్ణవస్సవిజ్ఞేయః । తంకుర్యాత హరిప్రియః । విష్ణ్వర్పితం రక్తవర్ణం । హారిద్రాచూర్ణముత్తమమ్ । లక్ష్మీనివాస సిద్ధ్యర్థమ్।దీపాకారం తుసూక్ష్మకం । ఊర్ధ్వపుండ్రస్యమధ్యేతు । లలాటాదిషుధారయేత్ ॥

డియంగుళముల నిడివిగలిగి యుండవలయుననియు, బిల్వకరండము తప్ప తక్కిన యేకాయలయందును శ్రీచూర్ణమునుంచి ధరించకూడదనియు అట్లుచేసి లేని వారవైష్ణవులనియు, పిరాట్టి అనుగ్రహమునకు పాత్రులగుదురనియు తెలియ తగినది - విష్ణ్వర్పితమైన రక్తవర్ణ హారిద్రాచూర్ణము ఉత్తమమనియు అది ఊర్ధ్వపుండ్ర మధ్యప్రదేశమున లక్ష్మీనివాససిద్ధ్యర్థము దీపాకారముగ ధరించుకొనవలయుననియు స్పష్టముగ చెప్పబడియున్నది.

శ్రీపాంచరాత్ర, పాద్మసంహితయందు.— "నాసికా మూలమారభ్యాలలాటాంతం ప్రకల్పయేత్" అనియు "నాసికాయాస్త్రయోభాగానాసామూలం ప్రచక్షతే, తదారభ్య లిఖేత్పుండ్రం మయిభక్తాభవంతిచేత్" అనియునాసికా మూలము నందారంభించి లలాటాంతము వరకు ఊర్ధ్వపుండ్రముధరించవల యుననియు నాసికము యొక్క మూడవభాగము నాసికామూలమని చెప్పబడి యున్నది.

ఆ ఊర్ధ్వపుండ్రమునకు మధ్య ప్రదేశ ముండవలయు ననియు అట్లు లేక. ౧—ఉంచుకొను వారి లలాటమునందెల్లప్పుడు శునకపాదముండునని యు గాన. ౨—హారిద్రాచూర్ణ సహితమధ్యప్రదేశముగల ఊర్ధ్వపుండ్రము ధరించుకొన వలయు ననియును మరియు. ౩—వక్రముగాను విరూపముగాను బద్ధాగ్రముగానుఛిన్నమూలముగాను పాదములేకను పరిమళములేకను అప సవ్యముగానుధరించుకొను ఊర్ధ్వపుండ్రము నిరర్థకమనియు. "యథాచర్మనదృశ్యేతతథోర్ధ్వంపుండ్రమాచరేత్" అనివాసిష్ఠ వచనప్రకారము చర్మము తెలి యకుండుటుల దళముగ ఊర్ధ్వపుండ్రము నుంచుకొనవలయు. "శ్రీచూర్ణస హితంపుండ్రం, విష్ణుస్థానంప్రకీర్తితం సోచేజ్జ్యేష్ఠా గ్రహంవింద్యాత్ తస్మాత్త

౧—పాద్మపురాణె— అచ్ఛిద్రమూర్ధ్వ పుండ్రం తుయేకుర్వంతిద్విజాధమాః, తేషాంలలాటెసతతంశునః పాదోనసంశయః.

౨—తస్మాద్ధరిద్రాన్వితం పుండ్రం సహరిద్రంశుభావ్హయం, ధారయేద్బ్రాహ్మణోనిత్యంహరిసాలోక్యసిద్ధయే.

[illegible]—వక్రంవిరూపం బద్ధాగ్రంఛిన్నమూలం పదచ్యుతం, విగంధమపసవ్యం [illegible] చుంతాహునరకం.

ర్ధారయేద్విజః" అనురీతిని శ్రీచూర్ణసహితమగు పుణ్డ్రము ఎంబెరుమాళ్ నిత్య వాసమునకు యోగ్యమగు నొకదివ్యదేశమనియు శ్రీచూర్ణములేనిచో మూదేవికివా సస్థానమనియు ఖగప్రశ్నసంహితావచనముచే ఆశౌచకాలములయందును శ్రీచూర్ణధారణములేక యుండకూడదను న్యాయముతోచుచున్నది.

శ్రీమదిత్యాది శ్రీమాన్ మంచాలగడ్డ వేదాంతాచార్యుల ఆహ్నికమునందు.

౧—పచ్చకర్పూరాదులచే వాసితమగు శ్వేతమృత్తికగానుండ వలయునని యు, ౨—ఆమృత్తికచే ఊర్ధ్వపుణ్డ్రము హరి పాదాకృతిగాను సౌమ్యముగాను మిక్కిలి మనోహరముగాను స్పష్టముగాను ధరించుకొనవలయుననియు, ౩— కేశవాదిద్వాదశోర్ధ్వపుణ్డ్రములను ధరించు కొనుటకు అనుకూలించని యెడల, లలాటహృదయ బాహుద్వయముల యందు నాలుగు పుణ్డ్రములను ధరించుకొన వలయు ననియు, నందుకు నవకాశము లేనియెడల కేశవదామోదర మూర్త్యధిష్ఠిత పుణ్డ్రద్వయములను ధరించుకొన వలయుననియు. ౪—కాంస్యములవలె దర్పణము శాస్త్రప్రసిద్ధముగాన అద్దమునుచూచిపుణ్డ్రము ధరించుకొనవలయుననియు.

సాందమునందు, మార్గశీర్షమాహాత్మ్యమున— బ్రహ్మచారి యత్యాదులనుద్దేశించి దర్పణదర్శనమును విధించియుండుటవలన, వారలకునిషేధించినది వేరువిషయమని తెలియందగినది మరియు. అచటనే వారలకు రాత్రికాలములందు దర్పణదర్శనమును విధించి యుండుటవలన, వారలకు రాత్రికాలములందు దర్పణమును నిషేధించినది వేరువిషయమని తెలసికొనవలయు.

---

౧—తత్రకర్పూరాధి వాసితాం శ్వేతమృత్స్నాం౨౦.

౨—హరిపాదాకృతీన్ పుండ్రాన్ సుసౌమ్యాన్ సుమనోహరాన్, ఇత్థం పాదస్థితగ్రాహ్యాన్, స్ఫుటపార్శ్వాంస్తుధారయేత్.

౩—ఏవంద్వాదశవ్యూహధారణాసంభవే, చతురర్వ్యూహంవా లలాటే హృదిబాహ్వోశ్చధారయేత్, దామోదరం కేశవంచకదా చిదపినత్యజేత్, ఇతివసిష్ఠసంహితోక్తంపుణ్డ్రద్వయంవా.

౪—శ్రీసాత్వతే, [illegible] ప్రకరణే — ఆత్రమపాత్రే ధవాన్యస్మిన్, సేనాదాయ హుతాశనం, ఆరణ్యం లౌకికంవాపి మణిజం దర్పణోగత వం, ఇత్యుక్తత్వాత్ కాంస్యేతరదర్పణమ శాస్త్రప్రసిద్ధం. [illegible]

౧—ఊర్ధ్వపుణ్డ్రమునఖములచేమాత్రము ధరించకొనకూడదని చెప్పియుండుట స్మృతిచన్ద్రికయందు "స్వయంధౌతేనక ర్తవ్యాకారుధౌతంవివర్జయేత్" అను వచమునకు చాకలివానిధౌతమునుమాత్రము వర్జించుమనిచెప్పుటచే ఇతరధౌతములకు అభ్యనుజ్ఞ చేయ బడినటుల నఖములచే ధరించుకొనకూడదని నిషేధించుటచే, నఖవ్యతిరిక్తాదులచే పుణ్డ్రధారణము చేయవచ్చునని, అనుజ్ఞచేయబడియుండుటవలనను. ౨—"యేనోర్ధ్వపుణ్డ్రంసౌమ్యంస్యాత్ ఆర్జవంచాకృతింభవేత్ తేనకుర్యాత్ ప్రకారేణ తాదృశంఫలదంభవేత్" అనునారదీయ వచనమునందు, "యేనకేన" యని సామాన్యముగ చెప్పియుండుటచే దేనిచేధరించికొను నెడలసౌమ్యముగానుండునో దానిచేధరించుకొనవలయుననియు, అంగుళములచేమాత్రముధరించుకొనవలయునను నిర్బంధము లేదనియు. ౩—ఊర్ధ్వపుణ్డ్రమధ్యప్రదేశమునందుశ్రీచూర్ణమును ధరించవలయుననియు, అట్లుధరించని పుణ్డ్రమునిష్ప్రయోజనమనియు, గానభగవత్ప్రీత్యర్థము సంధ్యాది సర్వకర్మములయందుశ్రీచూర్ణసహిత ఊర్ధ్వపుణ్డ్రమును బ్రహ్మక్షత్రియవైశ్యశూద్ర అనులోమప్రతిలోమజ అంతరజాతులును ధరించుకొన వలయుననియు.

---

౧—యథాకామంతుసర్వాభిర్నఖైరితికేచన, ఇత్యుక్తత్వాత్, స్మృతిచంద్రికాయాం, స్వయంధౌతేన కర్తవ్యాః, కారుధౌతం వివర్జయేదిత్యత్రస్వయందౌతే నేత్యేవసిద్ధే కారుదౌత నిషేధేనకారువ్యతిరిక్తధౌతమభ్యనుజ్ఞాతమిత్యవగమ్యతే, ఇత్యుక్తరీత్యానఖైర్విలిఖేదితినిషేధేననఖవ్యతిరిక్తం పుణ్డ్రధారణే అభ్యనుజ్ఞాతంభవతి.

౨—యేనోర్ధ్వపుండ్రంసౌమ్యం స్యాత్ ఆర్జవంచకృతం భవేత్, తేనకుర్యాత్ ప్రకారేణతాదృశంపలదంభవేదితి, నారదీయవచనే—యేనకేనేత్యేవం సామాన్యోక్తేశ్చపవంచ అంగుళ్యైవధార్యాణీతి నిర్బంధో నకర్తవ్యః—

౩—హారీతస్మృతౌ.పుండ్రాణామంతరాళేషు హరిద్రాం ధారయేచ్ఛ్రియం పాద్మే ఉత్తరఖండేచ—తత్తత్పుణ్డ్రేషు తన్మూర్తింధ్యాత్వా పుండ్రాగమేత్,అంతరాళేషు సర్వేషాం హరిద్రాంధారయేచ్ఛ్రియం. [illegible] హితాయాం. శ్రీచూర్ణం వైష్ణవోనిత్యం ఊర్ధ్వపుండ్రస్య

బ్రహ్మచారిగృహస్థవానప్రస్థసన్యాసాశ్రములు శ్రీచూర్ణము ధరించనియెడలవారి ముఖావలోకనము చేయకూడదనియు. ౪—బ్రహ్మచారి గృహస్థ వానప్రస్థ సన్యాసులు సుమంగలీలు కన్యకలు వితంతువులు మొదలగువారు ఊర్ధ్వపుండ్రము మధ్య శ్రీచూర్ణము ధరించుకొనవలయుననియు. ౫—స్త్రీలు భ్రూమధ్యమునకుక్రిందుగా అర్ధచంద్రాకృతిగా పుండ్రమును నందుకుమధ్య శ్రీప్రదముగా నుండు శ్రీచూర్ణము దీపాకారముగ ధరించుకొనవలయునని చెప్పబడియున్నది.

శ్రీమదుభయశ్రీమాన్ వేదాంతదేశికుల సచ్చరిత్రరక్షయందు—

"అతశ్శుక్త్యాది విహితహరిపాదాది సంస్థానమేవభాగవతైరుపాదేయమితిస్థితం" అని సాయించియున్నారు.

పెండియుశ్రీదేవి భూదేవి నీళాదేవిమొదలగు పిరాట్టిమారులు అత్యాదరముతో సర్వోపచారములు చేయునదియై "అమరర్ శెన్నిప్పూవాయ్" బ్రహ్మేంద్రరుద్రమరుదరక్కిరీట కోట్లచే వంద్యమై సనకాది యోగిధ్యేయమై ప్రపన్నజనకూటస్థులగు ఆళ్వారులు మొదట "తుయర అఱుచుడరడి తొళుదెళ" అనితిరువుళ్లమునుగురించి అనతిచ్చితాము ఆశ్రయించునట్టుడు "ఉనపాదంకూడు

---

మధ్యమే। ధారయేద్యది తత్పుండ్రం మందిరంమేన సంశయః ఊర్ధ్వపుండ్రస్యమధ్యేతు. శ్రీచూర్ణంధారయేన్నచేత్। తత్పుండ్రం నిష్ఫలంనీచంని శ్రీకం నిధనావహం తస్మాన్మత్ప్రీణ న ర్థాయ ... వివర్ధయే ధారయేత్సతతం ధీమాన్ సంధ్యాదిషుచకర్మసు। ... ణోవా ఖగాధీశ రాజావావణిజోపివా శూద్రోవా। బిభృయాచ్ఛ్వగ్ణంప్రతిలోమానులోమజః బ్రహ్మచారీ గ్రహీవాపి। వానప్రస్థోథభిక్షుకః శ్రీచూర్ణధారీన భవేత్ తన్ముఖం నావలోకయేత్.

౪—వాసిష్ఠసంహితాయాం—బ్రహ్మచారిగృహస్థానాం।యతీనాంవనినామపి।సువాసినీనాంకన్యానాంవిధవానామపిద్విజాః। శ్రీచూర్ణంసతతం ధార్యం ఊర్ధ్వపుండ్రస్యమధ్యతః। దీప్రదీపసమంధార్యంశ్రీచూర్ణంబ్రహ్మవాదినాం। అన్యేషాంక్షత్రియాదీనాంతింత్రిణీదళసమ్మితం.

౫—అర్ధచన్ద్రాకృతిస్త్రీణాం ధార్యం పుండ్రం భ్రువోరధః, తన్మధ్యేధార్యం శ్రీచూర్ణం శ్రీప్రియంశుభం.

మారు కూరాయ్'' అనియు "ఉన్నడి శేర్ వణ్ణమరు కాయ్" అనియు "ఉన్న డి శేర్ అడియేన్ కావా వెన్నారే" అనియు "పూవార్ కళ్లల కళగునినయేక పొరుళదు మారుపుణరాయ్'' అనియు "ఉనపాదం శేర్ వతరిమే నెన్నాళ్ " అనియు "మణ్ణళందయ వైత్తామరైక కాణ్ పదరుగ'' అనియు "ఎన్నాళు న్నడికళ్ అడియేన్ మేవువదే" అనియు "నోడియార్ పొళుదు మునపాదంకాణ నోలాదాత్తేక'' అనియు "నోలాదాత్తేరున పాదంకాణ'' అనియు "అడియే నునపాదమగలగిల్లెనిరయుం" అనియు "ఉన్నడికీళ్ అమర్న్దు పుకుందేన్" అనియు ఇత్యాదులచే సర్వధా అవిచ్ఛిన్నముగ అనుసంధించునదియై "యన్మూర్ధ్ని మే శ్రుతి శిరస్సుచ భాతి యస్మిన్నస్మన్మనోరథ పథస్సకలస్సమేతి, స్తోష్యామనః కులధనం కులదైవతం తత్పాదారవింద మరవింద విలోచనస్య" అను ప్రకారము వేదశిరస్సున ప్రకాశించెడిదై, కులధనమై కులదైవమై సర్వమునై యుండునని యనుసంధించబడినదై యుండు సర్వశేషియైన శ్రీమన్నారాయణుని తిరువడిగళే ఉద్దేశ్యముగాను, ఉపాయముగాను ఉపేయముగాను, అధ్యవసించియుండువారలకు కాత్యాయన నారదోపనిషదాదులయందు జెప్పబడిన ప్రకారము శ్రీవిష్ణువుయొక్క చరణద్వయాకృతిని ధరించు కొనునదియే ఉచితము. "ధారయేత్పుణ్డ్రియత స్సమ్యగూర్ధ్వపుండ్రమతంద్రితః, మృదైవ వైష్ణవః కుర్యాదభావేచందనేనవా, నభస్మనాకదాచిచ్చ, ఊర్ధ్వపుండ్రం సమాచరేత్" అను ప్రమాణశ్లోకమురీతిని, వైష్ణవుడు తిరుమణిచే లలాటమునందు ఊర్ధ్వపుణ్డ్రము ధరించు కొనవలయు అది బొత్తిగా దొరకక పోయెనేని చందనముచే నుంచు కొనవలయునే గాని, యెకప్పుడును భస్మమును ఊర్ధ్వపుండ్రముగా ధరించందగదు, మరియునూర్ధ్వపుణ్డ్రముపై చందనముగాని భస్మముగాని అంజనాదులుగాని యేమాత్రమునుంచుకొనకూడదు.

శ్రీమద్వేద మార్గప్రతిష్ఠాప నాచార్యులై యుభయ వేదాంతములయందు పరిపూర్ణజ్ఞానము గలవారై, సకల శాస్త్రవిత్తములై పరమదయాళులై వేంచేసి యుండిన శ్రీమత్ పరమహంసేత్యాది, శ్రీమాక మధురమం గలం ఎంబార్ జీయరుస్వామి పుణ్డ్రవిషయ విచారమువచ్చినపుడు - దేశదేశ ముండి అనేకసంహితాదులను తెప్పించి ఉభయవేదాంత ములయందు

జ్ఞానముగలయనేకస్వాములను సమక్షమందుంచుకొని చక్కగా పరిశోధించి నిర్ణయించినది యేమనగా, అందరు లలాటఫలకములయందుంచుకొను తిరుమణ్ కాప్పు సకలవేదసారమై అక్షరత్రయాత్మకమగు ప్రణవార్థ ప్రకాశకమై యున్నదనియు "అకారశ్చిత్స్వరూపస్య విష్ణోర్వాచక ఇష్యతే, ఉకారశ్చిత్స్వరూపాయాశ్శ్రియోవాచితథావిదుః, మకారస్తుతయోర్దాస, ఇతిప్రణవలక్షణం" అనిత్యాదులచే భగవచ్ఛాస్త్రమున అకారవాచ్యుడగు పెరుమాళ్లకును ఉకారవాచ్యురాలగు పిరాట్టికిని మకారార్థభూతులగు సకలాత్మలు స్వతఃదాసభూతులని చెప్పబడియున్నదనియు, పరమపదమునందు పెరుమాళ్లు పిరాట్టిమారులను తనతిరుమేని ప్రదేశముననుంచుకొని అనుభవించుచు ఆనన్దసాగరనిమగ్నులైయుండ నాయానన్దాతిశయముచే సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందు సర్వవిధవిగ్రహ పరిగ్రహంబుసేసి సర్వవిధ కైంకర్యములు చేయుచుండెడు తిరువనంతాళ్వాన్ ఈ యర్థము నందరికిని తెలియునట్లు లలాటాదులయందు శ్వేతమృత్తికచే ధరించబడిన పెరుమాళ్ల తిరువడిగళును, అందుకు మధ్య రక్తవర్ణహరిద్రాచూర్ణముచే ప్రతిష్ఠించబడియుండెడు పిరాట్టి తిరువడిగళును (౧) "శెన్రాల్ కుడైయాం" ఇత్యాదుల ప్రకారము, శైత్యసౌగంధ్య మార్దవములుగల సర్పరూపముగాను పద్మరూపముగాను, శిరసావహించి ఆనన్దసాగర నిమగ్నలై యుండేలాగు శ్రీవైకుంఠగద్యలో "శ్రీమత్పాదారవిన్దయుగళం, శిరసికృతంధ్యాత్వామృతసాగరాంతర్నిమగ్న సర్వావయవస్సుఖమాసీత" అని సాయించిన ప్రకారము, యుండడమే సకలాత్మలకు స్వరూపమని, ప్రకాశింపజేసియుండుటయును, ఆ తిరువనంతాళ్వాన్ అవతారవిశేషమై "సకలవేదం

౧—శెన్ రాల్ కుడయాం, ఇరుంతాల్ సింగాసనమాం, నిన్రాల్ మరవడియాంనీళ్కడలుళ్, యెన్రుం పొనయాం మణివిళక్కాం పూంపట్టాం పులుగు మణైయాం తిరుమార్ కరవు.

నివాసశయ్యాసనపాదుకాంశుకోపధానవర్షాతపవారణాదిభిః। శరీరభేదైస్తవశేషతాంగతై, ర్యథోచితం శేషఇతీర్యతేజనైః.

పద్మాసనేనవిన్యస్తాంహరేః పాదాకృతిర్యథా, తన్మధ్యశ్రియతాం సర్వైః, లలాటేతిమనోహరే.

గళిలుం, సకలశాస్త్రంగళిలుం సకలమాన ఆళ్వార్ దివ్యప్రబంధంగళిలుం సక
లాచార్యపాశురంగళిలుం పార్త్తవిడత్తిల్, ఒరు అధికారికుద్వయమొఴియ
మన్త్రమిల్లై, మిథునమొఴియవస్తువిల్లై కైంకర్యమొఴియ పురుషార్థమిల్లై ఆ
చార్యాభిమానమొఴియ మోక్షోపాయమిల్లై భాగవతాపచారమొఴియ మోక్ష
విరోధమిల్లై" అనిసాయించినవారలగు శ్రీఉడయవరుల తిరువవతారస్థళమగు
శ్రీపెరుంబూదూరిలో పిళ్లమణ్డపమున హరిపాదాకృతి యూర్ధ్వపుండ్రమును
వేంచేపుచేసి ఆదిగువ కొన్ని ప్రమాణవాక్యములను అందరు తెలిసికొని యుజ్జీ
వించుకొరకువర్ణముతో లిఖించబడినవాటిని ఇచ్చటవ్రాయుచున్నాడను. (౧)

బ్రహ్మాండే— శ్లో॥ సర్వవర్ణేషు మద్భక్తాః, కుర్వీరన్ ఊర్ధ్వపుణ్డ్రకం —

తా॥ సర్వవర్ణములందుండు నాభక్తులు ఊర్ధ్వపుణ్డ్రమునుంచుకొనవలయు.

శ్లో॥ ఊర్ధ్వపుణ్డ్రం ఋజుసౌమ్యాలలాటే యస్యదృశ్యతే చండాలోపివి
శుద్ధాత్మా పూజ్యఏవన సంశయః.

తా॥ ఊర్ధ్వపుణ్డ్రము ఋజువుగాను సౌమ్యముగాను యెవరిలలాట
మునందు దృశ్యమానోవాడుచండాలుడైనప్పటికిని, పరిశుద్ధుడును పూజ్యుడును
అగును.

---

(౧) శ్రీమతే రామానుజాయనమః.

ఇన్దతిరుమణ్ శ్రీమన్నారాయణనుక్కు దీపంపోలే ప్రకాశికయాన పె
రియపిరాట్టియార్ పురుషకారమాగ ఎంబెరుమానుడయ అఘ్రివారాగిరచరణ
ఙ్గళిరణ్డైయుమ్ ఎమ్బెరుమానుడయ పాదపీటత్తుక్కు అభిమాన దేవతైయానతిరు
వనన్తాఘ్రివానుడైయ అవతారమాయ్ ఆళ్వారుక్కు పీటాభిమానియానమా
రనడిపణిన్దుయ్న్ద ఇరామానుజన్ ముగత్తాలె శరణమాగపత్తి ఇరుక్కుమిరా
మానుజ ముడైయార్ నెత్తియిలే శాత్తిక్కొళ్ళు మదాయ్ "మధ్యైకర్ణికయా
యుక్తం కించిత్ ఫుల్లామ్బుజాకృతిమ్" ఎన్నుపాద్మసంహితైయిల్ క్రియాపాద
త్తిల్ పత్తాం అధ్యాయత్తిలుం "అమ్భోజముకుళాకారంపాదంహ్యఙ్గుళసమ్మి
౨౯" ఎన్నువ్యాసస్మృతి ఉత్తరఖణ్డత్తిలుమ్ శొన్నపద్మాకారమాన పాదత్తోడే

నారదీయే, సప్తతితమేధ్యాయే—శ్లో॥ సర్పందృష్ట్వాయథాలోకేదదుశ్శరా భయసంయుతాః, ఊర్ధ్వపుండ్రాంకితం తద్వత్ కంపంతేయమకింకరాః.

తా॥ సర్పమునుజూచితే, లోకులు యెట్లుభయపడుదురో ఆలాగే ఊర్ధ్వపుండ్రముధరించినవారలనుజూచితె, యమకింకరులు భయపడుచున్నారు.

పారమేష్ఠ్యసంహితాయాం—"శ్లో॥ద్విజరాజన్య వణిజాం శూద్రాణాంమనుజన్మనాం పత తాసామాన్యతః ప్రోక్తం పితృదేవార్చనాదిషు॥ శిఖోపవీతవద్ధార్య మూర్ధ్వపుండ్రంద్విజన్మనాం। వినాకృతశ్చేద్విఫలాః క్రియాస్సర్వామహీపతే॥ తస్మాత్సర్వేషు కార్యేషు ధార్యం విప్రస్యధీమతః, భూతప్రేతపిశాచాది కూశ్మాండ బ్రహ్మరక్షసాం॥ రేవతీ పూతనామాతృఢాకినీ గుహ్యకాదినాం, రక్షాకరం దుర్గ్రహాణాం, సంసారగ్రహనాశనం, ఊర్ధ్వపుండ్రాత్పరంనాన్య ద్దృష్టంజ్ఞాతం శ్రుతంమయా॥

కూడినదాయ్ కుణ్డలీకృత సర్పస్థహా పాదద్వయాకారమాన తిరుమణ్ కాప్పు నడువిల్ వ్యూహకేశవన్ పిరాట్టి శ్రీదేవితోచిత లిఙ్గమిదమేవ సకృద్ధార్యమ్ భగవల్లక్ష్మీశఠగోపరామానుజశేష (ఈమధ్య రెండుపఙ్తులు మలినమై తెలియలేదు) పఙ్గళ్ రామానుజముడైయార్ వయిత్తిలేశాత్తికొళ్లుం తిరుమణ్ కాప్పు "తథాకుక్ష్యాదికాఙ్గేషుపాదస్తుచతురశ్రకమ్" ఎన్నువ్యాసోత్తరస్మృతియిల్ నాలామధ్యాయత్తిల్ శొన్ననల్ శవుకమానపీటమ్" (అన్త్యమున రెండు పఙ్తులు మలినమై తెలియలేదు)—



కుండలీకృతసర్పాకారము.



చతురశ్రకపాదము.



అంభోజ ముకుళాకార

తా॥ బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రఅను జన్మాది సర్వులు సర్వకార్యములందు ఊర్ధ్వపుణ్డ్రముధరించుకొనవలయుననియు, ఆఊర్ధ్వపుణ్డ్రముభూత ప్రేతపిశాచాది దుర్గ్రహములను దగ్గర జేరనియ్యదని చెప్పబడియున్నది,

బ్రహ్మరాత్రే—శ్లో॥ పూజాకాలేచ హోమేచసాయం ప్రాతస్సమాహితః,
సావిత్రీ జపకాలేచ వేదాధ్యయనఏవచ, యజనే భోజనేచైవ శయనే
చవిశేషతః, మంత్రానుచ్చార్య విధినా, ధారయేదూర్ధ్వపుండ్రకం
రక్షార్థం వంశవృద్ధ్యర్థం, మంగళార్థంచ పద్మజ ॥

తా॥ ప్రాతస్సాయంకాలములందును, పూజాజపహోమ వేదాధ్యయన యజన భోజన శయన మంత్రోచ్చారణకాలములందు,రక్షణార్థము వంశవృద్ధ్యర్థము మంగళార్థము ఊర్ధ్వపుణ్డ్రముధరించుకొనవలయునని చెప్పబడియున్నది,

—శ్రీమార్గవర్గ ప్రకాశిక—

(౨)కాత్యాయన(౩)నారదోపనిషత్తులయందు—నాసాదిమొదలుకేశపర్యంతముఊర్ధ్వపుణ్డ్రముశ్రీవిష్ణువుయొక్క-చరణద్వయాకృతిగాధరించుకొనవలయుననియు, అందుకువృకయంగుళము గలపాదముయుండవలయుననియు, తిరువనంతాళ్వాన్ అవతారమగు శ్రీరామానుజముఅను పాదమునకును హరిపాదాకృతికిని విచ్ఛిన్నములేకుండునట్లు ధరించుకొనవలయుననియు ,ధరించుకొనవలయు క్రమము బుద్ధియందు ఆరూఢమగుటకుగానువృకయంగుళమువేరుగల వృక్షమూలమునందుండి రెండుశాఖలుకలిగినటుల ధరించుకొనవలయుననియు, హరిపాదాకృతియగుఆరెండురేఖలు"ద్వేశాఖేహంసవర్ణాం"అనుప్రకారముహం

---

౨— కాత్యాయనోపనిషత్.

అథ ప్రణిపత్యకాత్యాయనోబ్రహ్మాణ మన్వయుఙ్క్త। అధీహి భగవోమే కిం పవిత్రాణాం పవిత్రం । కేనవాకర్మాణి సఫలాని । యద్దుష్కరంతపోమర్త్యానాం కేనసుకరేణా వృతత్వమేతి సహోవాచ । తేన యోగీశ్వరః । భోపవిత్రం సులభం సుకరం । యద్విష్ణుత్త్రేంత్రత్రమ్మృత్స్నాం శ్వేతా ముద్ధృతాసీత్యుద్ధరేత్ । అమృతమే వ శ్వేతమృత్స్నాభవతి। [illegible]ం శుద్ధజలేన వేన సంకర్షయేత్ । దేవపితృకర్మాణ్యారభమాణః । త

సమువలెధావళ్యముగనుండవలయుననియు నందుకుమధ్యరెండు వ్రేళ్ల వెడల్పుగలవిశాలప్రదేశముండవలయుననియు, ఆమధ్యప్రదేశమునందుశ్రీసంబంధమైనహరిద్రాచూర్ణముతోసూక్ష్మరేఖగా పీఠాట్టిని ప్రతిష్ఠించవలయుననియు "సా రేఖా శ్రీవర్ణా" అనుప్రకారము ఆశ్రీచూర్ణరేఖయనునది శ్రీదేవియొక్కవర్ణముగనుండవలయుననియుస్పష్టమైయున్నది.

---

యానిత్య మూర్ధ్వపుండ్రంబి భృయాత్ । మంత్రైః కేశవాదీనాం తద్రహితంకర్మ విఫలం । రక్షాంసి గృహ్ణీయుః । తదేవమభ్యుక్తం భవతి। నాసాదికేశాంతమూర్ధ్వపుండ్రం । విష్ణోఃస్థితస్యచరణద్వయాకృతిః । ఏకాంగులంపాదతరోరస్యమూలం । తదుత్పన్నేద్వేచశాఖే । తన్మధ్యేచ మధ్యావకాశోద్విరంగులాదన్యూనః । సఃశ్రీప్రతిష్ఠాస్థానం శ్రీహరిద్రాయుతోహరింద్రావయతి విష్ణునాసహ । ఆదిత్య వర్ణే శ్రీఫలేధారయేత్ । తజ్జలేనశ్రీ బీజేన సంమృజ్యతత్సూక్ష్మరేఖాంధారయేత్ । సశ్రీమాన్భవతి । తద్ద్వేశాఖేహంసవర్ణే । గాయత్రీత్రిష్టుప్ ఛందసేఆత్మపరమాత్మదైవతే । దర్శపౌర్ణమాసీకేష్టాపూర్తిక్రియే । భుక్తిముక్తిఫలే । సా రేఖాశ్రీవర్ణా । గాయత్రీఛందః ఆనందక్రియామృతత్వఫలా । అయంపుండ్రవిధిః । ఏవంవిదిత్వా యోధారయతిసవైదికోభవతి । ససర్వకర్మార్హోభవతి । కాయికాత్పాతకాత్ । పూతోభవతి । సవిష్ణుసాయుజ్యమవాప్నోతి । యఏవం వేదేత్యుపనిషత్ । సహనావవతు.

## ౩—శ్రీ నా ర దో ప ని ష త్.

అథప్రణిపత్యనారదో బ్రహ్మాణంయుంజీత, అధీహిభగవన్మేకిం పవిత్రాణాం పవిత్రంకేనవాకర్మాణిసఫలాని, దుష్కరం తపోమర్త్యానాం, కేనసుకరేణామృతత్వమేతి, సహోవాచ, సాధుతెనయోగం, శృణుసుపవిత్రం సులభంసుకరం, యద్విష్ణోఃక్షేత్రం, శ్వేతమృదాశుద్ధ్యర్ధరేత్, అమృతమేవశ్వేతమృద్భవతి, తాంశుద్ధజలేన ప్రథమేచఘర్షతి, మూలమంత్రద్వయంచవిష్ణోర్మకంగంధద్వారమధ్యేతాభిరభిమంత్రయేత్, దేవపితృకర్మాణ్యారంభమాణి, తథానిత్యమూర్ధ్వపుండ్రం వికుర్యాత్ మంత్రైః కేశవాదీనాం తత్తత్కర్మవిఫలంనభవతి, రక్షాంసిఘృణీధరః, తత్రైవమభ్యుతానాం, నాసాదికేశాంతమూర్ధ్వపుండ్రం విష్ణోఃస్థితస్యచరణద్వయాకృతి, ఆయతమేకాంగులం

—పిరాట్టి పెరుమాళ్ల తిరుమేనికాంతులు విచారించునెడల.—

బృహదారణ్యే— "తస్యహైతస్య పురుషస్యరూపం యథామహారజనం వాసోయథాపాణ్డ్వావికం, యథేంద్రగోపోయథాగ్న్యర్చి ర్యథాపుణ్డరీకంయథాసకృద్విద్యుత్తం, సకృద్విద్యుత్తేవహీంచా అస్యశ్రీర్భవతి" అని శ్రియఃపతి దివ్యమంగళ విగ్రహమునందు, మహారజన వాసపాండ్వావిక ఇన్ద్రగోపఅగ్నివిద్యుత్ పుణ్డరీకాది వర్ణములును.శ్రీసూక్తమునందు"పద్మవర్ణాం" అనియు "హిరణ్యవర్ణాం" అనియు "చన్ద్రసూర్యాగ్నివర్ణాభాం మహాలక్ష్మీముపాస్మహే"అనియు శ్రీదేవియొక్క తిరుమేనియందు హిరణ్యపద్మచన్ద్రసూర్యాగ్ని వర్ణములు ప్రకాశించుచున్నట్లు చెప్పబడియున్నది. తత్ప్రతిపాదకశాస్త్రములకంటె, మయర్వరమదినలముగల తత్వదర్శికులగు ఆళ్వారులుతగినజ్ఞాన చక్షుస్సులచే ప్రత్యక్షసమానాకారముగచూచి అనుభవించి ఆనతిచ్చిన శ్రీసూక్తులు ప్రబల ప్రమాణములగుటచే అందున "ఎన్నిలముగిల్ వణ్ణర్ కెన్నుం" అనియు; "కారార్ కరుముగిల్ పోల్ యెన్నమ్మాన్ కణ్ణనుక్కు" అనియు "ముగిలురువం ఎమ్మడిగళురువన్దానే" అనియు "మిన్నునామఘనతవణ్ణం మేగవణ్ణాం" అనియు ఇత్యాదులచే శ్రియఃపతికి కాళమేఘునిభశ్యామమగువర్ణమే ప్రధానముగను, "కమలమలర్ మేల్ శెయ్యాళ్" అనియు "పూమేయశెమ్మాదు" అనియు "శెయ్యవళ్" అనియు, ఇత్యాదులచే శ్రీదేవికి నెర్రనివర్ణమే ప్రధానముగ నుసాయించబడియున్నది.

---

పాదతగోస్సమూలే, తదుత్పన్నేశ్వశాఖా, తథైవచధృతంవిష్ణునా, ఆదిత్యాకర్మతపసేతిహరీతశ్రీఫలాధారయేత్, తజ్జలేన, శ్రీబీజేన సంస్పృజ్యతత్సర్వాలేఖాధారయేత్, హంసవర్ణ్యగాయత్రీత్రిష్టుప్ ఛందసేజీవాత్మపరమాత్మాదైవత్యే, లక్ష్మీనారాయణదైవత్యేవ, దశపూర్ణా పూర్ణమాసేష్టకే, ఇష్టాపూర్తిక్రియే భుక్తిముక్తిఫలే, సారేఖాశ్రీవర్ణా, గాయత్రీఛందః, శ్రీదేవత్యా, ఆనందక్రియా అమృతత్వఫలాయ ఏవమ్విద్వాన్ ధారయతి,సవైదికోభవతి, సర్వకర్మార్హోభవతి అనేన తెజస్వీ బ్రహ్మవర్చస్వీభవతి కాయిక వాచికమానసపాతకాత్పూతోభవతి, విష్ణోస్సాయుజ్య మవాప్నోతి,యఏవంవేద, ఇత్యుపనిషత్,ఇతినారదోపనిషత్సమాప్తా, హరిఃఓమ్.

—అనేకగ్రంథములనుచూచి సంగ్రహించిన చూడామణినిఘంటున.—

"మాకడల్ పిరన్దకోద్దైమావరిప్పిరిన్గైశెయ్యాళ్" అని చెప్పియుండడమునందు "శెయ్యాళ్" అనిశ్రీలక్ష్మీదేవియొక్క రూపము ఎఱ్ఱగాను.

"కలైనుగళ్ పనువలాట్టిగాయ త్రిజ్ఞానమూర్తి, యులగమాతాభిరామి, యొళ్ళియ వెళ్ళమెయ్యాళ్" అనిచెప్పియుండడమునందు "వెళ్లమెయ్యాళ్" యనిసరస్వతీదేవియొక్క రూపము తెల్లగాను.

"పచ్చైశివై గౌరి ముక్కట్ పార్ప్పతి యొడుభవాని" అనిచెప్పియుండడమునందు "గౌరి" యనిపార్వతీదేవియొక్కరూపము పచ్చగాను; ఇట్లుముగ్గురివర్ణములను చెప్పంబడియున్నది.

"గౌరి" గౌరవర్ణత్వాత్ — గౌరియని అమరమునకు వ్యాఖ్యానమగు

గురుబాలప్రబోధికయందు అర్థమైయున్నది.

మరియు, కాంచీపురాణమునందు—"పచ్చిళంకొడి మాదొరుపాలవళర్ నచ్చరావణినంబర్ నవిత్తియ" అనిచెప్పబడియున్నది.

—ఇకపిరాట్టికి శ్రీసూక్తమునందుచెప్పిన పద్మవర్ణమును విచారించునెడల.—

శ్రీగుణరత్నకోశవ్యాఖ్యానమున— "పద్మవర్ణాం" అను వాక్యమునకు "పద్మసమవిగ్రహవర్ణాం" అనిచెప్పబడియున్నది.

మరియు ఆరవపది పదియవతిరువాయిమొళి రెండవపాశురము—"శేరార్ శ్చునైత్తామరై, శెక్దీమలరుంతిరువేంగడత్తానే" అనువానికి, శేరుకళాల్ న్దుయిర్ న్దుళ్ళశునైకళిలే తామరైకళానవై శెక్ దీప్పోలేమలరానిరుక్కం అని సాయించిన ప్రకారము శెక్దామరయొక్క వర్ణముఎఱ్ఱగానుండునని యందరికిని ప్రసిద్ధమైయున్నది.

—శ్రీసూక్తమునందుచెప్పిన హిరణ్యవర్ణమునువిచారించునెడల—

శ్రీరామాయణమునందు, కిష్కింధాకాండమున నలుబదిరెండవసర్గమునందు—" తేషాం మధ్యేస్థితో రాజామేరురుత్తరపర్వతః, ఆదిత్యేనప్రసన్నేన శైలోదత్తవరః పురా, తెనైవము క్తశ్శైలేన్ద్రస్సర్వప వత్వాదాశ్రయాః మత్ప్రసాదాద్భవిష్యంతి దివారాత్రంచకాంచనాః, త్వయియేచాపివత్స్యంతి దేవగంధర్వదానవాః, తేభవిష్యంతి రక్తాశ్చప్రభయాకాంచన ప్రభాః" అని సూర్యభగవానులు, రక్తకాంచన పర్వతమగు మేరువునుచూచినిన్ను ఆశ్రయి

చియుండు సర్వములకును, నీవద్దవచ్చి వసించెడు దేవగంధర్వ దానవులకును నీయొక్క రక్తకాంచనప్రభయు కలుగుగాకయని అనుగ్రహించినట్లును.

మరియు సుందరకాండ ప్రథమసర్గమునందు—"ఆదిత్యోదయసంకాశై రాలిఖద్భిరివాంబరం,తప్తజాంబూనదైశ్శృంగైః పర్వతస్య సముత్థితైః, ఆకాశం శస్త్రసంకాశమభవత్ కాంచనప్రభం" అని తిరువడిలంకకు వేంచేయునపుడు, వారు విశ్రమించి పోవునటుల జేయుటకై ఆదిత్యోదయకాంతిగల తప్తజాంబూనదశృంగములుగలదై నాకపర్వతము పైకిలేచినపుడు నల్లని ఆకాశము ఆతప్తజాంబూనద ప్రభయుగలిగినదై ప్రకాశించినదని చెప్పబడియున్నది.

శ్రీమహాభారతము, భీష్మపర్వము పంచమాధ్యాయమునందు— "పరిమండలస్తయోర్మధ్యే మేరుఃకనక పర్వతః, ఆదిత్యతరుణాభాసః, విధూమ ఇవ పావకః" అని భూమధ్యమున కనకపర్వతమగు మేరువుయుండునట్లును అది బాలసూర్యునివలె ప్రకాశించుచుండునట్లును "సవై విచింతయామాస సౌవర్ణాన్ వీక్ష్యవాయసాన్, మేరురుత్తమమధ్యానామధమానాం చపక్షిణాం, అవిశేష కరోయస్మాత్, తస్మాదేనం త్యజామ్యహం" అనియు కుంకుమాంకితవర్ణము గల పెరియతిరువడి మేరువుయందు రక్తకాంచన ప్రభయుగల కాకము మొదలగువానినిచూచి ఉత్తమ మధ్యమ అధమములగు పక్షిజాతులకు నొకవిశేషము లేకనే సమానముగ మహన్మేరువు చేసి యుండుటచే ఇచ్చట నుండ కూడదని పెరియతిరువడి కోపగించి పోయినట్లును.

మరియు సప్తమాధ్యాయమునందు "తత్రజాంబూనదంనామ కనకందేవ భూషణం, ఇన్ద్రగోపకసంకాశంజాయతేభాస్కరంతుతత్" అని వేయిన్ని యెనిమిదివన్నె గల మేరుస్వర్ణమునకైనను నతిశయించినదై దేవతలు భూషణములుగ చేసి ధరించునదై ఇన్ద్రగోపసమానప్రకాశముగలదై యుండునది జాంబూనద స్వర్ణమని చెప్పబడియున్నది.

శ్రీభాగవతము, దశమస్కంధము షోడశోధ్యాయమునందు— యస్యనాభ్యామ వస్థితస్సర్వతస్సౌవర్ణః కులగిరి రాజో మేరుః అను భూనాభియందుస్వర్ణపర్వతమగు మేరువుండనట్లును— "సదామరలోకాభరణం జాంబూనదం నామ సువర్ణంభవతి యదుహావావవిబుధాదయః సహయువతిభిః ముకుటకట

కటిసూత్రాద్యాభరణ రూపేణధారయంతి" అను ప్రకారము అచట అమర లోకాభరణాహి జాంబూనద స్వర్ణము ఉండునట్లును అందుచే దేవతలు దేవస్త్రీలు మకుట కటకటి సూత్రాద్యా భరణములు చేసి ధరించునట్లును చెప్పబడియున్నది.

తిరువాయిమొழி మూడవపది మొదలు తిరువాయిమొழி రెండవ పాశురము— "శెట్టుక్కై త్తనన్ పొన్ రున్ తిరుమేని యొళియొవ్వా" ఉపమానమాగ పోరాదన్ఱైక్కుఱిక్కిఱార్ "శెట్టుక్కైత్త" కాయిచ్చియోడ్వైత్తనన్దాన పొన్ ఉన్నుడైయ స్వాభావికమాన దివ్య విగ్రహత్తికొళి కొఱప్పాగాదు, త్తన్నైశిక్షిత్తాలాయిత్తు వొప్పాగచొల్ల పాత్తంపోరాదదు— "రుక్మాభం" ఎన్నకడవదిరే" ఇందుకు జీయర్ అరుంపదమునందు. "ప్రశాసితారంసర్వేషా మణీయాంసమణీయసాం, రుక్మాభంస్వప్నధీగమ్యంవిద్యాత్తుపురుషంపరం" ఇతి మానవేద్వాదశేధ్యాయే— "రుక్మాభం" ఎన్గిరదు చన్ద్రివన్మ్యఖం ఎన్గా ప్పోలే దర్శనీయత్తై యైపత్తవాదల్ "మయూరగ్రీవాసదృశం" ఎన్గిర పడియే శ్యామమాయ్ శివన్దుమిరుక్కైక్కుయాలె మయూరగ్రీవాసదృశతన్మై పత్తవాదల్ హిరణ్యావర్ణైయానపిరాట్టి యోట్టైశేర్త్తియాలె యాదల్ "హిరణ్మయః పురుషః" ఎన్గిర అన్తరాదిత్య పురుష విషయమాతల్— "స్వప్నధీగమ్యం మానసజ్ఞానగమ్యం" అనియు.

మరియు మూడవ తిరువాయిమొழிయందు "శోదియాగి" అను అయిదవ పాశురమునకు, నిరవధిక తేజోరూపమాన తిరుమేనియై యుడయనాయ్ "నీల తోయదమధ్యస్థా" ఎన్నానిర్కుఱ్చ్చేయ్ తే "పీతాభా" ఎన్దదు అదావదు శ్రమహరమానవడివై పురగర్ ముట్టాక్కిట్టిరుక్కుమెన్ఱై" అనియు.

ఇందుకు అరుంపదమునందు—"శోది" ఎన్దత్తాల్ పలితత్తైఅరుళిచ్చెయ్గిరార్—నిరవధిక తేజో రూపమాన ఇత్యాది, రక్తవర్ణంహి తేజః, శ్యామళః ఖలువిగ్రహః తస్మాచ్ఛ్యామళస్యవిగ్రహస్యరక్తవర్ణ తేజోరూపత్వంకథమం భిధీయత ఇత్యత్రాహ, నీలతోయదేతి ఎన్దుం మయిల్ కழுత్తుచ్చాయైపోలె శివంది రుక్కుమితిభావః. ఎన్దుం "యద్వాపీతాభాం" ఎన్గిరదు "పిరాట్టియోట్టైచ్చేర్త్తియాలేయాదల్" అనియు చెప్పంబడియున్నది.

"శెంబొన్నేతిగళుం తిరుమూర్తియై" అనిన్ని "ఆణిచ్చెంబొన్ మేనియెం తాయ్" అనిన్ని ఆళ్వారులు సాయించియున్నారు.

తిరువిరుత్తమున ౮౫ వ పాశురము— "ఇరుళ్ గోడిత్యాది" ఇరుళ్ కొడివన్ధ సన్ధిత్తుమా త్తత్త శెంబొన్ పోలే శ్లాఘ్యమాన ఆదిత్యనై యాయిత్తుముడిత్తు కొండు మాలెవన్ధు తోత్తిత్తు అనియు.

అమలనాధిప్పిరాన్ రెండవ మూడవ పాశురములందు— "అరైచ్చివన్ధ వాడై" "ఉడైయార్ న్దవాడై" "శెక్రమామ్గిత్" తిరుమేనిక్కు పరభాగమాన పీతాంబరమ్" ఎన్నుం "అన్దిపోల్ నిరత్తాడైయుం" సన్ధ్యారాగం పోలేయిరుందు ల్లతిరుప్పీతాంబరముం "అరైచ్చి వన్ధవాడై యెన్నదు పిన్నాట్టుగిరపడి" అని సాయించియున్నారు.

వన్నెమీరిన హెచ్చగు నెర్రని బంగారమునకు సంధ్యాకాలపు, సూర్యుని శ్రీహరితిరుప్పీతాంబరమునకు సంధ్యారాగమునుసమానముగ ఆచార్యులు అనితిచ్చియున్నారు.

ఆచార్య హృదయవ్యాఖ్యానమునందు— భగవద్విగ్రహముం, ఆదిత్యమణ్డలముమాగిర యిరండైయుం తన్నిరమాంబడి పణ్ణుగిర శివన్ధనిరత్తైయుడయ తాగైయాలె "హిరణ్యవర్ణం" ఇత్యాదిప్పడియే, "కమలమలర్ మేల్ శెయ్యాళ్" ఎన్ను నిరూపకమాంబడి యిరుప్పాళాయ్, అనిసాయించిన దానియందు హిరణ్య వర్ణమనుదానికి పైనచెప్పిన ఎర్రని వర్ణముగలదని చెప్పుటకుఅవిరోధముగ, శ్రీభారతమున చెప్పబడిన, ఇన్ద్రగోపసమాన రక్తహిరణ్యవర్ణముగ గ్రహించవలయునది ఆవశ్యకముగ నున్నది.

ఆసువర్ణము పిరాట్టి తిరుమేనివర్ణమునకు సమానమనిగ్రహించక నిప్పుడు మనకునంగడివీధిలో దొరికెడు అల్పవన్నెగలమట్టబంగారమని గ్రహించునది యుచితముగానేరదు.

హారీతస్మృతియందు— "వామాంకే చింతయేత్తస్య, దేవీం కమలలోచనాం, తరుణీంసుకుమారాంగీం, సర్వలక్షణ శోభితాం, తప్తకాంచన సంకాశాం, పీనోన్నతపయోధరాం" అని శ్రీదేవి తప్తకాంచన కాంతిగలదని చెప్పబడియున్నది.

"లక్ష్మీమ్ క్షీరాబ్ధికన్యాం త్రిభువనజననీమ్, విష్ణువక్షస్థలస్థాం, పద్మాంప ద్మాయతాక్షీంనిఖిలశుభకరాం పద్మినీం పద్మహస్తాం, నానారత్నో త్తమాద్యైః కనకవిరచితైః భూషణైః భూషితాంగీం, దేవీం బాలార్కవర్ణాం సురమునివ రదాం విష్ణుపత్నీం నమామి. అని శ్రీలక్ష్మీసహస్రనామములయందుపిరాట్టిబా లార్కవర్ణముగనుండునట్లు చెప్పబడియున్నది,

—శ్రీసూక్తమునందు చెప్పిన సూర్యవర్ణమును విచారించు నెడల,—

"శెయ్యదోర్ నాయిత్తైకాట్టి శిరీధరన్ మూర్తి ఈ దెన్నుం" "కాలై పొళుదులు ళ్ల బాలసూర్యనై కాట్టి శ్రీయఃపతియినుడైయమూర్తి ఈ దెన్ను" అనిఆళ్వారు లనుసాయించియున్నారు.

కిష్కింధా కాండమునందు ౫౮ వ సర్గమున— "తత్రైకశ్చిన్మయాదృ ష్టస్సూర్యోదయ సమప్రభామ్, స్త్రీయమాదాయ గచ్ఛన్తై విభిన్నాంజనచ య ప్రభః" అని సంపాతికి, అతని కొమారుడు, రావణుడు బాలసూర్యునివలె పకాశించుచున్న యొక స్త్రీనిఎత్తుకొనిపోవుట తాను చూచెననిచెప్పెను.

—శ్రీసూక్తమునందుచెప్పిన చంద్రవర్ణమును విచారించు నెడల—

శ్రీభాగవతము దశమస్కంధమున౨౯వ అధ్యాయమునందు— "తదో డురాజః కకుభః కరైర్ముఖం, ప్రాచ్యావిలింపన్నరుణేన శంతమైః, సచర్ష ణీనాముదగాచ్ఛుచోమృజన్, ప్రియః ప్రియాయా ఇవ దీర్ఘదర్శన దృష్ట్వా కుముద్వంతమ ఖండమండలం, రమాననాభం నవకుంకుమారుణం, వనంచత త్కోమలగోభిరంజితం, జగౌకలం వామదృశాం మనోహరమ్" అను నవకుం కుమారుణ వర్ణమగు పిరాట్టితిరుముఖమండలమువలె నుండెడు శరత్కాలము నందు, సంధ్యాకాలమున ఉదయించిన చన్ద్రమణ్డలమునుచూచి గోపీమారు లకు కణ్ణన్ చేసిన ప్రతిజ్ఞనతనికి జ్ఞాపకమైనదియని చెప్పబడియున్నది.

—శ్రీసూక్తమునందుచెప్పిన అగ్నివర్ణమును విచారించు నెడల—

తేజస్సుకు వర్ణము "భాస్వర శుక్లమని" తార్కికులుచెప్పుచుండపూ ర్వాచార్యులు(తేజస్సుకునిరంశేవప్ప)తేజస్సుకువర్ణము, మెరుపనియు, తేజః పదార్థములందు వర్ణభేదము పదార్థాంతర సంసర్గజమనియు తేజస్సుభౌమాది భేదముచే బహువిధములనియు, అనగా భౌమం దివ్యం ఔదర్యం ఆకరజ

అనుభేదము చేయునియు, ఆకరజం సువర్ణాదిఅనియు, తత్త్వత్రయవ్యాఖ్యానము నందు సాధించియున్నారు. అందు నానావర్ణములుగలపృథివీ భాగముచేరి నానావర్ణములుగనుండు కెంపులకైనను, అగ్నియొక్క రక్తవర్ణమును కలిగినటై ప్రకాశించెడు ఎఱ్ఱని వర్ణముగల కెంపు యెట్లు శ్రేష్ఠమై యున్నదో అట్లునానావర్ణములుగల పృథివీభాగముచేరి యుండుటచే నానావర్ణములై తోచెడుతెలిమిబంగారము, తెల్లని బంగారమునకంటె అగ్నివలె నెఱ్ఱనికాంతిగల యెఱ్ఱని బంగారమే శ్రేష్ఠమైన బంగారముగనున్నది. గనుక పిరాట్టి తిరుమేనిసంధ్యాకాలపు సూర్యునివలె యుండెడువెయ్యిన్ని యెనిమిదివన్నెకుపైబడ్డవన్నె మీరిన ఇన్ద్రగోపసమానమగు శ్లాఘ్యమైన యెఱ్ఱనిబంగారమువలెను, కెందామరపుష్పమువలెను, శరత్కాలబాలసూర్యబాలచన్ద్రులవలెను నుండు తిరుమేనికాంతిగలదని యును, కుంకుమపువ్వువలె మిక్కిలి ఎఱ్ఱగానుండెడు కాంతిగలదనియును, స్పష్టమైయున్నది

శిల్పశాస్త్రమున— "అభయవరదహస్తే అబ్జయుగ్మందధానే సరస కమలనాసె రత్నతాటంకభూషే అరుణసదృశవర్ణెఅచ్యుతప్రాణనాథే, సకలవిబుధవంద్యే శ్రీసిద్ధలక్ష్మీనమస్తే" అనుప్రకారము శ్రీమహాలక్ష్మియొక్క తిరుమేనివర్ణము అరుణవర్ణమనిచెప్పబడియున్నది—

భగవచ్ఛాస్త్రమున మంత్రవర్ణములనుచెప్పునపుడు — "శ్రీభూనీళాదిమంత్రాంశ్చక్రమాద్వక్ష్యేచతుర్ముఖ" అని ఆరంభించి "రక్తోవర్ణ ఇతిఖ్యాతో లక్ష్మీమంత్రశ్చసర్వదా" అని పెరియ పిరాట్టియార్ మంత్రమునకురక్తవర్ణమునుచెప్పబడియున్నది.

ఇందువ్రాయబడియుండు ఆళ్వారాచార్యులశ్రీసూక్తులనంగీకరించరేని, దర్శన బాహ్యులుగా వలసివచ్చునుగావునను, అంగీకరించియపార్థములనుచేసి రేని దర్శనకుదృష్టులు గావలసివచ్చును గావునను, కేవల తర్కమూలము, వేదప్రతి పాద్యార్థమునకు బాధకముగాదు గనుకను శ్రుతిసిద్ధార్థమునందు లౌకికప్రమాణ సిద్ధార్థసామ్యముప్రసంగించదుగనుకను, ఎప్పుడును వన్నెమీరినశ్రేష్ఠమగు ఎఱ్ఱని బంగారమును నాణ్యములుగజేసి చలామణిచేసెడు వాడుకలేమగనుకను వన్నెగల మట్టబంగారమునుచూచి, బంగారపు వర్ణముఫలానిదని గ్రాదులయందు వ్రాసియుండుటయేగాక వేరుకాదు— రక్తముచెడకుం

డువారినిచూచి యెఱ్ఱగా నున్నారని చెప్పుటచేతను, కామాలి మొదలగువ్యాధులచే రక్తము చెడి యుండువారిని, విశ్లేషవ్యసనముచేతను, విరహవ్యసనముచేతను దేహము తెల్లబారియుండువారినిచూచియట్లుచెప్పనందున, పిత్తనీరుకవిసి పసిమిగాతోచెడు స్త్రీల దేహవర్ణమునుపిరాట్టితిరుమేనివర్ణమని చెప్పుటయుచితముగాదు.

గుణమునుబట్టి సాత్వికరాజస తామసవస్తువులను నిరూపించకనల్లవర్ణముగల వస్తువులను తామసమని పరిత్యజింప తలచిరేని సాల గ్రామము కస్తూరి నేరేడుపండ్లు మొదలగునవియును యెఱ్ఱవర్ణముగలవస్తువులు రాజసమని వర్జింపతలచిరేని కౌస్తుభము కాషాయము కుంకుమ పువ్వు కెందామర చెంగలువ మొదలగునవి త్యజించవలసివచ్చును. మరియు శ్వేతవర్ణముగలవస్తువులు సాత్వికమంటిమేని సముద్రపు నురుగు కాకిగుడ్లు మొదలగునవి పరిగ్రహించవలసివచ్చును.

వర్ణములు సప్త పంచ చతుస్సంఖ్యలచే ననేక పక్షములుగానుండ—శ్రుతి అజామేకాం "లోహిత శుక్లకృష్ణాం బహ్వీప్రజాంజనయంతి" అనియు "యదగ్నేరోహితగ్ం రూపం తేజస్తద్రూపం యచ్ఛుక్లం తదపాం యత్కృష్ణం తదన్నస్య" అని చెప్పెడు శ్రుతిననుసరించి పీతవర్ణమును రక్తవర్ణపు అవాంతర భేదముగ గొని మూడువర్ణములుగా సంగ్రహించియున్నారు. బంగారము ఎఱుపు పసుపు తెలుపు వర్ణములు గలిగి యుండునట్లు ఆరుమాసములు పైరుచేసిన ముదిరిన పసుపు రక్తవర్ణముగను ముదరనిది పసిమిగను తెల్లగనునున్నది.

చూర్ణాభిషేకార్థముగ చేయుమని చెప్పిన ప్రకారము జేసి, పారమేశ్వరసంహితయందు—"విష్ణుదేహపరామృష్టం యచ్చూర్ణం శిరసావహేత్, సోశ్వమేధఫలం ప్రాప్య విష్ణులోకే మహీయతే" అని విష్ణుదేహమునందు సమర్పించి శిరసావహించినటులయితె అశ్వమేధఫలమునుపొంది విష్ణులోకమునందు వసించుతునని చెప్పబడియున్నది.

ఇకను ఊర్ధ్వపుండ్ర మధ్యధరించుమని చెప్పిన విష్ణ్వర్పిత రక్తవర్ణ హరిద్రా చూర్ణము చేయుక్రమము, అవిధరించుకొనుక్రమము నిందువివరింపబడును.

* నారద సంహితయందు — ఉత్తరాయణమున శుక్లపక్ష శుభదినమునందు, పూర్వాహ్ణమున స్నానముచేసి కర్తవ్యములను తీర్చుకొని తానుపైరుచేసెడు స్థళమునకు పోయి చతురశ్రముగా దున్ని అయిదువిధములగు ఆకులతో గోమయమున్ను ఉంచి మూడుమారులు భూమిని సమముచేసియందు శ్రీబీజముచే నభిమంత్రించిన హరిద్రాబీజములను విత్తిఆరుమాసములు పైరుచేసి, ముదిరినవెనుక ఆపసుపును మంచి శుభదినమునందు త్రోవ్వియెత్తిశుచియగుస్థానమునందునిచి జలముచే శోధించి వాటిని తుండించి వారమురోజులునీడలో ఆరపోసి చెమ్మలేకుండునట్లు చక్కగా నెండినపిదప వాటిని ముమ్మారు మర్దించి అయిదుమారులు వస్త్రకాయముపట్టి, అందు శ్రీకృష్ణతులసిచూర్ణము పచ్చకర్పూరము కుంకుమపువ్వ కలిపి శ్రీబీజాదులచే నభిమంత్రించి పురుషోత్తమునివిధిప్రకార మారాధించి పుష్పధూప దీప నైవేద్యములు చేసితదనంతరము స్తోత్రగీతప్రదక్షిణములుచేసి, శ్రీచూర్ణమును ఆరాధించి విధిప్రకారము అభిషేకము చేసి వాటిని బిల్వకరండమునందు నిచి ధరించవలయుననియు. నారికేళముమొ

---

* మహారత్నకోశే బ్రహ్మనారదసంవాదే - నారదః.

భగవన్ దేవదేవేశ సర్వదేవనమస్కృత । శ్రీచూర్ణధారణవిధిమ్వదత్వమ్మమతత్వతః "బ్రహ్మ" శ్రుణునారదతత్వేనని శాచూర్ణస్యధారణం। యథోక్తంవిష్ణునాపూర్వం మమసర్వార్థదంశుభం । ఉత్తరాయణగేసూర్యే శుక్లపక్షే శుభేహని । పూర్వాహ్ణే ప్రయతస్నాత్వా । స్వయంగత్వాతత్సునిష్కుటం । ఖాత్వా దండప్రమాణంతుచతురస్రం మహీతలం । గోమయంతత్రనిక్షిప్య పంచపల్లవ సంయుతం । కృత్వాలవాల త్రితయమేకంవాపియథాబలం । నివపేత్తత్రబీజానిహారిద్రాయాణ్యుచీనివై । శ్రీబీజేనాభిమంత్ర్యాథ తానిబీజానితద్ద్విజః । గాయత్ర్యావిష్ణుగాయత్ర్యాశ్రీగాయత్ర్యా భిషేచయేత్ । సముత్పన్నేష్వంకురేషు పరక్షంవర్ధయేత్నతః । షాణ్మాసంపంచమాసంవా వర్ధయిత్వాప్రయత్నతః తతఃశుభది నేప్రాప్తేస్నాత్వా ప్రయతమానసః । ఆలవాలస్య బీజానిఖాత్వా దాయశుచిస్థలే । నిధాయతత్ర సర్వాణితతః ప్రక్షాళ్యవాగ్యతః । ఖండంఖండంతతః కృత్వాఖడ్గేన శుచినాద్విజః । తానిబీజాని సర్వాణిఛాయాశోషేణ శోషయేత్ । సప్తాహం వాథపంచాహంశోష యేదాతపంవినా । ఏవమ్సమ్యా

దలగు కరండములయందునిచిన చూర్ణము క్రిమికీటాదులతో సమమనియు,వాని ధరించిరేని పాపమనియుచెప్పియుండుటచే, బిల్వకరండములోనెయుంచి, ధరించుకొనవలయుననునది స్పష్టమైనందున, బాలసూర్యునివలెను పిరాట్టితిరుమేనివర్ణమువలెనుండుటకుతగినట్లు, ప్రథమమునచేసి యుంచినహారిద్రాచూర్ణమున కుంకుమపువ్వు పచ్చకర్పూరము శ్రీకృష్ణతులసి చూర్ణము, నీమూటియందెద్ది నధికముగ నెద్దితకుగవగను చేర్చవలయునో అట్లుచేర్చవలయునేగాని, నధికముగగాని సమముగగా నిచేర్చకూడదని స్పష్టమైనది—

"అసంస్కృతాం హారిద్రాంతు ముఖేలింపేన్నరాధమః, తన్ముఖంనైవవీక్షేత, చండాళమివతం త్యజేత్" అను ఖగప్రశ్నసంహితయందు, కేవలహారిద్రాచూర్ణ ధారణముచేసినవాడధముడనియు వానినిచూచెనేని, చండాళుని

---

క్ శోషితానిహారిద్రాయాశుచీనిచ । ఉలూఖలేశుచౌన్యస్యముసలేనచమర్దయేత్ । శతవారం షష్ఠివారం త్రింశద్వారమథాపివా । మర్దయిత్వాతుబీజాని శోధయేద్వ స్త్రశోధనైః । పంచవారంత్రివారంవా కృత్వావస్త్రేణశోధనం । శ్రీకృష్ణతుళసీచూర్ణం కర్పూరంకుంకుమంతథా మిశ్రీకృత్యచచూర్ణేనశ్రీబీజేనాభిమంత్ర్యచ । శ్రీసూక్తేనాభిమంత్ర్యాథ ప్రోక్షయేచ్ఛద్విజోత్తమః । అష్టోత్తరసహస్రం వాశతమష్టోత్తరంతువా । లక్ష్మీపంచాక్షరంజప్త్వా శ్రీబీజేనాభిమంత్ర్యచశ్రీచూర్ణం సంస్పృశేత్తతః । ఏవమ్కృత్వాని శాచూర్ణం । శ్రీపతిం పురుషోత్తమం ఆరాధ్యవిధివద్గంధైః । పుష్పైఃధూపైశ్చతథాద్విజః । నైవేద్యైర్వివిధైశ్చైవస్తోత్రైర్గీతైః ప్రదక్షిణైః । ఆరాధ్యచతతఃమూర్ధ్నాభిషిచ్యయథావిధి । తచ్చూర్ణంబిల్వకారండే నిక్షిపేద్ధారణాయచ । నారికేళకరండేచయచ్చూర్ణంనిక్షిపేద్ద్విజః । తచ్చూర్ణంక్రిమిభిస్తుల్యంధృత్వాపాపమవాప్నుయాత్ । శ్రీబిల్వసకరండేచ శ్రీచూర్ణంనిక్షిపేత్సదా । శ్రీచూర్ణేనిక్షిపేల్లక్ష్మీంతస్మాత్తాం ధారయేద్ద్విజః । ఇత్యాది.

—ఖగప్రశ్నసంహితాయాం—

శుద్ధామ్ హారిద్రామాదాయ శుష్కకీటావివర్జితాం. సువర్ణాంసుదృఢామ్ శుక్లాం రక్తామతి మనోహరాం.

చూచి వోదుగు వారివలె వోదగవలెననియు చెప్పబడినది. గనుక కేవలహారిద్రా చూర్ణ ధారణము భగవదనిష్టకరము. "అసంస్కృతాంతు," అనగా హరిద్ర ను సంస్కరించవలయునను నియమము తోచబడుచున్నది. హరిద్రకు సంస్కారములనగా మూడువిధములు ద్రవ్యసంస్కారమనియు ద్రవ్యాంతరసంస్కారమనియు, మంత్రసంస్కారములనియును; ద్రవ్యసంస్కారమనగా, విధాన ప్రకారము హరిద్రాగ్రహణముచేసి, ఆహరిద్రయందుండగల నూనె తోలు పుచ్చినది క్రిమిమొదలగునవి నివర్తింపించి, ఉష్ణజలము నిమ్మ పండ్లుమొదలగువాట్లచే శుద్ధిచేయుట. ద్రవ్యాంతర సంస్కారమనగా, "షడ్భాగంశాలితండులం" అను మరీచివచనముచేతను "గోధూమ చూర్ణమిశ్రంతు" అను విష్ణుతత్వమునందును "చందనం తులసీబీజం షడ్భాగంశాలితండులం। గోరోచనా సువర్ణంచ కుంకుమాది విమిశ్రితం। శ్రీచూర్ణం చూర్ణయోగేన శుద్ధంధార్యంద్విజోత్తమైః, అనియు, చందనము తులసివిత్తులుసంబాబియ్యముగోరోచనముసువర్ణము కుంకుమపువ్వు మొదలగునవి చేర్చి సుగంధము వర్ణము గలుగునట్లు చేయబడిన శ్రీచూర్ణమును పిరాట్టిపెరుమాళ్లకు సమర్పించి ధరించవలయు. ఇందు చెప్పబడిన ద్రవ్యాంతరములు "హారిద్రం కుంకుమంవాపి చూర్ణంవిష్ణ్వభిషేచితం, ఊర్ధ్వపుండ్రస్యమధ్యేతుధారయేద్దీపవద్ద్విజః" అనువసిష్ఠవచనమునందు ముందుచెప్పబడినప్రకారము సంస్కారముచేయబడి విష్ణ్వభిషేచితమైన హరిద్రాచూర్ణమునైనా లేక కుంకుమపువ్వు చూర్ణమునైనా ఊర్ధ్వపుండ్రము మధ్య దీపాకృతిగా ధరించవలయు.

—ఖగేశ్వర సంహితాయాం—

శ్లో॥ ద్రవ్యాంతరవిహీనాంతు రజనీం,ధారయేద్ద్విజః। తావద్భవతి
చండాళః యావన్నస్నాతి దుర్మతిః॥

తా॥ అన్యద్రవ్యములచేసంస్కారముచేయక కేవల పసుపుమాత్రము నెంతకాలము ధరించుకొనునో అంతపర్యంతమువాడు చండాలుడనియు, అదిచేరిపిన వెనుక స్నానముచేయడేని వాడు అపరిశుద్ధుడనియువిధించ బడియున్నదనియును.

—అత్రిః—

శ్లో॥ ఊర్ధ్వపుండ్రస్య మధ్యేతు రజనీచూర్ణముత్తమం। లక్ష్మీరూపంధరేన్నిత్యం అన్యద్రవ్యం ననిక్షిపేత్.

తా॥ ఊర్ధ్వపుండ్ర మధ్యను ఉత్తమమైన రజనీచూర్ణముచే లక్ష్మీరూపము ను సదా ధరించుకొనవలెననియు లక్ష్మీరూపమునకు విరుద్ధమగు అన్యద్రవ్యము లను ధరించకూడదనియును.

—పారమేశ్వర సంహితాయాం—

శ్లో॥ శిఖోపవీతవద్ధార్య మూర్ధ్వపుండ్రం ద్విజన్మనా । సాంతరాళో
ర్ధ్వపుండ్రస్య మధ్యే శ్రీశ్రేష్ఠధామని । హరిద్రా సారసంభూత రజ
సాధారయేచ్ఛ్రియం.

తా॥ ఊర్ధ్వపుండ్రము నడుమ హరిద్రాసార సంభూత రజస్సులచేపిరా ట్టిని ధరించవలయుననియును.

— భారద్వాజ సంహితాయాం. —

శ్లో॥ హరిద్రేణతు చూర్ణేన కుంకుమేనసుగంధినా । ఊర్ధ్వపుండ్రస్యమధ్యే
తు లక్ష్మీస్థానం ప్రకల్పయేత్॥

తా॥ సుగంధమగుకుంకుమపువ్వుతోచేరిన హరిద్రాచూర్ణముచే ఊర్ధ్వపుం డ్రము మధ్య శ్రీమహాలక్ష్మిని ప్రతిష్ఠించవలెననియును.

— ప రా శ ర స ం హి తా యాం. —

శ్లో॥ విష్ణ్వర్పితంర క్త వర్ణం హరిద్రాచూర్ణ ముత్తమం । లక్ష్మీనివాససిద్ధ్య
ర్థందీపాకారం తుసూక్ష్మకం! ఊర్ధ్వపుండ్రస్యమధ్యేతు లలాటేధా
రయేద్ద్విజః.

తా॥ విష్ణ్వర్పితమగు రక్తవర్ణ హరిద్రాచూర్ణము ఉత్తమమనియుఆ చూర్ణమును లక్ష్మినివాస సిద్ధ్యర్థము ఊర్ధ్వపుండ్ర మధ్య దీపాకృతిగధరించుకొన వలయుననియు చెప్పఁబడి యున్నదనియును.

పశ్వధికరణన్యాయమునందు సామాన్యమైన పశుశబ్దమును ఛాగపశువి శేషమునందు పర్యవసానముచేసెడు ప్రకారము పారమేశ్వరసంహిత మొదల గు వానియందుసామాన్యముగ చెప్పియుండెడు హరిద్రాచూర్ణము పరాశరసం హితయందు చెప్పిన రక్తవర్ణ హరిద్రాచూర్ణమున పర్య వసానము చేయడమే యుక్తము.

పైశ్లోకమున హరిద్రాచూర్ణ శబ్దము విశేష్యము, తక్కినపదములన్నియు విశేషణములు. రక్తవర్ణం అనునవి హరిద్రాఅనుదానికి విశేషణమా? చూర్ణ

అనుదానికివిశేషణమా! అనునాక్షేపమందు, హారిద్రాచూర్ణం అనుదానికివిశే షణము అగుచున్నది అని సిద్ధాంతము; ఇందుకుప్రమాణము—షష్ఠీ—ఇదిపా ణినిసూత్రము దీనికి అర్థము షష్ఠ్యంతముసుబంతముతో సమరసించుచున్నది, హారి ద్రాయాఃచూర్ణః హారిద్రాచూర్ణః -తమ్- హారిద్రాచూర్ణం—హారిద్రాయాః అను షష్ఠ్యంతముయొక్క అర్థము చూర్ణశబ్దార్థముతో నన్వయించుచున్నది గా వునరక్తవర్ణశబ్దార్థముహారిద్రాచూర్ణశబ్దార్థముతోనన్వయించునుగానితదేకదే శీయైన హారిద్రాశబ్దార్థముతో నన్వయింపదు.

— ని గ మ న ము. —

అద్వారక సద్వారకములచే భగవంతుడు ప్రవర్తింపచేసిన శ్రుతి భగ వచ్ఛాస్త్రస్మృతీతిహాస పురాణవచనములకు సకల శాఖాప్రత్యయన్యాయసక లవేదాంతప్రత్యయన్యాయ ప్రకారముగ ఐకకంఠ్యముచేసి అర్థనిశ్చయముచే యుటయే యుచితము.

కాత్యాయన నారదోపనిషత్తులయందు— శ్రీచూర్ణరేఖ శ్రీవర్ణముగ నుండవలయునని చెప్పియుండుటచేతను.

శ్రీగుణరత్నకోశ వ్యాఖ్యానమున— పిరాట్టి పద్మసమవిగ్రహముగలద ని చెప్పియుండుటచేతను.

తిరువాయ్ మొళియందు—ఆపద్మము "తామరైకళ్ అనవై శెఙ్దీపో లెమలరానిఱుం" అని ఎర్రని అగ్నివలెనున్నదని చెప్పియుండుటచేతను.

శ్రీరామాయణము కిష్కింధాకాండమున నలుబదిరెండవ సర్గమునందు— సూర్యభగవానులు మేరువునుచూచి నిన్ను ఆశ్రయించిన సర్వములకును, నీవద్ద వచ్చివసించెడు దేవగంధర్వ దానవులకును నీరక్తకాంచన ప్రభకలుగు గాక యని అనుగ్రహముచేసినందుచేతను.

మరియు సుందరకాండ ప్రథమసర్గమునందు— తిరువడి లంకకు వేంచే యునపుడు, వారువిశ్రమించి పోవుటకై ఆదిత్యోదయకాంతిగలతప్తజాంబూ నదశృంగములుగలమైనాకపర్వతముపైకిలేచినపుడు నల్లనిఆకాశము ఆతప్తజాం బూనదప్రభగలిగినదై ప్రకాశించినదని చెప్పబడినందుచేతను.

శ్రీమహాభారతమున భీష్మపర్వమునందు భూమధ్యము నందున్న కనక

పర్వతమగు మేరువు బాలసూర్యునివలె ప్రకాశించుచున్నదని చెప్పుటచేతను.

మరియు కుంకుమాంకితవర్ణముగల పెరియతిరువడి మేరువుయందురక్త కాంచనప్రభగల కాకము మొదలగువానినిచూచి పక్షిజాతులకన్నిటికి నాకవిశేషము లేక నేసమానముగ మేరువుచేసియుండుటచే నచ్చట నుండకూడదని పెరియతిరువడి కోపగించిపోయినందుచేతను.

మరియు సప్తమాధ్యాయమునందు—వేయిన్నొనిమిదివన్నెలుగలమేరు సువర్ణమునకైనను వన్నెమిగులనట్టి దేవతలు దేవతాస్త్రీలు ఆభరణములుగాజేసి ధరించెడు జాంబూనదస్వర్ణము, ఇన్ద్రగోప సమానమైయున్నదని చెప్పియుండుటచేతను.

శ్రీభాగవతము పంచమస్కంధము, షోడశాధ్యాయమునందు—భూనాభియందు స్వర్ణమయమైన పర్వతరాజగు మేరువుండునట్లును, అచటకలిగెడు జాంబూనదస్వర్ణముచే దేవతలు దేవతాస్త్రీలు మకుటకటకటి సూత్రాద్యాభరణములుచేసి ధరించెదరని చెప్పియుండుటచేతను.

ముడిచ్చోదియను తిరువాయ్ మొழியందును, జీయర్ అరుంపదమునందును—పిరాట్టిశేత్తిచే మయూరగ్రీవమువలె నెట్టిగానున్నదని చెప్పియుండుటచేతను.

మరియు "శోదియాగి" అను తిరువాయ్మొழிపాశురమున—శ్రీమహారమైన తిరుమేనిని నిరవధికతేజోరూపమైన కాంతిముసుకువేసినట్లున్నదని చెప్పియుండుటచేతను,

తిరువిరుత్తము వెనబది అయిదవపాశురమున, వేయిన్నొనిమిదివన్నెకునధికమగు శ్లాఘ్యమైన నెట్టనిబంగారమునకు సన్ధ్యాకాలమునందుండుసూర్యుని ఉపమానముగ సాయించినందుచేతను.

తగినజ్ఞానచక్షుస్సులచేచూచి అనుభవించిన మయర్వరమదినలమరుళప్పెత్తఆழ்வారులు"కమలమలర్ మేల్ శెయ్యాళ్", "పూమేయ శెమ్మాదు", "శెయ్యావళ్" అని సాయించినందుచేతను.

అమలనాథపిరాన్ వ్యాఖ్యానమున—ఎంబెరుమాన్ యొక్క తిరుప్పీతాంబరము సన్ధ్యారాగమువలె నెర్రగానున్నదని సాయించినందుచేతను.

ఆచార్యహృదయ వ్యాఖ్యానమునందు—భగవద్విగ్రహముసుఆదిత్యవ

ణ్డలమునుతనవర్ణముగనుండునటుల చేసెను ఎర్రనివర్ణముగలదని చెప్పుటచేతను.

హారీతస్మృతియందు —శ్రీదేవి తప్తకాంచన కాంతిగలదని చెప్పుట చేతను.

శ్రీలక్ష్మీ సహస్రనామములయందు—పిరాట్టితిరుమేని బాలార్కవర్ణము నిచెప్పుటచేతను.

తిరువాయ్ మొళియందు—ప్రాతః కాలమున ఉదయించెడు బాలసూర్యుని చూపి శ్రియఃపతియని ఆళ్వారులు సాయించియుండుటచేతను.

కిష్కింధాకాండమున—సంపాతికి నతని కుమారుడు రావణుడు బాలసూర్యునివలె ప్రకాశించెడు యొకస్త్రీని ఎత్తుకొనిపోవునపుడు, తానుచూచెన నిచెప్పుటచేతను.

శ్రీభాగవత దశమస్కంధమున— నవకుంకుమారుణ వర్ణమగు పిరాట్టితిరుముఖమండలమును శరత్కాల సన్ధ్యాకాలమునందు దయించినచన్ద్రమ ణ్డలమునకు ఉపమానముగ సాయించినందుచేతను.

శిల్పశాస్త్రమున—శ్రీమహాలక్ష్మి తిరుమేనివర్ణము అరుణవర్ణమని చెప్పుటచేతను.

భగవచ్ఛాస్త్రమునందు—పెరియపిరాట్టియార్ మన్త్రమునకు రక్తవర్ణమును చెప్పియుండుటచేతను.

శ్రీనంబిళ్ల పెరియవాచ్చాంబిళ్ల మొదలగు పూర్వాచార్యులు, భగవద్విషయములందు—కెందామరపువ్వునపరిమళమే తిరుమేనిగా పరిగ్రహించినదానివలెనున్నదని సాయించి యున్నందుచేతను.

శ్రీచూర్ణమునజేర్పదగిన పరిమళద్రవ్యములయందు మనోహరమైనరక్త వర్ణముగల పసుపును ఉపయోగపరచవలయునని చెప్పియుండుటచేతను.

పసుపుయొక్క స్వాభావికరక్తవర్ణము రోటిలోనుంచి మర్దించునపుడుకలుగగల ఉష్ణాదులచే చెడునది యేగాక వేరుకారణము లేనందుచేతను.

పసవుయొక్క స్వాభావికరక్తవర్ణము వేరొకటిచే చెడకుండునటుల మొదట సంస్కారము చేయవలసినది ఆవశ్యకమైనందుచేతను.

నిమ్మపండ్లు వెలిగారము మొదలగునవిశాస్త్రములలో నిషేధముకానందు చేతను.

నిమ్మపండ్లను జిడ్డు మొదలగునవి పోవుటకు తిరుమంజనమున ఉపయో
గపరచుటచేతను.

వెలిగారము మొదలగువానిని బంగారముయొక్క మలినము పోగొట్టివర్ణ
ముకలుగుటకు చేర్చుటచేతను.

ఆప్రకారమే పసపుయందుండుజిడ్డును పోగొట్టిదానిస్వాభావికరక్తవ
ర్ణముచెడకుండునటుల చేయుట ఉచితమైనందుచేతను.

పరాశరస్మృతియందు — పిరాట్టితిరుమేనివర్ణమునకు తగినట్టుఉండుట్లు
చే రక్తవర్ణ హరిద్రాచూర్ణము ఉత్తమమని చెప్పియుండుటచేతను.

పెరియాళ్వార్ తిరుమొళి మూడవపది, నాలుగవతిరువాయ్మొళి, ఆ
రవపాశురమగు — "శిన్దురమిలంగత్తన్ తిరునెత్తిమేల్" అనుపాశురమునకు
వ్యాఖ్యానమునందు "అళగియ ఉడయతన్ తిరునెత్తిక్కుమేలె అదుక్కుపరభా
గమాంబడి శాత్తిన" అని సిన్దూరచూర్ణమైనది ప్రకాశించుచున్నదని సాయించి
నప్రకారము, కణ్ణన్ తిరుముఖమండలమునందు తక్కిననానావర్ణచూర్ణములను
నుంచక సిందూరచూర్ణమును ధరించుకొనుటచేతను.

నాచ్చియార్ తిరుమొళియందు — "సిందురచ్చెంబొడిప్పోల్ తిరుమా
లిరుంశోలై యెంగుం, ఇందిరగోపంగళేయెళుందుం పరందిట్టనవాల్" అని ఇన్ద్ర
గోపమునకు సిందూరపుపొడిని ఉపమానముగచెప్పిటయుండుటచేతను.

కోవిలతిరుక్కణ్ణమంగై మొదలగు, అనేకదివ్యదేశములయందు తిరుమ
ణిస్థానమున రవలును, శ్రీచూర్ణస్థానమునందు కెంపులును చెక్కిసమర్పించి
యుండుటచేతను.

"శొల్లార్ తమిళొరుమూన్రుం శురుతిగళ్ నాన్గుంఎల్లై యిల్లా అరనెరి
యావుం తెరిందవర్" అనేప్రకారముసర్వజ్ఞులై, సకలకలికల్మషాంధకారవిచ్ఛే
దకులై గురుపదమూర్ధాభిషిక్తులై సర్వోత్తారకులై వేంచేశియుండెడు శ్రీ ఉడ
యవరులుధరించుకొనియుండుటచేతను.

శ్రీమాన్ మధురమంగలం ఎంబార్ జీయర్ స్వామిసాయించిన, శ్రీఉ
డయవర్ వడివళకిల్ అడియార్గళీడుపాడు — "శారదాభ్రమ్యోషధీశనుభ్రా
య అతినిర్మల మణ్డలాంతరాళ త్రైలూత్తుమారామల్ శురన్దు పెరుగివరుగిన్ఱ ఇర
ణ్డమృతధారైగళ్ తదుపాంతవినిర్మిత దివ్యాలవాలకుల్యాకూల బంధవిశేషం

గళాలే పరస్పరమెదిర్ కొండు మఱియుఙ్గు కూడికుఱుగి గంభీరమాయ్ వర్త్తిస్సిఱ్ఱుళ్ల వళర్న్దుపడర్న్దదోర్ కర్ప్పగ క్కొఱుడియినడియిలేఱివాయ్ న్దు నిఱ్ఱిండు తేజ్జి నిన్నాప్పోల్ తిరునెత్తియిన్ నడువిల్ వడువిట్టుప్పడిన్దుకొణ్డు అవిచ్ఛిన్నరేఖమునూయ్ భ్రూపక్ష్మయుగళాంతరాళస్థిత కోణద్వయశోభితమూయ్ విచ్ఛిన్నమూలముమాయ్ కోలనీళ్ కొడిమూక్కినడిన్నై విళఙ్గుకొణ్డై కొణ్డువిళఙ్గుగిన్ఱ రామానుజాఖ్య దివ్యపీఠసంయుతమాన దివ్యోర్ధ్వపుండ్రవిశేషముమ్;—

అది నిన్దైయిల్ అమృతోద్భవై యానసకలవిభూతి పట్టాభిషేకసామ్రాజ్యలక్ష్మియినుడై యస్వేచ్ఛావిహారవిక్షిప్త పదకమల లాక్షారసధారారేఖైపోల్ చ్చివన్దు పడిన్దు విళఙ్గుగిన్ఱ రక్తవర్ణశ్రీచూర్ణరేఖైయుమ్; అనిసాయించియుండుటచేతను.

ప్రస్తుతము రాజస తామసములుగా తిరిగియుండెడు ప్రదేశములకంటె విలక్షణమైసాత్వికముగ తిరగబడియుండెడు "మయర్వరమదినలమరుళిపెత్త" ఆళ్వారాచార్యులుతిరువవతరించినవై, దక్షిణప్రదేశమునప్రపన్నజనకూటస్థులైన ఆళ్వారులు వేంచేశియుండు తిరునగరిమొదలువారిపూర్ణప్రపత్తికి విషయమగు తిరువేంగడముడైయాన్ వేంచేశియుండెడు తిరుమల పర్యంతమునివసించెడు శిష్టులందరు రక్తవర్ణ హరిద్రాచూర్ణమును తమ తిరువారాధన పెరుమాళ్లకు సమర్పించి ధరించుకొనుచువచ్చుచున్నారు. ఈశిష్టాచారప్రకారమును అనుష్ఠించుట అందరికిని సాధ్యమైనందుచేతను.

శ్రీవచన భూషణదివ్యశాస్త్రమునందు పిళ్లలోకాచార్యులు "భక్తియిల్ అశక్తనుకుఱు ప్రపత్తి ప్రపత్తియిల్ అశక్తనుకుఱు ఇదు" అని సాయించినప్రకారము వారివారి శక్త్యనుగుణముగచేయునట్లు మన్వాదిస్మృతులయందు విధించిన కష్టసాధ్యమైన ప్రాయశ్చిత్తాదులనువిడచి "కృతేతు మానవాధర్మాస్త్రేతాయాం గౌతమాఃస్మృతాః ద్వాపరేశంఖలిఖితాఃకలౌపారాశరాఃస్మృతాః" అనుప్రకారము పరాశరస్మృతియందు విధించినసులభపద్ధతులనుచేయునట్లు నారదాదిసంహితలయందుచెప్పబడినప్రకారము చేసిధరించుట అందరికి సాధ్యముకానేరదు, గాన "విష్ణ్వర్పితం రక్తవర్ణం హరిద్రా చూర్ణము

త్తమం" అని పరాశరసంహితయందు సాయించినప్రకారము పిరాట్టి తిరుమే
కాంతికి సదృశమగు రక్తవర్ణహరిద్రాచూర్ణమును "క్రమేణవాహారేత్సర్వం"
అను శాండిల్యవచన ప్రకారము తీసుకొనివచ్చి" ఉడయవర్ యదుగిరియి
ల్ కళ్యాణసరస్సిన్ మేల్ వటశోత్తైమూలై యిలే తక్ త్రిదండత్తాలె కీ
అపాలాత్తైక్షిపో లెపాంకిక్కు-శంవ్రుకిఱతిరుమణ్ కూవై కల్లైకందు ఆనందాతిశయ
త్తాల త్తిరుమణ్ కొండు తమ్ముడయతిరువారాధనమాన పేరరుళాళ రుక్కు-
చాత్తి తాముంపన్ని రెండు తిరునామం శాత్తికొండార్ అని గురుపరంపరయం
దు సాయించియున్నందున.

ఆప్రకారమే అందరు తమతమ తిరువారాధన పెరుమాళ్లకు సమర్పిం
చిధరించుకొనునదే అందరికి సాధ్యముగ నుండును. యజుర్వేదారణమునందు
"సహోవాచవ్యాసః పారాశర్యః" అని సత్యవాక్య సంపన్నులగు శ్రీవేద
వ్యాసభగవానులకు అతిశయమును "పారాశర్యః" అని తమసంబధమునుబట్టి
చెప్పతగిన ప్రభావాతిశయముగలవారై శ్రీవిష్ణుపురాణమునందు "పురాణసంహి
తా కర్తాభవాక్ వత్సభవిష్యతి, దేవతాపారమార్థ్యంచ యథావద్వేత్స్యతే
భవాక్" అని ఇత్యాదులచేబ్రహ్మపుత్రులగు పులస్త్య భగవానులయొక్క అను
గ్రహముచె, దేవతా పారమార్థ్యాదులను యథావస్థితముగ ఎగిరినవారై
"తత్వేనయశ్చిదచిదీశ్వరతత్స్వభావభోగాపవర్గతదుపాయగతీరుదారః। సన్ద
ర్శయన్నిరమమీతి పురాణరత్నం తస్మైనమోమునివరాయపరాశరాయ" అ
ని శ్రీయాళవందారులు కొనియాడదగిన చిదచిదీశ్వరతత్స్వభావభోగాపవర్గ
తదుపాయగతులును యథా వస్థితముగ ఎరిగిన జ్ఞానసంపన్నులునగు శ్రీపరాశ
రులు "సారేఖాశ్రీవర్ణా" అని శ్రుతియందుశ్రీచూర్ణముశ్రీవర్ణముగానుండవలయు
నని సాయించియుండడమునుఅనుసరించి శ్రీపరాశరసంహితయందు "విష్ణ్వ
ర్పితం రక్తవర్ణం హారిద్రాచూర్ణముత్తమమ్" అని సాయించినందున అందుకువి
రోధములుగ యే వచనములు వుండినప్పటికిని విరోధాధికరణన్యాయముచేబా
ధితములగుటచేత అప్రమాణములుగా గ్రహించతగ్గది—ఇట్లుశాస్త్ర శిష్టశర
ణ్యాభిమతములగు రక్తవర్ణహరిద్రాచూర్ణమును ద్వేషించిదూషించడము,పూ
ర్వాచార్యుల వచనానుష్ఠానములను ద్వేషించుచు దూషించుచు తిరుగువారల
కు ఆశ్చర్యముగానేరదు.

# తప్తచక్రాంకనప్రకరణము.



మోక్షాపేక్షగల పరమసత్వనిష్ఠులకు "జ్ఞానాన్మోక్షమజ్ఞానాత్సంసారమ్" అని చెప్పెడు మోక్షమనుష్ఠాన పర్యంతమైన అర్థపంచకజ్ఞానముచే లభించునదిగాన, తదభావమునందు పునర్జన్మమరణరూపసంసారదుఃఖమే ప్రాపించునదిగాక, ఉజ్జీవించ హేతువు లేనందున "తద్విజ్ఞానార్థం సగురుమేవాభిగచ్ఛేత్, సమిత్పాణి శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం। తస్మైసవిద్వానుపపన్నాయ। సమ్యక్ప్రశాంతచిత్తాయ। శమాన్వితాయ। యేనాక్షరంపురుషంవేద। సత్యంప్రోవాచ। తాంతత్త్వతో బ్రహ్మవిద్యాం" అని శ్రుతియందు చెప్పెడు ప్రకారము ఆముముక్షుచేతనుడు తద్విజ్ఞానార్థము, శుశ్రూషాపరుడై వేదవేదాంతసారార్థవిత్తముడగు ఆ పరమాత్మవైరాగ్యపూర్వకముగా పరబ్రహ్మానుభవైకనిష్ఠుడైయుండెడు సదాచార్యుని ఆశ్రయించవలయు.

శుక్లయజుర్వేదే శతపథబ్రాహ్మణే—తప్తంచక్రం ద్విభుజేధార్యమితూర్ధ్వపుండ్రమాలిఖేత్తస్మాద్వైరేఖాంభవతి, బ్రహ్మణస్సాయుజ్యగ్ంసలోకతాంజయతి యఏవంవేద॥ సామ్ని॥ మైత్రాయణీయశాఖాయాం—పవిత్రమిత్యగ్నిః। అగ్నిర్వైసహస్రారః। సహస్రారోనేమిః॥ నేమినాతప్తతనూః। బ్రహ్మణస్సాయుజ్యగ్ంసలోకతామాప్నోతి. యజుషికఠశాఖాయాం—ధృతోర్ధ్వపుండ్రః కృతచక్రధారీ। విష్ణుం పరంధ్యాయతి యోమహాత్మా। స్వరేణమంత్రేణసదాహృదిస్థితం। పరాత్పరం యన్మహతోమహాంతం॥ ఋగ్వేదే—ఖిలే। చక్రంబిభర్తివపుషాభితప్తంబలం దేవానామమితస్య విష్ణోస్సపతి నాకందురితాని విధూయ। ప్రియం యద్యతయోపితరాగాః. శ్రీపాంచరాత్రే, విహగేంద్రసంహితాయాం—శ్రుతిస్మృతిస్వరూపేణజగతాముపకారకం। సర్వకర్మాధికారశ్చ శుచీనామేవచోదితః। శుచిత్వం నియతం తస్య యోబిభర్త్యాయుధానిమే। అశ్వమేధ సహస్రస్య వాజపేయ శతస్యచ। యత్ఫలం శ్రూయతే తత్స్యాన్మదీయాయుధధారణాత్। ఉపాసీత గురోర్వ్యగ్రంవిష్ణోర్దాస్యమభీప్సతః। విహితాఃపంచసంస్కారాః। యుక్తస్యానన్యచేతసః। తాపఃపుండ్రస్తథానామ మంత్రోయాగశ్చ పంచమః। అమీతు పంచసంస్కారాః పరమైకాంతిహేతవః। తారయిష్యన్గురుశ్శిష్యం చక్రాద్యైర్హేతిభి

ర్థారే:" ఇత్యాది శ్రుతిస్మృతిసంహితా వచనాదులయందు, భగవత్సంబంధమును తెలియజేసెడుచక్రాది ధారణమగుతాపః పుండ్రనామమంత్రయాగములనెడు పంచసంస్కారములను చేసికొనవలయు.

—ఋక్ శాఖ సప్త, అష్టకము నాలుగవ అధ్యాయము యెనిమిదవ వర్గమునందు—

శ్రుతి॥ పవిత్రం తేవితతం బ్రహ్మణస్పతే ప్రభుర్గాత్రాణి పర్యేషివిశ్వతః అతప్తత నూర్నతదామో అశ్ను తేతసద్వహం త్యకృమానతః॥

తా॥ తప్తచక్రాంకితములేని శరీరమును చూడకూడదని నిషేధించబడియున్నది.

—మైత్రావరుణ శాఖయందు—

శ్రుతి॥ సామవేదే ప్రతిపాద్యతే, తథాహిపవిత్ర మిత్యగ్నిః అగ్నిర్వై సహస్రారః సహస్రారోనేమిః నేమినాతప్తతనుః బ్రాహ్మణస్సాయుజ్యంస లోక తామాప్నోతి॥

తా॥ అగ్నియందు తప్తమైనచక్రాంకితమును ధరించినబ్రాహ్మణులు పరబ్రహ్మ సాలోక్య సాయుజ్యములను పొందుదురని. చెప్పబడియున్నది.

—కాండవేదమునందు—

శ్రుతి॥ దేవాసోయేన విధృతేన బాహునాసుదర్శనేన ప్రయాతం స్వర్గమాయాంతి తామలోక విస్పష్టవీ, తస్వయంతి, బ్రహ్మణోవేసర్వం సర్వావై దేవతానాం సర్వావైవిప్రాణాం సర్వావైక్షత్రియాణాం సర్వావై వైశ్యానాం సర్వావైశూద్రాణామిత్యగ్నినావై బాహూత్రాతప్తం చక్రం ద్విభుజేధార్యే తోర్ధ్వపుండ్రమాలిఖేత్ తస్మాద్విరేఖం భవతి పునరాగమనంనచేతి బ్రహ్మణ స్సాయుజ్యం సలోకతామాప్నోతి॥

తా॥ సమస్తదేవతలు, సమస్తబ్రాహ్మణులు సమస్తక్షత్రియులు సమస్తవైశ్యులు సమస్త శూద్రులు అగ్నిచే తప్తమైన చక్రాంకితమును రెండుభుజములయందు ధరించవలయును; మధ్యవైశాల్యముతో ఊర్ధ్వపుండ్రములను ధరించవలయును; అట్టివారలు విష్ణు సాయుజ్యమునుపొంది స్వర్గాదులయందుండితిరుగా వెడలివచ్చువారివలె పరమపదముననుండి వెడలివచ్చుటలేదు-

—పరమోపనిషత్తుయందు—

శ్రుతి॥ నేమినా తప్తతనుః । బ్రాహ్మణసాయుజ్యం । సలోకతామాప్నోతి.

తా॥ అగ్నియందు తప్తమైన చంక్రాంకితముతోకూడిన శరీరముగల బ్రాహ్మణుడు సాలోక్య సాయుజ్య ములను పొందుచున్నాడు.

—అధర్వణ మహోపనిషత్తుయందు—

శ్రుతి ॥ దక్షిణేతు భుజేవిప్రో । బిభృయాద్వై సుదర్శనం । సవ్యేతు శంఖం బిభృయాదితి బ్రహ్మవిదోవిదుః ॥

తా ॥ బ్రాంహ్మణులు కుడిభుజమునందు సుదర్శనమును, ఎడమభుజమునందు పాంచజన్యమును ధరించుకొన వలయునని బ్రహ్మవిదులగు వారలు నెరుంగుదురు— ఇట్లుఅమోఘముగ ప్రమాణములుచక్రాంకనమునుగురించి ఘోషించుచున్నవి.

— పరాశరస్మృతౌ, ఉత్తరఖండే, ద్వితీయేధ్యాయే. —

శ్లో ॥ వినాయజ్ఞోపవీతేన వినాచక్రస్యధారణం । వినాద్వయేనైవవిప్రశ్చండాలత్వమ వాప్నుయాత్ । విధినా శంఖచక్రాది ధారణంచోర్ధ్వపుణ్డ్రకం । ఉపవీతం శిఖాబంధః విప్రస్య సతతంస్మృతం । చక్రలాంఛన హీనస్య । ద్విజత్వం నిష్ఫలంభవేత్ । అచక్రధారిణం విప్రం యశ్శ్రాద్ధేభోజయేన్నరః । రేతోమూత్రపురీషాదిసపితృభ్యః ప్రయచ్ఛతి । శంఖచక్రోర్ధ్వపుండ్రాదిరహితో బ్రాహ్మణాధమః । జీవన్నేవసచండాల స్సర్వకర్మసు గర్హితః । చక్రసంస్కారహీనస్య ద్విజత్వం నిష్ఫలం భవేత్ ॥

తా ॥ జంధ్యములేకనే చక్రములేకనే దేనిని ధరింపగూడదు. ఈ రెండు లేని విప్రుడుచండాలత్వమునొందును, విధిచేత శంఖచక్రములను ఊర్ధ్వపుణ్డ్రమును యజ్ఞోపవీతమును బ్రాహ్మణుడు ధరింపవలయును; చక్రలాంఛనములేనివాని ద్విజత్వమునిష్ఫలమగును; శంఖచక్రధారిగాని వానిని శ్రాద్ధమునందుభుజింపజేసినవాడు, రేతోమూత్ర పురీషములనుపితృదేవతలకిచ్చినవాడౌను, శంఖచక్రోర్ధ్వపుండ్రాదిరహితుడు బ్రాహ్మణాధముడు బ్రతుకుచునే చండాలుడౌను

సర్వకర్మలయందునిందితుడు; చక్రసంస్కారహీనుని ద్విజత్వము నిలవ్వకగును.

—వృద్ధపరాశరః—

శ్లో ॥ అగ్నినైవతుసంతప్తం చక్రమాదాయవై ద్విజః । ధారయేత్సర్వ వర్ణానాం హరిసాలోక్య సిద్ధయే । ఉపవీతశిఖి విప్రశ్చక్రలాంఛనసం యుతః । చక్రలాంఛన హీనస్య విప్రస్య విఫలాః క్రియాః.

తా ॥ విష్ణుసాలోక్య సిద్ధికొరకు బ్రాహ్మణుడు అగ్నితప్తమైన చక్రము నుధరింపవలయును. యజ్ఞోపవీతము గలవాడుగనుజుట్టుగలవాడుగను చక్రలాంఛనములతో గూడిన వాడుగను కావలయు. చక్రలాంఛనములేని విప్రుని క్రియలు నిష్ఫలములు.

— వృద్ధమనుశ్చ —

శ్లో ॥ ఊర్ధ్వపుండ్రంతథా చక్రం నిత్యం ధారయతేనరః । తేనతస్యాశుచి ర్నశ్యేచ్ఛు భమస్యవివర్ధతే ॥

తా ॥ ఊర్ధ్వపుండ్రమును చక్రమును ధరించినవానికి పాపముపోయి మేలుకలుగును.

—శంఖః—

శ్లో ॥ ఉపవీతాది వద్ధార్యాశ్శంఖచక్రగదాదయః। బ్రాహ్మణస్య విశేషేణ వైష్ణవస్య విశేషతః॥

తా ॥ శంఖచక్రగదాదులు ఉపవీతమువలె ధరింపదగినవి. ఇవి బ్రాహ్మణునికి విశేషముగాను వైష్ణవునికి అంతకంటె ముఖ్యముగాను చెప్పబడినది.

— శాండిల్యః. —

శ్లో ॥ పశుపుత్రాదికంసర్వం గృహోపకరణానిచ । అంకయేచ్ఛంఖ చక్రాభ్యాం నామకుర్యాచ్చ వైష్ణవం.

తా ॥ పశుపుత్ర గృహోపకరణములు మొదలగు వానికిని శంఖచక్ర ధారణము చేయవలయు, ఆవస్తువులకు వైష్ణవమని పేరు పెట్టవలయును.

— హారీతస్మృతౌ —

శ్లో ॥ ప్రతప్త శంఖచక్రాది హేతుభిర్మంత్రముచ్చరన్ । దక్షిణేతుభుజేచ

క్రంవామాంసేశంఖమేవచ । గదాంచబాహుమధ్యేతు హృదయేనం దకంతథా । మస్తకేతుతథా శార్ఙ్గమంకయేత్స్వ మలంతథా ఏవంతా వత్క్రియా కార్యావైష్ణవీ ఖలుపాపహా॥ అనంకయిత్వాచక్రేణయ త్కించిత్కర్మసంచరేత్ । తత్సర్వంయాతివిఫల మిష్టాపూర్తాదికం నృప । అచక్రధారిణో విప్రాస్సర్వకర్మసుగర్హితాః । అవైష్ణవత్వ మాపన్నోనరకంచైవ గచ్ఛతి॥

తా ॥ తప్తశంఖచక్రాదికములలో మన్త్రోచ్చారణ పూర్వకముగ దక్షిణ భుజమునందు చక్రమును వామభుజమునందు శంఖమును బాహుమధ్యమునందు గదను హృదయమందు నందకమును శిరస్సున శార్ఙ్గమునుధరింపవలయును; ఇట్లు ధరింపనివాని ఇష్టాపూర్త్యాది క్రియలు వ్యర్థములగును అట్టివాడు అవైష్ణవత్వ మునొంది సర్వకర్మలయందు నిందితుడై నరకము నొందును.

— నారదః. —

శ్లో ॥ సువర్ణరౌప్యతామ్రాద్యైః కృత్వాశంఖంసుదర్శనం । ద్విజాతిరేకజాతిశ్చబిభృయాదగ్నిసంయుతమ్ ॥

తా ॥ శంఖమును సుదర్శనమును బంగారముతోగాని రజతముచే గాని నిర్మించి అగ్నితప్తములైన వానితో ద్విజలుమొదలగు వారు అంకితులుగా వలయును.

— హరివంశే. —

శ్లో॥ నానాదేశసముద్భూతా బ్రాహ్మణాః క్షత్రియావిశః । చక్రాంకితాః ప్రవేష్టవ్యాయావదాగమనంమమ.

తా॥ నానాదేశోద్భవులైన బ్రాహ్మణ క్షత్రియవైశ్యశూద్రులును శంఖ చక్రాంకితులైన వారు నేను వచ్చునంతలో ద్వారకలో ప్రవేశింప చేయవచ్చు నులేనివారలను ప్రవేశింపచేయరాదు, అని సుశ్రీకృష్ణవాక్యము.

—శ్రీభాగవతే.—

శ్లో ॥ చక్రాంకితస్య సాన్నిధ్యే తపః కుర్యాత్ప్రయత్నతః । స్నానం దానంతపోహోమస్తత్సర్వం చాక్షయంభవేత్ ॥ సంవత్స రేణ యత్పాపం మనసాకర్మణాకృతం । తత్సర్వం నశ్యతే తేషాం

సకృచ్చక్రాంక దర్శనాత్ । జ్వరదాహభయంచైవ చోరాగ్నిజభ యంతథా । సర్వంతత్రశమాయాలం యత్రచక్రాంకితోవసేత్ ॥

తా ॥ చక్రాంకితుడు నివసించుచోట, తపస్స్నానదాన హోమాదులు అక్షయములగును, సంవత్సరమునుంచి చేసిన మనఃపావముకాయికపాపము చక్రాంకితుని సన్నిధిలో నశించును, జ్వరాగ్నిచోరాదిభయములుగూడనశించును.

— బ్రహ్మాండే-రుద్రః —

శ్లో ॥ సహసాత్యాజ్యవిష్ణుసామీప్యం వ్రజతపితాలభేత్సదా। విష్ణుచక్రాంకితం దృష్ట్వాయోభ్యుత్థాయకృతాంజలిః । స్వకీయం కులముద్ధృత్యబ్రహ్మలోకే మహీయతే । చక్రాంకితభుజాయస్మిన్ పఙ్క్తిమధ్యేతుభుంజతే । సాపఙ్క్తిస్సర్వలోకేషు దేవపఙ్క్తిషుగీయ్యతే । బ్రహ్మచారీగృహస్థోధవాన ప్రస్థోధభిక్షుకః। అవశ్యం ధారయేచ్చక్రమగ్నితప్తమతంద్రితాః ॥

తా ॥ విష్ణుచక్రాంకితుని చూచి నమస్కరించినవాడు చనిపోయినతన తండ్రితోగూడ బ్రహ్మలోకమునందు బూజ్యుడగును, తనకులమును ధ్ధరించును పజన సమూహమునందు చక్రాంకితులు భుజించుచున్నారో ఆపంక్తిని దేవతులుపొగడుచున్నారు, బ్రహ్మచారి గృహస్థవాన ప్రస్థయతులు జాగరూకులై అగ్నితప్తమైన చక్రమును ముఖ్యముగా ధరింపవలయును.

—వరాహే—

శ్లో ॥ అంకయేచ్ఛంఖచక్రాభ్యాం దక్షిణేతరపార్శ్వయోః। తద్ధారణాన్మహాపాపాన్ముచ్యతే నాత్రసంశయః । వాసుదేవాంకనంకుర్యాదాత్మనో బాహుమూలయోః । పోశ్వమేధఫలం ప్రాప్యవిష్ణులోకేమహీయతే॥

తా॥ రెండుభుజములయందును తప్తశంఖచక్రముల ధరించినవాడుస ర్వపాపవిముక్తుడై అశ్వమేధఫలమునొంది విష్ణులోకము నందు బూజ్యుడగుచున్నాడు.

—ఆదిత్యపురాణే—

శ్లో ॥ చక్రాదీన్ధారయేద్విప్రో లలాటే మస్తకేభుజే। పాతకాదివిశుద్ధ్యర్థం భవక్లేశవినాశనం॥

తా॥ పాపవిముక్తికొరకును, సంసారవిముక్తికొరకును, తప్తచక్రాదులను బ్రాహ్మణుడు లలాటమస్తకభుజములయందు ధరింపవలయును.

—భగవద్వాక్యం—

శ్లో॥ విప్రోవాయది వాక్షత్రో వైశ్య శ్శూద్రస్తథైవచ। అన్యేసంకర జాతాశ్చ చక్రాంకామమ వల్లభాః॥

తా॥ బ్రాహ్మణ క్షత్రియవైశ్య శూద్రులుగాని సంకరజాతులుగాని చక్రాంకితులైరేని నాకు ప్రియులగుదురు.

—భగవాన్ ఉవాచ—

శ్లో॥ సపాద పుండ్రాంకితఫాలదేశాః। సుతప్త చక్రాంకితబాహుమూలాః। అష్టాక్షరద్వాదశ మంత్రజప్యాః। మద్భక్తవర్యాః ఖలుపూతదేహాః॥

తా॥ పాదపుండ్రముచేత అంకితమగు లలాటముగలవారును, చక్రాగాతప్తమైన చక్రములచే అంకితమగు బాహువులు గలవారును, అష్టాక్షర ద్వాదశమంత్రములు జపించువారలు నాభక్తులలో శ్రేష్ఠులని, చెప్పబడియున్నది. ఇంకా విశేషముగా చెప్పియున్నదానిని గ్రంథవిస్తరభీతిచే వ్రాయలేదు.

—శ్రీపిళ్లలోకంజీయర్ సాయించినశ్రీవైష్ణవసమయాచారనిష్కర్షమునందు.—

ఇనివైదికోత్తమరాయ్ వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యరాయ్ సర్వస్వామియాన ఎంబెరుమానార్ దర్శనత్తిల్ అన్వయిత్తు ఆళ్వార్కళుం ఆచార్యరుకళుం అరుళిచ్చెయ్దదివ్య శ్రీసూక్తికళానవాలాయి రప్రభందంగళైయుం అభ్యసిత్తు తధ్యదార్థసత్సం ప్రదాయసిద్ధజ్ఞానానుష్టానానభిజ్ఞరాయ్ తత్తత్ జ్ఞానానుష్టానం గళుక్కు శేరాదపడియాన విపరీతార్థంగళై శొల్లి అవైదికమాయిరుక్కిర శంఖచక్రధారణ దుర్గాదిదేవతాంతర ప్రియమాన మధ్యమాసాధ్యశుద్ధ ద్రవ్యాహారాభి లాషికళాయ్ వర్ణాశ్రమంగళై యళిత్తు విహితావిహిత విభాగానభిజ్ఞరాయ్ ఇప్పడి దురాహారదుర్ విషయకప్రవణరాయ్ భుర్మతస్థరాయ్ యిరుక్కుమత్తాలవర్ కళుక్కు దేవతాంతరపరత్వశంకైయుండాయిరుక్కుమదుసిద్ధం; అకైయాలె అవర్కళై అరక్కరశురరాగవుమిప్పడినిశ్చయిక్కక్కడవైయిల్ లై అనిసాయించినప్రకారముగనుండువార్ల వద్దఅవైదికచ

క్రధారణాదులనుచేసుకొనక. భగవచ్ఛాస్త్రమునందు "చక్రాదిధారణంపుం సాంపరసంబన్ధవేదనమ్। పతివ్రతానిమిత్తం హివలయాదివిభూషణమ్" అనియు "పశ్చాచ్ఛన్వేన సూత్రేణకృత్వాగ్నిస్థాపనాదికమ్।మూలమంత్రేణ హుత్వా జ్యంతతఃప్రత్యక్షరాహుతిః । ఏకాపునశ్చసర్వేః॥పౌరుషీవిశ్వషోడశ। హుత్వా త్రిర్విష్ణుగాయత్ర్యావైష్ణవైశ్చాపి హేతిభిః । వేదాదిభిస్తథామ న్త్రైస్తథై వజుహుయాద్ఘృతమ్ । చక్రంచపాఞ్చజన్యం చతస్మిన్నగ్నౌవినిక్షిపేత్ । పున శ్చపూజా కర్తవ్యాగన్ధపుష్పోపహారకైః" అనియు"అగ్నినైవతుసంతప్తంచక్ర మాదాయవైద్విజః । ధారయేత్సర్వవర్ణానాం హరిసాలోక్యసిద్ధయే స్వా గ్నౌకుర్యాద్బ్రహ్మచారీ తప్తచక్రాఙ్కధారణమ్ । స్వాగ్నౌకుర్యాద్గృహీత ద్వత్ వానప్రస్థస్తథైవచ । దేవాలయాగ్నౌ కుర్యాద్యతిస్తప్తాఙ్కధారణ మ్" అనియు "అథస్త్రీశూద్రసంకీర్ణ నిర్మూలపతితాదిషు । అనన్యేనాన్యదృష్టా చ । కృతాపినకృతాభవేత్ । అతోన్యత్రాను విధివత్కర్తవ్యాశరణాగతిః" అ ని శంఖచక్రాద్యంకనము వైదిక మంత్రసాధ్యహోమ పూర్వకమును ప్ర తిష్ఠితసుదర్శన పాంచజన్యనిర్వర్తనీయమునుగాన తత్ప్రతిష్ఠా హోమాం గకమంత్రాధికారములేని వారలను ఏర్పరచినటులైతె ఆయేర్పాటు భగవదా జ్ఞారూపమగు వైదీకమర్యాదలకు విరోధమౌనని, ఆవ్రతమప్రమాణముగఅం గీకరించిన వేదమునందు "ఆచార్యోవేదసంపన్నః" "ఆచార్యవాన్ పురుషోవే ద" "తద్విజ్ఞానార్థం సగురుమేవాభిగచ్ఛేత్సమిత్పాణి శ్రోత్రియం బ్రహ్మనిష్ఠ మ్" అని వేదసంపన్నత్వాదులను, అపస్తంభసూత్రమునందు "అభిజనవిద్యా సముదితం సమాహితం సంస్కర్తారమిప్సేత్"అనిఅభిజనవిద్యావృత్తములను ఆచార్యునికిలక్షణములుగాసాయించియుండుటయును, పాద్మోత్తరమునందు- ఆ చార్యోవేదసంపన్నోవిష్ణుభక్తోవిమత్సరః । మన్త్రజ్ఞోమన్త్రభక్తశ్చసదామ న్త్రాశ్రియశ్శుచిః । సత్సంప్రదాయసంయుక్తోబ్రహ్మవిద్యావిశారదః । బ్రాహ్మ ణోవీతరాగశ్చ క్రోధలోభవివర్జితః । ఏవమాది గుణైర్యుక్త ఆచార్యస్సఉదా హృతః" అని ఆచార్యుడు వేదసంపన్నుడై బ్రాహ్మణుడై విష్ణుభక్తుడై, తిరు మన్త్రార్థజ్ఞానానుష్ఠానములు గలవాడై సత్సంప్రదాయ సంయుక్తుడై బ్రహ్మ విద్యా విశారదుడై వీతరాగుడై క్రోధలోభవివర్జితుడై యుండుఅభిజనవిద్యా

వృత్తములుగల అగ్రవర్ణస్థులె ఆచార్యపదమునకర్హులని చెప్పియుండడమునుపర్యా
లోచించి శ్రియఃపతినియమనముచే ‹‹గురురార్థోమూర్ధ్నో హానిరసఘుజీవేనసహి
తః।సుకారార్థో హేతుస్సహాఘుటకభావేనజఇతిభువిప్రాదుర్భూతంవపతి సహి
రామానుజఇతిప్రసిద్ధోనఃపాయాత్ప్రబలతరసంసారభయతః" అనిసాయించి
నప్రకారము పురుషకారఉపాయవేషములతో ఆచార్యరూపముతోతిరువవతరిం
చినవారలై "ఆచినోతిహిశాస్త్రార్థా। నాచారేస్థాపయత్యపి। స్వయమాచర
తేయస్తు ఆచార్యస్సోభిధీయతే॥ గుశబ్దస్త్వంధకారస్స్యాద్రుశబ్దస్తన్నిరోధకః।
అంధకారనిరోధిత్వాద్గురురిత్యభిధీయతే॥" అనప్రమాణప్రకారముఆచార్యగు
రుశబ్దములకుముఖ్యవాచ్యులై వేదార్థసంగ్రహ, గీతాభాష్య, శ్రీభాష్యాదులచే
వేదబాహ్య కుదృష్టులు శ్రుతిగీతసూత్రములకుమధ్య కల్పించిన అపార్థములను
నిరసించి అనాదిసిద్ధమగు యథార్థార్థములను బయిలుపెట్టిన "విష్ణుశ్శేషీతదీ
య్యశ్శుభగుణనిలయో విగ్రహశ్శ్రీశఠారిః। శ్రీమాన్ రామానుజార్యఃపదకమల
యుగంభాతిరమ్యంతదీయమ్। తస్మిన్ రామానుజార్యే గురురితిచపదం భాతి
నాన్యత్రతస్మా। చ్ఛిష్టంశ్రీమద్గురూణాంకులమిదమఖిలం తస్యనాథస్య శేషః॥"
అనుప్రకారము పరత్వము శ్రియఃపతియందుప్రకాశించునట్లు గురుత్వము తమ
యందుప్రకాశించిన గురుకులశేషినై "అర్వాఞ్చోయత్పదసరసిజద్వన్ద్వమాశ్రి
త్యపూర్వేమూర్ధ్నాయస్యాన్వయముపగతా దేశికా ముక్తిమాపుః సోయం
రామానుజమునిరపి స్వీయముక్తిం కరస్థాం యత్సమ్బన్ధాదమనుతకథం వర్ణ్యతే
శ్కూరనాథః." అనుతిరుముడితిరువడిసంబంధముచే పూర్వోత్తరాచార్యులకు
ముక్తిప్రదులై "సత్యంసత్యంపునస్సత్యంయతిరాజోజగద్గురుః।సఏవసర్వలోకా
నా ముద్ధర్తా నాత్రసంశయః" అని సాయించిన ప్రకారము జగద్గురువై సర్వో
త్తారకులై వేంచేసియుండెడు శ్రీ ఉడయవరులు.— (శివిల్, క్రిమినల్ పవరు)
రక్షశిక్షాధికారములు రెంటినికలిగిన వారొకరు, కేవలరక్షాధికారము కలిగిన
వారొకరు, కేవలశిక్షాధికారముకలిగినవారొకరు, వీరిముగ్గురిలోనుభయాధికా
రములు కలిగినవారు, రెంటినిజరిపించేలాగునను కేవలరక్షాధికారముకలిగినవా
రువాటినే జరిపించేలాగునను కేవలశిక్షాధికారమును కలిగినవారువాటినేజరిపిం
చేలాగునను, జాతికృతబ్రాహ్మణ్యముజ్ఞానకృతబ్రాహ్మణ్యమువృత్తికృతబ్రాహ్మ

ణ్యము కలిగినవారిలో జాతికృతబ్రాహ్మణ్యాదులుకలిగినవారికి తాపాది పంచసంస్కార పూర్వకముగ మంత్ర మంత్రార్థజ్ఞానానుష్ఠానముల నుపదేశించెడు యోగ్యత కలిగియుండడమును, కేవలజ్ఞానకృత బ్రాహ్మణ్యము కేవలవృత్తికృత బ్రాహ్మణ్యముగలవారికి—"ఉయ్యోనినైవృణ్ణాకిలుజ్జురుకళ్ తమ్పతత్తే । వైయమన్నుతనైన్ఱు । యిన్దమానిలత్తీర్ । మెయ్యారై కేళ్ పైయరవిల్ మాయన్ పరమపదముజ్జళుకాళమ్ । కైయిలజ్జానెల్లికని॥" అని ఆచార్యప్రావణ్యమున జ్ఞానానుష్ఠానములను బోధించెడు యోగ్యతకలిగియుండడమునుపర్యాలోచించి, శాస్త్రశిష్టశరణ్యాభిమతములను చక్కగా తెలిసినపరమభాగవతులగు తిరుకచ్చినంబి తిరువుళ్లమునెరుగుటకై శ్రీఉడయవరులు, తిరుకచ్చినంబిగారినితమకుతిరువిలచ్చినప్రసాదించుమనిప్రార్థించగా "నంబియుంవారీర్ ఇతైయాఝవారే! పేరరుళాళర్ పొరుళల్లాదయెనై ఏపొరుళాకి అడిమైకొండదు కండునీర్ విరుంబినీరాయినుం" కిమప్యత్రాభిజాయన్తేయోగినస్సర్వయోనిషు । ప్రత్యక్షితాత్మనాథా నాం నైషాంచిన్త్యంకులాదికమ్" ఎన్గిరపడియే ఆత్మగుణత్తుకళ్ శేర్న్దిరుదుళ్ల పరమవైదిక నిష్ఠమై ఉడయరాయ్ శెయ్యానిన్ఱీరాయినుం, వర్ణాశ్రమత్తుకళ్ అదుత్తవైదిక మర్యాదైకళ్ పోక్ దిరాదదెన్ఱు విలక్కి యరుళినారెన్ఱుం" సాయించిన దానిని పిమ్మట దేవపెరుమాళ్ల తిరువుళ్లమును నెరుంగుటకై శ్రీవుడయవరులు తిరుకచ్చినంబిగార్లతో దాసునికి కొన్నిసంశయములు కలవు అవియేవియని దేవ్పెరుమాళ్లకు విన్నపముచేసి తెలిసికొనివచ్చి సాయించ వలయునని ప్రార్థించినపుడు దేవ్పెరుమాళ్లు తిరుకచ్చినంబిగారితో "సహజదాస్యత్తై యుడయనాయ్ ఛన్దానువర్తనంపణ్ణియిరుప్పానొరుత్తన్ నాంసాదీ పనుడనే విద్యాభ్యా సంపణ్ణినాప్పోలె పలవిడంగళిలుం సకలశాస్త్రంగళైయుం సక్కృతాఖలత్తిలె ఉళ్లపడి అరిందిరుప్పానొరుత్తన్ నమ్మైకేట్కిరా నిత్తనై పరత్వంనామే దర్శనంబేధమె ఉపాయంప్రపత్తియే అన్తిమస్మృతి వేండాశరీరావసానత్తిలే మోక్షం పెరియనంబిగళై ఆశ్రయిప్పదు" అని సాయించిన వానిని తిరువుళ్లము లోపర్యాలోచించి శ్రీఉడయవరులు అభిజన విద్యావృత్తములుగల అగ్రవర్ణస్థులలో నేర్పరచిన డెబ్బదినాలుగు సింహాసనాధిపతుల సన్నిధులయందును వారి యపరావతారులగు శ్రీమణవాళ మహామునులు నేర్పరచిన అష్టదిగ్గజముల సన్నిధులయందును పంచ

సంస్కార సంపన్నులై "శ్రీమన్నారాయణ స్వామీదాసస్త్వమసితస్యమై! ప రమీపృన్నస్త మేవార్థ మనుకూలో విసర్జయేత్ । ప్రాతికూల్యం సువిస్రబ్ధస్సం ప్రార్థ్యశరణంహరిం । వ్రజతస్యైవచరణౌతత్రైవాత్మానసమర్పయ ॥ నిత్యం విష్ణుంపరంకర్మకురునిం ద్యానిమాకృధాః ॥ యజస్వనిత్యమాత్మె శంమారంసీర న్యదేవతాః । లక్ష్యస్వలక్షణైర్భాగ్యర్లక్షిష్టామాన్యలక్షణైః ॥ ఉపాస్యవైష్ణవా న్నిత్యమసతో మోపసీసరః ॥ ప్రత్యాదేశంప్రణమ్యోమిత్యక్త్వాత్మానం నివేద యేత్" ఇత్యాదికల్పోక్తవచనముల ప్రకారమును.

— సాత్వికబ్రాహ్మవిద్యావిలాసము. —

వేదముమొదలు శిల్పశాస్త్రమువరకు శాస్త్రములెన్నిగలవో అవియన్ని యు సామాన్యాకారముగ వైదిక కర్మప్రతిపాదక శాస్త్రములని చెప్పబడు ను "వైదికశబ్దమునకు వేదమే హేతువుగానుండ తక్కిన శాస్త్రము లెందుకనిన ఆవేదార్థమునే బ్రహ్మాది దేవతలును దక్షమరీచిమొదలగు నవప్రజాపతులును వశిష్ఠాదిబ్రహ్మఋషులును, స్వాయంభు వాదిమనువులును, జనకాదిరాజఋ షులును తమబుద్ధులకు గోచరించినమాత్రము, లోకోపకారముగస్మృతిపురా ణాగమాదులు మొదలగుశాస్త్రములను రచియించిరి. అవి వైదికధర్మమునకు చేరియుండుటచే వైదికశాస్త్రములని చెప్పబడును. వీటికన్నిటికిమూలము, అనాదిన్నై, నిత్యమై సత్యమైయుండెడువేదమె, జీవస్వరూప, పరస్వరూప, ప్రకృతిస్వరూపములుమూడును, ప్రకాశింపచేయుటయే వీటికిప్రయోజనము. యిందెవరికి ప్రయోజనమనిన సచ్చిదానందస్వరూపమై, సమానాధికరహిత మై నిరపేక్షముగా యుండుటచే, బ్రహ్మమునకుగాదు జడస్వరూపమగుటచే ప్రకృతికిని గాదు, ప్రకృతివశ్యుడై దుఃఖాకులుడై సాపేక్షుడై యుండెడు ఆత్మకే ప్రయోజనకారి యగుట ప్రకాశకమై యుండును. దీపమువలె వేదము విశేషోపకారియై యుండును, అదియెట్లనిన ప్రకృతి సంబంధమునకు హే తువగు మహాపాతకోపపాతకాదులుచేయ తగదనినిషేధించుటచేతను ఐహి కాముష్మిక మోక్ష హేతువులగు కర్మాదుల విధించుటచేతను, వేదములుత్రై గుణ్య విషయములైనది. అందు సాత్విక శాస్త్రప్రతిపాద్యమైన వస్తువేప రబ్రహ్మము. బ్రాహ్మణజాతికి విధితమైన వైదికధర్మమునకు ఆద్యంతములు యుండుము, యెవడు ప్రతిపాద్యుడో వాడే బ్రహ్మమనియు,సృష్టిస్థితి సంహార

ములకు కర్తయెవఁడో వాఁడే బ్రహ్మమని నిశ్చయింపవలయుగావున నీక్రమము న, వైదికకర్మాదులయందును, వేదాదులయందును సర్గాదులయందును శ్రీయఃప తేపరబ్రహ్మమని ప్రతిపాదించబడినది. సగుణ నిర్గుణ బ్రహ్మమువాఁడేయని నిశ్చ యింపబడినది— వైదిక ధర్మాధ్యక్షత్వము, వాటికి మూలమైన వేదాధ్యక్షత్వ మునందు ప్రతిపాదింపబడెడు అశేష బ్రహ్మేశ్వ్యక్షత్వము, అందుండెడు సర్వ లోక సర్వదేవతాధ్యక్షత్వము, శ్రీమన్నారాయణునియందుండుటచే శ్రీమన్నా రాయణుఁడే సమానాధిక రహితపర బ్రహ్మమనునదినిశ్చయము. మనుయాజ్ఞవ ల్క్యాదులు శ్రీమన్నారాయణ చిహ్నమంత్రపూజావిశేషములతో స్మృతీతిహా సపురాణాదులయందితర దేవతల చిహ్న మంత్రపూజావిశేషములను చెప్పు టకుకారణమేమనిన, ఆమను యాజ్ఞవల్క్యాదులు వేదవాక్య తాత్పర్యముల ను తెలుసుకొని వేదపురుషుని హృదయమును తెలసికొని, దేవ, దానవ, మా నవుల యపేక్షితములను తెలిసికొని యధికారానుగుణముగ పరమవైదిక, వైదిక, మిశ్రవైదిక, శైవ, పూజాదులను స్మృతేతిహాస పురాణాదులయం దు విధించియున్నారు. వేదపురుషుని హృదయ మెట్టిది వేదవాక్యతాత్పర్యమెద్ది యనిన, వేదపురుషుడు స్వగత కర్మకాండ, జ్ఞానకాండములు రెంటిచే, ఐహి కాముష్మిక మోక్ష ఫలసాధనములను విధించెను. యది యెట్లనిన పూర్వకాండ మునందు తామసవాక్యములచే ఐహికులకు, రుద్ర, దుర్గా, గణపతి, క్షేత్రపా లకాదుల లాంఛన మంత్రపూజలు విధించినది. రాజసవాక్యములచే ఆముష్మి కులకు చతుర్ముఖ సురేంద్రసూర్యాగ్నుల లాంఛన మంత్రపూజలు విధించినది. జ్ఞానకాండములోని సాత్విక వాక్యములచే ముముక్షువులకు శ్రీమన్నారాయణు ని లాంఛన పూజామంత్రములను విధించెను. ఋషులా వేద తాత్పర్యములను తె లసికొని యిహలోక సుఖము నపేక్షించువారలకు రుద్రదుర్గాదిపూజలును, వి శేషించి, మోక్షాపేక్షగలవారలకు విష్ణుపూజయును, కేవలము ఆముష్మికుల కందరికిని దేవతాంతరములను చేర్చి, యజ్ఞాదికర్మములను విధించిరి. ఇహలో కభోగములను, స్వర్గాదిభోగములను, మోక్షమును అపేక్షించు వారలకు, తమోవైదికమునదుర్గాగణపతులను, సాత్విక వైదికమున శ్రీమన్నారాయణు ని, రాజసవైదికమున చతుర్ముఖ సూర్యాగ్నులను చేర్చి పంచపూజగావిధిం

చిరి. ఇవి మిశ్రవైదికమని చెప్పబడును. పరమ వైదికులగు వైష్ణవులకుఫలముప రమపదము. వైదికులకు ఫలములు స్వర్గాది బ్రహ్మలోకపర్యంతమగునా ముష్మి క మోక్షములు. మిశ్రవైదికులకుఫలములుఐహికాముష్మిక మోక్షములు మూడు నుక్రమముగానగును.

శైవులకు ఫలము కైలాసము శివలోకము,
పరమవైదికులు మోక్షమొకటియే యపేక్షించువారు.
వైదికులు ఆముష్మికమోక్షములు రెంటిని యపేక్షించువారు.
మిశ్రవైదికులు, ఐహికాముష్మిక మోక్షములు మూటినియపేక్షించువారు
తామసులు, ఐహికమొకటియే యపేక్షించువారు.
శైవులు కైలాసమును శివలోకము నపేక్షించువారు.
పరమ వైదికము సద్యోముక్తికి హేతువుగానుండును.
వైదికము క్రమముక్తికి హేతువుగానుండును.

వేదమిట్లు సకల ఫలసాధనములను ప్రతిపాదించుటచేతనే వేదముప్రబల ప్రమాణము. ఈసాత్విక ధర్మలాంఛనముల నాకమూలయందు దూషించినమి శ్రవైదిక శైవప్రమాణ వాక్యములకు గతియేమనిన, సత్వ, రజస్తమోమిశ్రగు ణములు పరస్పర విరుద్ధములుగా నొకటి కొకటి దూషించుకొను చునుండునది యేసహజముగా నుండును. అది ఆశ్చర్యముకాదు. ఇందు విశేషగుణముగలధ ర్మములను గ్రహించునదియే సత్పురుషలక్షణము.

కొందరాత్మయె బ్రహ్మమనిచెప్పుదురు, అదివాదమాత్రమింతియకాని వై దికముకాదు. సకల మతస్థులకును సకల సమయస్థులకునుఆయామతములకు తగి న ఋషిప్రోక్తాగమములును, శాస్త్రములును కలవు, యీమాయావాదులకై తే ఒకమాయావాదశాస్త్రమని యైనను, ఒకమాయావాద ఆగమమనియైన ను, ఒకమాయావాద సంహితయని యైనను ఒకమాయావాదేతి హాసమని యైనను ఉన్నట్లెచ్చట నైన ప్రతిపాదింపబడలేదే, వారు వాదించుటకుబలమే మనిన వైదికశాస్త్రములకు విపరీతార్థములును కల్పించి యుక్తిబలముచేవా దింతురు. వారు చెప్పుడు యర్థములు యథార్థములు కావోయనిన కావు, ఆ

దియెట్లనగా, అనాదిగాయుండు వైదిక కర్మములయందుఉపాస్యోపాసకజీవ పరభేదములు వ్యక్తముగా నుండుటచే తాముదానినసుష్టించుచుండుట యసత్యములని చెప్పుకొనుచుందురు. ఆలాగు వైదికములసత్యముల నిచెప్పకుండి రేని వారలఅద్వైతశబ్దమూయావాదమునిలువనేరదు. వేదవైదికప్రపంచములుప్రత్యక్షముగానుండ అసృతమని చెప్పుటయెట్లనిన, నది వ్యవహారదశయనియు, పారమార్థిక దశయనియు, బ్రహ్మమునకు రెండు దశలు కల్పించి చెప్పుదురు. బ్రహ్మమునకు రెండుదశలు చెప్పవచ్చునాయనిన, వాటికి వ్యవహారదశ అబద్ధమనియు చెప్పుదురు, అబద్ధమని చెప్పెడు వస్తువులేకుండ వలయుగాక ప్రత్యక్షముగానుండుట యెట్లనిన,కలదని తోచునది భ్రాంతియందురు. భ్రాంతియగుట యెట్లనిన శుక్తియందు రజతముకల్పనా భ్రాంతిలక్షణమని చెప్పుదురు. భ్రాంతి అనెడు గుణము గలిగనేని భ్రాంతుడనెడు నొక గుణియుండుట ప్రసిద్ధమేకదాయనిన నాని మాయోపాధిశక్తిబలముచే జీవుడైనట్లు తోచునింతియకాని యిది బ్రహ్మమేయని చెప్పుదురు. అఖండ శుద్ధ నిత్యపరమానంద స్వరూపమైన బ్రహ్మమునకు జీవత్వము కల్పించెడు ఉపాధిరూపమైన మాయయొకటి కలదు కదాయనిన, కలదనిచెప్పుదురు .కలిగనేని అద్వైతమాయా వాదమునకు భంగముకలుగునే యనిన, యుక్తితోచకనది యనిర్వచనీయమనినోరుమూసుకొని ఊరకయుందురు. ఇంతియేగాక ,మాయావాదము నింతకు మించలేదుసుమీ.

పాద్మే—"మాయావాద మసచ్ఛాస్త్రం ప్రచ్ఛన్నం బౌద్ధముచ్యతే ।
పరమాత్మజీవ యోరైక్యం మయాత్రప్రతిపాద్యతే॥
వేదార్థవన్మహాశాస్త్రం మాయావాదమ వైదికమ్ ।
మయాత్ర కథితందేవీ అసతాంనాశకారణాత్ ॥
బ్రహ్మణశ్చ పరంరూపం నైర్గుణ్యాం వక్ష్యతేమయా ।
సర్వేజగదు పద్రవ్యం మోహనార్థం కలౌయుగే॥"

—అద్వైత మతమునందు ప్రమాణము.—

"తుచ్ఛానిర్వచనీయ్యాచవాస్తవీ త్రివిధామతా ।
జ్ఞేయామాయాత్రిభిర్బోధై శ్శ్రౌతయౌక్తికలౌకికైః॥"

—తత్త్వశేఖరమునందు.—

అవిద్యానివర్తియే మోక్షమనెడుపక్షమనను రూపపన్నము, అదిసుఖరూపము కానందున సుఖసాధనమనకూడదు. బ్రహ్మమునకు సుఖములేనందున, సుఖముండెనేని బ్రహ్మము సవిశేషమగును. తిరోధానని వృత్తిమోక్షమనెడు పక్షముచేరదు. సుఖరూపము కానందుచే తిరోహిత సుఖమునకు ప్రకాశకమనిన జీవుని సుఖమునకు ప్రకాశకమా, పరుని సుఖమునకు ప్రకాశకమాయనిన జీవ సుఖమునకు ప్రకాశక మనకూడదు. జీవుడు నశించుటచే. పరసుఖ ప్రకాశక మనకూడదు. అందుకు తిరోధానములేనందున. ఉపాధి ప్రదేశమునందు సుఖము తిరోహితముంచే సర్వజ్ఞుడుకాకుండవలయు.

స్వాభావిక భేదాభేద పక్షమునందును మోక్షము పురుషార్థము కాదు. ముక్తునికి బద్ధునితో అభేదముండుటచే బద్ధుని దుఃఖముముక్తునికి వచ్చుటచే. ఈశ్వరునికి జీవునితో భేదముండుటచే జీవుని దుఃఖము ఈశ్వరునికి వచ్చుటచే.

— దశమతదర్శిని —

భగవదవతారమగు శ్రీవేదవ్యాస భగవానులు వేదసంప్రదాయమును ప్రవర్తింపించి వేదార్థ నిర్ణయముకొరకు స్వశిష్య జైమినిమొదలగు వారిచెకర్మ కాండ దేవతాకాండములను, స్వయమెవ బ్రహ్మకాండమును ప్రవర్తింపించెను. అందు సకలదేవతాంతర్యామియైన బ్రహ్మశబ్దవాచ్యుడైన విష్ణువే సాక్షాత్తుగాను, పరంపరగానుసర్వకర్మసమారాధ్యుడనియు, కర్మస్వరూపభేదతదంగాదులిట్టివనియు దేవతా స్వరూపభేద తదుపాసనాదులిట్టివనియు, కర్మకాండదేవతాకాండములయందు చెప్పబడియె. కర్మాన్విత దేవతులకు చైతన్యవిగ్రహాదులు లేవనియు. జీవాతిరిక్త పరమాత్మలేదనియు.కర్మజన్యాపూర్వమేఫల సాధనమనియు. జగత్తుప్రవాహ రూపేణ నిత్యమైసృష్టి ప్రళయములు లేవనియు. చతుర్థ్యంతాదిశబ్ద స్వరూపమే దేవతయనియు.తుర్యాశ్రమములేదనియు. దేవతులకుకర్మోపాసనాదులు లేవనియు. ఇత్యాదులుఅర్వాచీనభాట్టప్రభాకరాదులు వాఖ్యానమొనర్చిరి. ఈయర్థముస్వాచార్యులగు వేదవ్యాసభగవానులకనభిమతమగుటచే, జైమినిభగవానుల కనభిమతమనియు. సేశ్వరమీమాంసాదులయందుప్రతిపాదించబడియె. ప్రకృతిపురుష కాలవిశిష్టమైజ్ఞానశక్త్యాద్యనంతకల్యా

ణగుణాకరమై పురుషోత్తమ నారాయణాదిశబ్దవాచ్యమైనబ్రహ్మమే ఉపాదాన నిమిత్త సహకారిరూపమగు త్రివిధకారణమని చెప్పి- ఈబ్రహ్మకారణ వాదము నందు మందమతులకుదర్శనాంతరములయందుబ్రహ్మకాండమునందు నిరసింపబడినది. అవియేవియనిన కపిల పతంజలి కణాద సుగత జైన పశుపతాది మతములు.

నిర్విశేషచైతన్యమునూత్రమే సత్యము. ప్రపంచము ఆచైతన్యపు యవిద్యా పరికల్పితమయినందునమిథ్య చైతన్యస్వరూపమైనబ్రహ్మమే అంతఃకరణావచ్ఛిన్నమైనా, తత్ ప్రతిబింబితమయినా జీవుడయినందున జీవబ్రహ్మములకు భేదములేదు. (అద్వైతం) ఏవంవిధాద్వైతజ్ఞానముచే అవిద్యా నివృత్తియే మోక్షమనడము సర్వమాయావాదులకును సిద్ధాంతము. ఇందుజీవేశ్వరవిభాగాది విషయమయిన అవాంతర పక్షములు వారిచేతనే అన్యోన్య నిరస్తములయియున్నవి.

—మాయావాద ఖండనము.—

అజ్ఞానముచే ప్రపంచము కల్పితమనునది అనుపపన్నము. జ్ఞానరూపమైన బ్రహ్మమును తన్నివర్త్యమైన అజ్ఞానము ఆవరించనేరదు. ఆవరించెనేనిదానికి నివర్తకములేదు. తేజస్సును తిమిరమావరించచాలదు. ఆవరించెనేనిఅందుకు తేజస్సు నివర్తకముగాకనుండుటచే వేరునివర్తకములేదే. శుక్తిత్వముతోచక శుక్తిస్వరూపమాత్రముతోచి, అందునరజితభ్రమముకలిగిన పిమ్మట, శుక్తిత్వము తోచితె, అదినివృత్తమగును. అట్లు బ్రహ్మస్వరూపము, సధర్మకముకానందున స్వరూపమాత్రముతోచితే ప్రపంచ భ్రమము ప్రతిబద్ధమగును. అదితోచకుండెనేని భ్రమహేతువులేదు. గనుక ప్రపంచ భ్రమమనుపపన్నము.

కాచాది దోషము సత్యమగుటచే భ్రమహేతుత్వము కూడును. అవిద్యాఖ్యదోషము, మిథ్యయగుటచే భ్రమహేతుత్వముకూడదు. అదికూడునంటేబ్రహ్మస్వరూపమైన అధిష్టానము మిథ్యయని, అంగీకరించినాప్రపంచభ్రమమే కలుగవచ్చును. అవిద్యానివృత్తి బ్రహ్మస్వరూపమునకంటే అతిరిక్తమా అనతిరిక్తమా? అదిఅతిరిక్తమగునేని అది సత్యమంటేఅద్వైతహానిప్రసంగించును. మిథ్యయంటిమేనిదోషముమిథ్యయగును. అదిబ్రహ్మస్వరూపానతిరిక్తయనునప్పుడు

బ్రహ్మస్వరూపము నిత్యమగుటచే తత్వజ్ఞాన సాత్యత్వము భగ్న మగును. ఈ తత్వజ్ఞానము ఉపదేశా సంభవముచే దుర్ఘటము గీతాచార్య ప్రభృతులకు తత్వజ్ఞానము కలిగి యుండెనేని స్వ వ్యతిరిక్త మొకరును లేనందున వారిని గూర్చి యుపదేశము కూడదు. తత్వజ్ఞానము లేకుండెనేని అజ్ఞుడయినందున నుపదేశింప జాలరు. ఒకరికిన్ని తత్వజ్ఞానము కలుగ లేదని చెప్పెడుపక్షమునందునిప్పుడెవరికిని తచ్ఛ్రవణాదిప్రవృత్తికూడదు. జ్ఞానము కలిగినా మోక్షము కలుగలేదంటే శుకాదులు ముక్తులయినారనెడు ప్రసిద్ధి కూడదు. వాక్య జన్య జ్ఞానము మోక్ష సాధనమైతే ధ్యానాది విధులు వ్యర్థము లగును. అపరోక్ష భ్రమమునకు పరోక్షమయిన వాక్య జన్య జ్ఞానము నివర్తకము కానేరదు. శబ్దజ్ఞానమునకు అపరోక్షత్వము గోవునకు అశ్వత్వమువలె అసంభావితము. ధ్యానాది విధులు అద్వైత సాక్షాత్కారార్థమనునదియు ననుచితము ధ్యానాదులు భేద వాసనా దాయకములగుటచే.

ప్రత్యక్షాది సకల ప్రమాణముల యందును విశిష్ట వస్తువే విషయమైనందుచే నిర్విశేష వస్తు విషయమునకు ప్రమాణము లేదు. చైతన్య స్వరూప మాత్రమునందు యోగాచారునికి మాయా వాదులకును వివాదము లేదు. ఇక చైతన్యము క్షణిక మనెడు యోగాచారుని గురించి చైతన్యము నిత్యమని మాయావాదులు వాదించునపుడు సాధ్యమయిన నిత్యత్వము స్వరూపాత్మకమా? భిన్నమా? అందు స్వరూపాత్మకమంటే స్వరూపమునందు వివాదము లేనందున సాధనము వ్యర్థము. స్వరూపాతిరిక్తమైతే సవిశేషత్వము ప్రసంగించును. నిత్యత్వ సాధకమయిన హేతువైనది చైతన్య స్వరూపమయిన పక్షధర్మమునందు లేకుండెనేని స్వరూపాసిద్ధి దోషము ప్రసంగించును. హేతువు కలిగ్గానేని హేతుధర్మముచే సవిశేషత్వము ప్రసంగించును. "అయం ఘటః" అనెడు ప్రతీతి మొదలగు ప్రత్యక్షములు ఇదమిత్థమని గోచరించుటచే నిర్విశేష వస్తువుయందు ప్రమాణము కానేరదు. ప్రకృతి ప్రత్యయ రూపముచేతను పదవాక్య రూపముచేతను విశిష్ట బోధకమయిన శబ్ద ప్రమాణమును నిర్విశేష వస్తువునందు ప్రమాణము కానేరదు. గాన సంసారబంధము మిథ్య.

అందుకు నిర్విశేష బ్రహ్మజ్ఞానము నివర్తకమని చెప్పగూడనందున ఉపాసన జన్య భగవత్ప్రసాదమే సత్యమై కర్మాది రూపమయిన సంసారమునకు నివర్తకమని అంగీకరించ వలయు. ఈమాయావాది మతదూషణము భాష్యాదులయందు బహు విధములుగా విస్తరించి చెప్పబడియున్నది.

విశిష్టాద్వైతమునందు బ్రహ్మము చిదచిత్ శరీరకత్వేన ఉపాదానముగను సంకల్పాశ్రయత్వేన నిమిత్తముగను కాలాది విశిష్టత్వేన సహకారిగను ఇట్లు త్రివిధ కారణముగా నుండును. అపృథక్ సిద్ధ సంబంధముచే అవస్థాశ్రయముగా నుండునది ఉపాదానముగాన ఘటమునకు మృత్పిండము ఉపాదానమాత్రమై భూతల మనుపాదానముగా నుండును. సర్వ ప్రయోగానుగతమయిన ఉపాదానశబ్దార్థము ఒప్పుకొనవలయుగాన అపృథక్సిద్ధసంబంధము వివక్షితము. నిమిత్త కారణమునకు ఉపాదాన కారణ మునకు భేదము మృత్ పిండమునకు కుమ్మరవానికి శరీర శరీరిభావము లేనందుచే వచ్చినది. కించ వాటికి భేదనియమము లేదు. కాలమునకు స్వసంయోగమునందు కాలత్వేన నిమిత్తత్వమును ద్రవ్యత్వేన సమవాయి కారణత్వమును వైశేషికు లంగీకరించినందున బ్రహ్మము అభిన్ననిమిత్తోపాదాన కారణత్వమునకు ఊర్ణనాభిని శ్రుతియే దృష్టాంతముగ చెప్పుటచే స్వశరీర పరిణామ యితృత్వరూపియయిన అభిన్న నిమిత్తోపాదానత్వము శ్రుత్యభిమతముగా నుండును మృత్పిండము స్వయంశరీరి కానందుచే ఉపాదాన మాత్రముగా నుండును. కుమ్మరవాడు మృత్పిండ శరీరకుడు కానందుచే నిమిత్తమాత్రముగానుండును. ఊర్ణనాభియైనది పరిణామ శరీరకమై పరిణామయితా యైనందున అభిన్న నిమిత్తోపాదానముగా నుండును. అది దృష్టాంత మగుటచే బ్రహ్మము స్వశరీర పరిణామయితాయై యభిన్న నిమిత్తోపాదానముగ నుండును. సగుణత్వాదుల నంగీకరించుటచే సగుణ శ్రుత్యాదులకు స్వారస్యము కలదు. గుణాది నిషేధ శ్రుతులు హేయగుణాద్యభావపరములు ఐక్య విధులు విశిష్టైక్య పరములు భేద నిషేధము విహితైక్య విరోధి, స్వతంత్ర భేద నిషేధపరము వాచ్యత్వాది నిషేధ శ్రుతి పరిచ్ఛేదాభావ పరము. ఉత్పత్తినిషేధము కర్మ కృతోత్పత్త్యభావపరము. ఉత్పత్తిశ్రుతులు స్వేచ్ఛా హేతుకావతారపరములు. జీవ

లకు పరస్పరైక్యవచనము జ్ఞానైకాకారతయా ప్రకారైక్యపరము. బ్రహ్మము నకు అద్వితీయ వచనము చిదచిచ్ఛరీరకత్వేన స్వజాతీయద్వితీయపరము. ఇట్లు శరీర శరీరులకు భేదము ఒప్పుకొనుటచే బంధమోక్షవ్యవస్థయు ఉపదేశాదులు తత్త్వజ్ఞానవ్యవస్థయు ఉపపన్నము. చేతనుని ఆద్యప్రవృత్తియందు ఈశ్వరుడు స్వస్వాతంత్ర్యముగా చేతన పూర్వకర్మ సాపేక్షుడైనందుచే విధి నిషేధ శాస్త్రవైయర్థ్య ప్రసంగములేదు. ఈశ్వరుడు నిత్యనిరవధిక కల్యాణ గుణాశ్రయుండై యుండినా చేతనుల యాగోపాసనాది జన్యప్రసాద విశేషములు ప్రామాణికములగుటచే నిర్వికారశ్రుతులు హేయ వికారాభావ పరములు. ప్రపంచరూపేణ బహుభవనసంకల్పము సిద్ధమగుటచే వికారా పురుషార్థ నిషేధములు సాక్షాత్ సంబంధేన వికారాద్యభావ పరములు. పుణ్యపాప జన్యమయిన భగవత్ప్రీత్య ప్రీతులే స్వర్గ నరకాది హేతువులైనందుచే అపూర్వకల్పన మనపేక్షితము. కల్పభేదములలో ఇంద్రాది వ్యక్తులు నష్టములైనను ఇంద్రాది శరీరియైన పరమాత్మ స్థాయిగా నుండుటచే కృతకర్మమునకును ఫలహాని లేదు. ఇంద్రాది దేవతా ప్రసాదము అవాంతర హేతువైనందున తద్వైయర్థ్యములేదు. పరమాత్మనే మనుష్యాదులకు ఇంద్రాది ద్వారముగాను ఇంద్రాదులకు అద్వారముగాను ఆరాధ్యుడగుటచే ఇంద్రాదులకు యష్టృత్వ యష్టవ్యత్వ విరోధము లేదు. పరబ్రహ్మమునకు చేతనుని ఆద్య దుష్కర్మ ప్రవృత్తియందు అనివర్తనము అనుమతియు స్వాతంత్ర్య ప్రయుక్తమగుటచే దోషము కాదు. స్వాతంత్ర్యము దోషమనునదియు బ్రహ్మము సిద్ధిచేతనా సిద్ధించకనా, బ్రహ్మము సిద్ధించి స్వాతంత్ర్యము దోషమంటే అది బ్రహ్మ సాధక ప్రమాణ సిద్ధమగుటచే దోషముకాదు. బ్రహ్మము సిద్ధించకుండెనేని ప్రథమమున ఆశ్రయము లేనందుచే స్వాతంత్ర్యము దోషముకాదు. ప్రాతికూల్య నివృత్త చేతన విషయమునందు దయాదిగుణములు కార్యకరము లగుటచే వాటికి వైయర్థ్యములేదు. అనాదికర్మప్రవాహ హేతుకమైన ప్రకృతి సంబంధమగు సంసార బంధము సత్యమగుటచే భగవదుపాసనాది జన్య భగవత్ప్రసాదముచే తన్నివృత్తియు నుపపన్నము. చేతనభేదము అంగీకరించుటచేత వ్యక్తి భేదముచే బంధమోక్షములు నుపపన్నములు. ఇట్లు ప్రమేయస్వారస్యము

కలదు. ప్రత్యక్షాదిప్రమాణములు సవిశేషవిషయములని అంగీకరించే ప్రమాణ స్వారస్యము కలదు. ప్రమేయసత్యత్వము అంగీకరించుటచే స్వపక్ష పర పక్ష సాధన దూషణ ప్రమాణ హానియు లేదు. భాగద్వయాత్మకమైన వేద శరీరమునందు పూర్వభాగము మిథ్యా విషయము. ఉత్తర భాగము మాత్రము బ్రహ్మవిషయ మగుటచే సత్యవిషయమని అంగీకరించెడు రాహు మీమాంసకులయిన శంకరాదులవలెను వేదశిరస్సైన యుత్తరభాగము జీవా తిరిక్త బ్రహ్మపరముగాదు. కర్మకర్తలైన జీవులనుమాత్రము ప్రతిపాదించుటచే వేదాంతభాగము నిస్సారమని అంగీకరించేకబంధ మీమాంసకులయిన భాట్ట ప్రభాకరుల వలెగాక వేద శరీరమునందుపూర్వభాగము ఆరాధనభూతకర్మ స్వరూప ప్రతిపాదకము. ఉత్తరభాగముఆరాధ్యభూతబ్రహ్మ ప్రతిపాదకమని అంగీకరించుటచే సమగ్రవేదశిరస్స్వారస్యమున్నుకర్మమీమాంసకర్మస్వరూప విచారపరమనియు దేవతామీమాంస కర్మారాధ్యవాంతర దేవతాస్వరూపాది విచారపరమనియు బ్రహ్మమీమాంస దేవతా కాష్ఠాభూతమయిన బ్రహ్మశబ్ద వాచ్యబ్రహ్మ స్వరూపవిచారపరమనియు అంగీకరించుటచే త్రికాండీ మీమాం సా స్వారస్యము సిద్ధము. ఇట్లు భగవద్భాష్యకారులచే విస్తరింపజేయబడి యున్న విశిష్టాద్వైత సిద్ధాంతమే వ్యాస భగవానులకు అత్యంతాభిమత మగును.

# అర్చావతారారాధనమవశ్యకర్తవ్యమను ప్రకరణము.

శ్రీమ దుభయవేదాంత ప్రవర్తక శ్రీమాన్ గోమఠం శ్రీనివాసాచార్యులువారు పరమ కృపచే సంస్కృత మునందు రచియించిన అర్చావతారారాధన వైభవమును, శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనా చార్యోభయ వేదాంతప్రవర్తకులై సకలశాస్త్ర సత్సంప్రదాయ విత్తములై వేంచేసియుండిన శ్రీమత్ పరమహంసే త్యాది శ్రీమాన్ మధురమంగలం ఎంబార్ జీయరు లగు, తిరువేంగడ రామానుజ జీయర్ స్వామి నియ మనముచే, శ్రీమత్పరమహంసేత్యాది పుళియంగుడి శుద్ధ సత్వం రామానుజజీయర్ ద్రవిడ భాషగా నొనర్చిన దాని నిందు నాంధ్ర భాషయం దొనర్పంబడియె.

"శ్రీవేఙ్కటాద్రినిలయః శ్రీనివాసః పరః పుమాన్ తనోతుకౌతుకం నిత్యం విదుషాం కరుణానిధిః । వందారు జనమందారం వందే రామానుజం గురుం సంసార సరణిశ్రాంతం జగచ్ఛాయా మహీరుహమ్"

శ్రియఃపతియై అవాప్త సమస్తకాముడై అపార కారుణ్య సౌశీల్య వాత్సల్యౌదార్యాది నిఖిల కల్యాణగుణ మహోదధియై సృష్టికి పూర్వము అచిద విశిష్టములైన జంతువులను "శాస్త్రఫలం ప్రయోక్తరి" అను ప్రకారము స్నానాది సంకల్పావిరోధముగనే యాదృచ్ఛికాది వ్యాజభూత సుకృత

---

శ్రీమదుభయ వేదాంతప్రవర్తక శ్రీమాన్‌గోమఠం శ్రీనివాసా చార్యులవారుపరమకృపచేసంస్కృతమునందురచియిం చిన అర్చావతారారాధన వైభవము.

శ్రియఃపతిరపారకారుణ్య సౌశీల్య వాత్సల్యౌదార్యాది నిఖిల కల్యాణ గుణమహోదధిస్సర్వస్వామీ, ప్రాక్సృష్టేరచిద విశిష్టాన్‌జంతూన్‌శాస్త్ర ఫలంప్రయోక్తరీతి,స్నానాదిసంకల్పావిరోధినైవ యాదృచ్ఛికాదినాపిసుకృతైన

ముచే అద్వేషాభిముఖ్యాదిక్రమముచే ఉజ్జిజీవయిషువై ఉభయ విభూతినాథు డైన సర్వేశ్వరుడు స్వానాదిశాసనరూపసోపబ్రహ్మణ వేద సిద్ధ యథాధికార సుకృత దుష్కృత రాశిద్వయ విజ్ఞాన సుకృతానుష్ఠానోపయోగిజ్ఞాన క్రియా శక్తిరూప కరణకళేబరాదులనిచ్చి తదభిప్రాయ జ్ఞాపకమై సోపబ్రహ్మణమైన వేదమును చతుర్ముఖ వ్యాసాదిరూపముగను స్వేనరూపముగను ప్రవర్తింపించి తానునుహార్ద విభవార్చా విగ్రహాదిరూపముచే నవధరించి సత్త్వాదిగుణత్రయ ప్రయుక్త రుచి తారతమ్యముచే ఉపాత్త కర్మజ్ఞాన భక్తి ప్రపదనాది సాధనానుష్ఠాన పరులచే ఆరాధితుడై స్వశాసనాతిలంఘికులై పరమత మోగుణ విశిష్టులయిన నాస్తికులను శిక్షించెడు వాడై వీరలతో లీలారసమను భవించు కొనుచు న్నాడు. అందు ఆస్తికులలో రాజసులును తామసులును స్వగుణానుగుణ రూపముల ననుభవించి అందు ఫలభాగికులై సంచరించు చున్నారు. సాత్త్విక పరమసాత్త్వికు లారూపములను భగవదాత్మకములుగా తెలిసికొని యందు అసూయా రహితులై సులభ సుశీలములై సాత్త్వికము

---

వ్యాజభూతేనాద్వేషా భిఖ్యాదిక్రమేణోజ్జి జీవయిషురుభయవిభూతినాథోవా సమస్తకామః స్వానాదిశాసనరూపసోపబ్రహ్మణ వేదసిద్ధయథాధికారసుకృత దుష్కృతరాశి ద్వయవిజ్ఞాన సుకృతానుష్ఠానోప యోగిజ్ఞాన క్రియాశక్తిరూప కరణ కళేబరంప్రదాయ తదభిప్రాయ జ్ఞాపకంచసోపబ్రహ్మణం వేదంచతురానన బాదరాయణాది రూపేణ స్వేనరూపేణచప్రవర్త్యస్వయమపికరణగణాతీతోతి దివ్యాత్మరూపో పి సర్వదేవస్వామీ, హార్దవిగ్రహ విభవార్చావిగ్రహాది రూపేణాధికారిణ స్సవధాయ, సత్త్వాదిగుణత్రయ తారతమ్య ప్రయుక్తరుచి తారతమ్యేనో పాత్త కర్మజ్ఞాన భక్తి ప్రపదనాదిసాధన భేదైస్తైరారాధిత స్తదభిమత ఫలాని తత్తత్ప్రాణరుచి మత శ్శాసనాతి లంఘిన పరతా మసాన్నాస్తికాన్ శిక్షయన్నపు యన్నేభిర్లీలారసమ నుభవన్నాస్తే తత్రాపిరుచి మత్స్వాస్తికేషు రాజసా తామసా శ్చస్వగుణానుగుణ రూపాణి తత్తన్మాత్ర వేదనో ని షేధిన్యాం తవత్ఫలభాగిన స్సంసరంతి సాత్త్విక పరమసాత్త్వికాస్తు తాన్యపి రూపాణి భగవదాత్మకా నజానానా స్తేష్వనసూయావత్సు సులభ సుశీలాని సాత్త్వికాని హార్ద విభవార్చాది రూపాణ్యా రాధ్య తదాజ్ఞా

లగు హార్ద విభవార్చాది రూపముల నారాధించుచు తదాజ్ఞానతి లంఘికులై సంసారోత్తీర్ణులయ్యెదరనుట యనాదియగు పరమవైదికమర్యాదగానున్నది. ఈ విషయమునందనాది పాపవాసనా దూషితాశేష శేముషీకులై వేదబ్రహ్మ సమాజమనెడు వ్యాజముచే ప్రచ్ఛన్న చార్వాకులై స్మృత్యాదులు ప్రమాణములుకావనియు వేదము ప్రమాణముకాదనియు తమయభిమతార్థకాములను ప్రతిపాదించెడు కొన్నివాక్యములే ప్రమాణమనియు స్మర్తలు తమనపేక్షించి వచ్చెడువారనియు నిట్టియశ్రావ్యమై యసహ్యమగు పలుకుల వదరెడు వితండవాదులుకొందరుతత్రాపి సౌలభ్య సౌశీల్య కాష్ఠావలంబనచే అశేషాధికారిసముజ్జీవనోపయోగియగు భగవదర్చారూపమునే శిశుపాలాదులువలె విశేషపర నిరాతంకముగా మిగుల దూషించెదరు, మూఢమతుల దురుపదేశములచే వ్యాకులపరచెదరు.

అర్చారాధనకు నకర్తవ్యత్వము చెప్పెడివారు ఎవరికైన నొకరికినకర్తవ్యమనిచెప్పెదరా? లేక నందరికి నకర్తవ్యమని చెప్పెదరా? మొదటి

---

నతిలంఘ్య వృత్తి స్సంసార ముత్తరంతీ త్యనారాధ్య పరవ వైదిక మర్యాదాం అత్ర కేచిదధునాతనా అనాదిపాపవాసనా దూషితాశేష శేముషీకాః వేద బ్రహ్మ సమాజచ్ఛద్మ ప్రచ్ఛన్నచార్వాకాః, స్మృత్యాదినప్రమాణం, వేదోఽపి నప్రమాణం, ప్రమాణం వా కంచిన్మానాంతరమస్తీతి వదంతి— స్వాభిమతార్థేషు తత్ప్రతిపాదకవాక్యాంశాః స్మర్తారోఽస్మత్తోఽపి మందా ఇత్యాదియతిరంధి దశ్రావ్యమసభ్యం వదన్తో వైతణ్డికాః। తత్రాపిసౌలభ్య సౌశీల్యాది కాష్ఠావలంబనే నాఖిలాధికారి సముజ్జీవనోపయోగితయా నిఖిల కరణ సేవనీయతయా చ విశేషత స్సంశ్రితో జ్జీవనస్య తస్య భగవతోఽభిమతత్వేనచ అర్చారూప మేవ విశేషతో విభవం శిశుపాలాదయ ఇవేహాపర నిరాతఙ్కం విదూషయంతి, వ్యాకులయంతి చ దురుపదేశై రనభిజ్ఞాన్ తత్ర తే ప్రష్టవ్యాః అర్చారాధనస్య కర్తవ్యత్వం ప్రతిజానానైన కింయేన కేన చి దకర్తవ్యత్వం ప్రతిజ్ఞాయ తే ఉత సర్వైః, ఆద్యేచకింసేశ్వరేణఉతానీశ్వరేణతత్రాస్య్యాద్యే చ కింముముక్షుణా అథబుభుక్షుణా అత్రచసర్వైరకర్తవ్యత్వేసాద్యే...

ప్రశ్నలో నీశ్వరుని యంగీకరించెడి వానిచేతనా? లేక నంగీకరించని వానిచే తనా? యందు ముముక్షువుచేతనా? లేక బుభుక్షువు చేతనా? అందరికి నక ర్తవ్యత్వమును సాధించునెడల హేతువు అనుపపన్నత్వమా? అనిష్ట ఫల త్వమా? శిష్టాచారముకానందుననా? అనుపపన్నత్వమనునది ఆరాధనమునకు కృత్యన్వయా యోగ్యత్వమా? లేక అర్చకు ఆరాధనాన్వయాయోగ్యత్వమా? అనిష్ట ఫలత్వమనునవి ఇష్టఫలాభావమా? అథవా అనిష్టఫలహేతుత్వమా? లేక బలవదనిష్టానుబంధి ఫలత్వమా? అందు ఇష్టఫలాభావము దృష్టఫలాభావమా? అదృష్టఫలాభావమా? అనిష్ట ఫలహేతుత్వ మనునవిదృష్టానిష్ట హేతుత్వమా? అథవా అదృష్టానిష్ట హేతుత్వమా? శిష్టాచారముకానిది పూర్వమా ఇప్పుడా? అథవా ద్వీపాంతరముననా అందు ఆరాధనమునకు కృత్యన్వయా యోగ్యత్వ మగునేని సర్వవ్యవహారోచ్ఛేదప్రసంగము కలుగును. ఆరాధనమనునది ఉద్దే శ్య వస్తుముఖోల్లాస ప్రయోజక వ్యాపారము. అవ్విధమగు నారాధనమునకు నర్చావతార మయోగ్య మనకూడదు. అర్చావతారమనునది ఆత్మ మనుష్యు డయ్యెననుచో మనుష్యుడనునది దేహ విశిష్టుడగు నాత్మను చెప్పునట్లయ్యో బింబవిశిష్టేశ్వరుని చెప్పుటచే ఈశ్వరుడంతట యెల్లప్పుడు కలడని చెప్పెడు

---

కిమనుపపన్నత్వంఉతా నిష్టఫలత్వం అథశిష్టాచారా భావఃఅనుపపన్నత్వంచ కిమారాధనస్య కృత్యన్వయా యోగ్యత్వం ఉతా ర్చాయా ఆరాధనా న్వయా యోగ్యత్వం అనిష్ట ఫలత్వం చ కిమిష్ట ఫలాభావః ఉతానిష్టఫలం ప్రతిహేతుత్వం ఆహోస్వి ద్బలవదనిష్టానుబంధి ఫలత్వం తత్రేష్ట ఫలా భావశ్చ కిం దృష్ట ఫలాభావః. కింస్వి దదృష్ట ఫలాభావః. అనిష్టఫలం ప్రతి హేతుత్వంచ, కిం దృష్టా నిష్టం ప్రతి ఉతా దృష్టానిష్టం ప్రతి. ఆచారా భావశ్చ కిం ప్రాక్· ఉతాధునా అథాత్ర ఆహో స్విద్ద్వీపాంతరేష్వితి తత్ర ఆరాధనస్య కృత్యన్వయా యోగ్యత్వే సర్వవ్యవహారో చ్ఛేదప్రసంగః ఆరాధనం హ్యుద్దేశ్య ముఖోల్లాస ప్రయోజకో వ్యాపారః నచర్చాయా స్తాదృశా రాధనాన్వయా యోగ్యత్వం బింబ విశిష్టేశ్వర స్యైవా ర్చాశబ్ద వాచ్యత్వాత్ తచ్చాకృత్యధికరణన్యాయాత్ చేతనప్రతిపత్తితద్వాచిశబ్దానాం త్వాపృథక్సిద్ధశేషి చేతన పర్యవసానస్య ఆత్మా మనుష్యో భూదిత్యాదా మను

గా "బ్రహ్మ సమాజమను" నొకటి మొలచి శ్రుతి స్మృతీతి హాస పురాణాగ
మాది సమ్మతముగా నుండు సత్యమైన సిద్ధాంతమును తమ పిచ్చి యుక్తులచే
నిషేధించి తమకు తోచిన ప్రకారము అనేక స్థళముల యందు ప్రశంసించు
చున్నారు. యీమతస్థులు ఎంత యుక్తులు చేసి యీమతమునుస్థాపించినను మన
ఆళ్వారాచార్యులు స్థాపించిన సిద్ధాంతమునకు సమమగునే. వీరొక యాధార
ములేకనే వాదించ నుద్యుక్తులై భాగవతా పచారములకు పాత్రులవుటయేగా
క ఈశ్వర ద్రోహులగు చున్నారే, అయ్యో! యీబుద్ధి వీరల కెట్లు సిద్ధించిన
దో తెలియరేదు. ఒక మతమును నూతన ముగా కల్పించకోరికెకలిగి చేసిరేని
యది శ్రుతి స్మృత్యుక్తులకుపొసగియుంటెగ దాయనుభవమునకువచ్చును! వీరిమ
తము "శ్రుతి స్మృతి మమైవాజ్ఞా యస్తాముల్లంఘ్య వర్తతే ఆజ్ఞాచ్ఛేదీ మమ
ద్రోహీ" అని యుండు భగవంతుని శ్రీసూక్తులకు విరుద్ధము కాదా? వీరుభాగ
వద్ద్రోహులనియును వేదబాహ్యు లనియును వివేకులకు తెలియక నుండదు
"యథోర్ణ నాభిస్సృజతే గృహ్ణతేచతథా పృథివ్యామోష ధయస్సంభవం
తి యోసౌచ యజితో విష్ణుస్సత్వగుణ ప్రణీతో భవత్ తస్య నాభేరజి ఆ
త్మా స్వయంభూఃతథాతస్య భ్రువోంత రాళాత్ తమోరుద్రః ప్రాదురభ
వత్" అని యజుర్వే దారణ్యకమునందు సర్గాదియను లోక సృష్టిని చెప్పెడు
శ్రుతియందు ఊర్ణనాభియను సాలెపురుగెట్లు తన యుదరస్థ తంతువుల బై
ల్పరచి తిరుగా గ్రసించునట్లు, శ్రీవిష్ణు దేవుండా చరాచరాత్మక ప్రపంచమును
సృజించి హరించు నతని, సత్వము యుండని యందరు పూజింతురు; వాని నాభీక
మలమునందు రాజసుడైన బ్రహ్మయుద్భవించె; నాబ్రహ్మభ్రూమధ్యమున తా
మసుడైన రుద్రుడు జన్మించెననియు, ఛాందోగ్యో పనిషత్తున "కేయూరవాన్
మకర కుండలవాన్ కిరీటీ హారీ హిరణ్మయ వపుః ధృత శంఖచక్రః । తస్యయ
థాకప్యాసం పుండరీక మివాక్షిణీ" అని చెప్పుటచే శ్రీనారాయణుండు కే
యూరమకర కుండల కిరీట కౌస్తుభాభరణములు గలవాడనియు అప్రాకృ
పంచో పనిషన్మయమైన తిరుమేనిగల వాడనియు; తామర రేకుల వంటి నేత్ర
ములు గలవాడనియు శ్రుతి చెప్పుటచే రూపము గలవాడని స్పష్టముగా తెలియ
వచ్చుచున్నది. అందుచే బ్రహ్మమునకు రూపములేదను చెప్పెడు పక్షమునిర స్త

ము. మరియొక శ్రుతియందు "యోబ్రహ్మాణంవిదధాతిపూర్వం యోవైవే దాంశ్చప్రహిణోతితస్మై" అని బ్రహ్మనుసృష్టించిన నారాయణుడే వానికివేదో పదేశముచేసెనని చెప్పియుండుటచేతను, నాబ్రహ్మతనచేసృజింపబడిన వార లకు దానినుపదేశింప, నాలాగే నిదివరకు పరంపరా ప్రాప్తముగా నుపదేశ మగుచున్నది. యుగాంతరములందు పరాశర వ్యాస ప్రాచేతసవైశంపాయ న బోధాయన శుక శౌనక భారద్వాజ గర్గ శాండిల్యాది పరమ ఋషులం దరు దారు మృత్పాషాణ స్వర్ణరజత తామ్రాదులచే భగవద్బింబముల గల్పిం చి కేయూర మకరకుండల కిరీటాది దివ్యాభరణ భూషితునిగా జేసి తామర్చిం చి, భగవత్స్వరూప రూపగుణ విశేషముల తామనుభవించి సకలచేతను లర్చావతారముల యర్చించి ఈశ్వరాను భవము చేయునట్లనేక శాస్త్రములచే బోధించునట్లు ఇదివరకు సకల మతములందు నర్చావిధి నడుచుచూ వచ్చుచు న్నది. మరియు నాళ్వారాచార్యులు పారంపర్యముగా యుపదేశమును పొంది అర్చారాధనచే భగవదను భవము గలవారలై యుజ్జీవించిరి. మరియు, నీకలి యుగంబున ననేక భక్తులర్చారాధనచే చిత్తంబు భగవదా యత్తంబై తైల ధారావ దవిచ్ఛిన్న భగవత్స్వరూప రూపగుణాదుల ననుభవించి యుజ్జీవించి న వైభవంబు వారివారి దివ్య చారిత్రములచే తెల్లంబగు. నిట్లుండ కమలాక రంబున కమలంబు చెంతనుండియు తత్కేసరాంతర్గత కమనీయ మధుర సం బెఱుగని కప్పల చొప్పున, నిరాలంబనముచే మనస్సు నిలువదనిచక్కగా నెఱి గియుండియు భగవద్దివ్య మంగళ విగ్రహాను భవంబుచే చిత్తంబన్యాయత్తంబు గాక భగవదాయత్తంబుచేయు నుపాయంబెఱుంగక, విషయాంతరాయత్తులై తిరుగు నీబ్రహ్మసమాజికుల దౌర్భాగ్యతకు మిగుల చింతించెదము.

"విష్ణుపూజా విహీనస్య దంతశ్చేష్టంపాలుతంశ్రితం। తపశ్చవ్యర్థతాం యాతి ప్రేతాలంకారవద్ద్విజః" అని శ్రీవిష్ణుదేవుని యర్చించనివాడు చేయుయ జ్ఞతపోధ్యానాదులంతయు నిష్ఫలమని చెప్పియుండుటచేనర్చావతారారాధన మవశ్య కర్తవ్యమనునదిసిద్ధము. నిందునగురించి విశేష ప్రమాణములుండియున వియిచట గ్రంథబాహుళ్య భీతిచే వ్రాయబడలేదు ఇందుకై మరియొకప్రత్యేక గ్రంథమును ప్రచురింప దలచి యున్నాము.

మఱియు నర్చావతారవిషయమై నీదిగువవ్రాయబడిన
కొన్నియంశములత్యావశ్యకమని తోచినందున
నవి యిందుతో జేర్పబడినవి.

"యత్తేరూపం కల్యాణతమంతత్తేపశ్యామి" అనియీశావాస్యోప నిషత్తునందును "తస్యహైతస్య పురుషస్వరూపం యథామహారజినం వాసో యథా పాండ్వావికంయథేంద్రగోపోయథాగ్న్యర్చిర్యథా పుణ్డరీకంయథాస కృద్విద్యుత్తం సకృద్విద్యుత్తేవహవా అస్యశ్రీర్భవతి" అని బృహదారణ్యకో పనిషత్తునందును "యఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే హిర ణ్యశ్మశ్రుహిరణ్యకేశ ఆప్రణఖాత్సర్వ ఏవ సువర్ణః తస్యయథా కప్యాసం పుండరీకమేవమక్షిణి" అనిఛాందోగ్యోపనిషత్తునందును. "యస్సర్వజ్ఞస్సర్వవి ద్యస్యైషమహిమాభువి దివ్యే బ్రహ్మపురే హ్యేషవ్యో మన్యాత్మా ప్రతిష్ఠితం తచ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతిస్తద్యదాత్మవిదోవిదుః" అనిముండకోపనిషత్తునం దును. "తద్విష్ణోఃపరమంపదం సదాపశ్యంతిసూరయః" అనిసుబాలోపనిషత్తు నందును. "ఏవమేవాస్యపరిద్రష్టురి మాష్షోడశకలాః పురుషాయణాః పురుషం ప్రాప్యా స్తంగచ్ఛంతి భిద్యేతే తాసాం నామరూపే సఏష రక్షణో మృతో భవతి" అని ప్రశ్నోపనిషత్తు నందును. "ధ్యేయస్సదా సవితృ మండల మధ్యవర్తీ నారాయణ స్సరసిజాసన సన్నివిష్టః కేయూరవాన్ మకర కుండలవాన్ కిరీటీ హారీ హిరణ్మయ వపుర్ధృత శంఖ చక్రః॥" అనియు. "శంఖ చక్రధరం దేవం కిరీటాది విభూషితం అగ్ని మండల మధ్యస్థం ధ్యాయే ద్యజ్ఞపతిం హరిం॥" అనియు "కిరీటినం గదినం చక్రిణంచ తేజోరాశిం సర్వతో దీప్తిమంతం పశ్యామి॥" అనియు. "కిరీటినం గదినం చక్రహస్త మిచ్ఛామిత్వా ద్రష్టుమహం తథైవ తేనైవ రూపేణ చతుర్భుజేనసహస్రబాహో భవవిశ్వమూర్తే॥" అనిశ్రీభగవద్గీత ఏకాద శాధ్యాయమునందునుచెప్పబడిన సర్వేశ్వరుని దివ్యమంగళవిగ్రహమును "యః కారయతి దేవార్చాః హృదయా లంబనాం హరేః సనరో విష్ణుసా లోక్య ముపైతి హతకల్మషః" అనిశ్రీవిష్ణుధర్మమునందు చెప్పబడిన ప్రకారము

జ్ఞానయోగ భక్తియోగ ప్రపత్తియోగులకు హృదయమునందు ధ్యానాలంబ నార్చనాదులకై ప్రతిష్ఠింపబడియుండుట నెరుగక సామవేదమందు "మహాబ్రాహ్మణే సప్తదశబ్రాహ్మణం దేవతా యతనానికం పంతే దేవతా ప్రతిమాహసంతి" అనిదేవాలయములు విగ్రహములుండేలాగున చెప్పియుండడమును "అవిముక్తేతవక్షేత్రే సర్వేషాంముక్తిసిద్ధయే అహంసన్నిహితస్తత్ర పాషాణప్రతిమాదిషు క్షేత్రేస్మిన్ యోర్చయే ద్భక్త్యా మంత్రేణానేన మాంశివ బ్రహ్మహత్యాదిపాపేభ్యో మోక్షయిష్యామిమాశుచః" అని భక్తితో నర్చించువారలకు బ్రహ్మహత్యాది పాపనివర్తన పూర్వకముగా ముక్తి నిప్పించుటకు నర్చారూపముగా వేంచేసియుండడమును రామతాపినియ్యోపనిషత్తునందు చెప్పబడియుండడమునెరుగక నాత్మస్వరూపమాత్మగుణములు దేహస్వరూపము దేహగుణములు మనకు కలిగియున్నట్లు సర్వేశ్వరునికిని కలిగియుండెడు దివ్యాత్మస్వరూప మిట్టిది దివ్యాత్మగుణము లిట్టివి దివ్యమంగళ విగ్రహమిట్టిది యావిగ్రహగుణము లిట్టివని తెలిసికొనక జీవుల స్వరూపోపాయ పురుషార్థములను సర్వేశ్వరుని స్వరూప రూప గుణ విభూతి చేష్టలను ప్రతిపాదించే వేదాదిశాస్త్రములను చక్కగా సేవించి విషయ భేద యధికారి భేద యభిప్రాయ భేదములచే పూర్వోత్తరవిరోధ పరస్పర విరోధములు లేకుండుటను పూర్వాచార్యులు సాయించిన గ్రంథములను సేవించి తెలిసికొనక దూషించి రేని యాకాశమునందు లదినయమును తననెత్తిమీదపడునట్లు దూషణకు మనమే విషయమాదుమనియెరుగని కొందరు చెప్పెడుదాని వినియు వ్రాసినదాని చూచియు మోహించడము యుజ్జీవన హేతువుకానేరదు. మరియు "అగ్నౌతిష్ఠతివిప్రాణాం యోగినాంహృదితిష్ఠతి ప్రతిమా స్వప్రబుద్ధానాంసర్వత్ర సమదర్శినాం" అను వచనమునందు వేదవిహితకర్మయోగజ్ఞానయోగభక్తియోగ ప్రపత్తియోగనిష్ఠులకు సర్వేశ్వరుడగ్ని మొదలగు వానియందు సేవ సాయించె ప్రకారమును చెప్పియుండడము నెరుగక నపార్థములుగల్పించి స్వపరవినాశకులగుటయుచితముగాదు. అయితె వానికి నర్థ మేమనగా శ్రీభగవద్గీతలో "కర్మణైవహిసంసిద్ధిమాస్థితా జనకాదయః" అనియు "జ్ఞానయజ్ఞేన చాపరే" అనియు "భక్త్యాత్వనన్యయాశక్యా" అనియు దైవీహ్యేషాగుణమయీ మమమాయా

దురత్యయా మామేవయే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే" అనియు "బహూనాంజన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే" అనియు "మామేకంశరణంవ్రజ" అనియు సాయించిన ప్రకారము కర్మయోగనిష్ఠులకు "అగ్నౌతిష్ఠతివిప్రాణాం" అని అగ్నియందును జ్ఞానయోగనిష్ఠులకు "యోగినాంహృదితిష్ఠతి" అని హృదయమందును తైల ధారవద విచ్ఛిన్న స్మృతిచే ఉభయవిభూతి విశిష్టపరబ్రహ్మానుభవము చేయుచుండెడు భక్తియోగనిష్ఠులకు "సర్వత్రసమదర్శినాం" అని సర్వమందును "అంప్రబుద్ధానాం ప్రతిమాసు" అని "అకారోవై సర్వావాక్" అనేశ్రుతిప్రకారము సర్వవేదములుగా విశ్రుతమై "సమస్తశబ్దమూలత్వాదకారస్యస్వభావతః" అనుప్రకారముసమస్తశబ్దములకు మూలమైయుండెడుఅకారమునకు "అకారోవిష్ణువాచకః" అనుప్రకారమువాచ్యుడైసకలజగత్కారణుడైసర్వరక్షకుడైసమస్తకల్యాణగుణాత్మకుడగుశ్రీమన్నారాయణుండే దేహేంద్రియమనఃప్రాణబుద్ధివిలక్షణులై జ్ఞానస్వరూపులై జ్ఞానగుణకులై నిత్యులై యుండెడుఆత్మకోట్లకు శేషిగానుపాయోపేయములుగా నుండెడువాడనియు, స్వరక్షణమందన్వయములేనిస్వరూపపారతంత్ర్యమును చక్కగానెరిగినజ్ఞానాధిక్యప్రపన్నులకునుభక్తిపారవశ్యముచేకరణశైథిల్యముః కలిగి యొకటియయినక్రమముగా ననుష్ఠించుట కనుకూలములేని భక్తిపారవశ్య ప్రపన్నులకును కర్మజ్ఞానభక్తులను క్రమముగా నెరిగియనుష్ఠించుటకుదగిన జ్ఞానశక్తులు లేని యజ్ఞానప్రపన్నులకును ఆశ్రయించి యుజ్జీవించుటకై యర్చారూపముగా సేవసాయించుచున్నాడనుయర్థముస్పష్టముగానున్నది. ఈయర్థమునుభగవచ్ఛాస్త్రమునందు "ఇదం శరణ మజ్ఞానాం ఇదమేవ విజానతాం ఇదం తితీర్షతాం పారంఇదమానంత్యమిచ్ఛతాం" అనిచెప్పబడియున్నది. శ్రీభాగవతమునఏకాదశస్కంధమునందు యిరువదియేడవ యధ్యాయమున "మదర్చాం సంప్రతిష్ఠాప్య మందిరం కారయేద్దృఢం । పుష్పోద్యానాని రమ్యాణి పూజాయాత్రోత్సవాదికాన్ । పూజాదీనాం ప్రవాహార్థం మహాపర్వ సువాన్వహం । క్షేత్రాపణ పురగ్రామాన్ దత్వామత్సార్ష్టితా మియాత్ । ప్రతిష్ఠయా సార్వభౌమం సద్మనాభువనత్రయం । పూజాదినా బ్రహ్మలోకం త్రిభిర్మత్సామ్యతామియాత్" అనియుభారతమునమోక్షధర్మమునందు "తస్మాద్విష్ణుంప్రతిష్ఠాప్య

సర్వదేవభవోద్భవం నిత్యం సంపూజయే ద్దేవం। ఏకాంతాం భక్తిమాశ్రితః యోహిస్థాపయతేవిష్ణుం సర్వదేవనమస్కృతం స్థాపితం తేన సర్వం స్యాత్ జగత్స్థావరజంగమం" అనియుపక్రమించి "యోబేరం స్థాపయేద్ధైకం విధిపూర్వం సదక్షిణంమాతృతః పితృతశ్చైవ యతశ్చోద్వహతేస్త్రియంకులైకవింశముద్ధృత్య విష్ణులోకేమహీయతే" అనువరకు చెప్పబడియున్నది.



మఱియు నిచట ప్రపన్నుల కవశ్యానుష్ఠేయమగు పంచకాలానుష్ఠానక్రమణిక వివరింపబూని శ్రియఃపతియై సకల జగత్కారణభూతుడై సర్వరక్షకుడై పరమ కారుణికుడగు శ్రీమన్నారాయణుండు సకల లోకోజ్జీవనార్థముగా ప్రథమములో తన నాభికమలమందుద్భవించిన బ్రహ్మకుపదేశించి ప్రవర్తింపజేసిన వేదములకును శ్రీకృష్ణావతారముచేసి సాయించిన శ్రీ భగవద్గీతకును శ్రీవేదవ్యాస భగవాన్లయందావేశించి సాయించిన శారీరక మీమాంసయగు బ్రహ్మసూత్రములకును ప్రవాహ రూపముగా వచ్చెడు ననాది సిద్ధమగు నర్థములకు విరుద్ధముగా వేదబాహ్యకుదృష్టులు మధ్య కల్పించిన అపార్థములను నిరసించి అనాది సిద్ధమగు యథార్థార్థములనుబయలుపరచుకొఱకు పరమపదమునందుండే తమహృదయస్వరూపులై నిత్యసూరివర్గ ప్రధానులగు అనంతులకు నియమింప వారునానియమమును శిరసావహించి తిరువవతరించి వేదార్థములనుబయలుపరచియందరునుజ్జీవించేలాగున వేదార్థసంగ్రహ శ్రీగీతాభాష్య శ్రీభాష్యాదులనుసాయించిన శ్రీభాష్యకారులశిష్యప్రశిష్యులగు శ్రీవంగిపురంనంబి శ్రీరంగనారాయణాచార్యులు శ్రీవాదికేసరి అழగియమణవాళజియ్యారు మొదలగువారు శ్రుతిసంహితాద్యర్థములసంగ్రహించి రచియించిన యాహ్నికగ్రంథములలోని సర్వవర్ణ సర్వాశ్రమ ప్రపన్న పరమైకాంతుల కవశ్యానుష్ఠేయమగు పంచకాలానుష్ఠానము వ్రాయబడుచున్నది. అయిన నీగ్రంథములో మొదట పంచకాలానుష్ఠానములోని యభిగమన కాలానుష్ఠాన విషయమై విస్తరేణ వ్రాయబడి యున్నందున నచ్చట నుక్తాంశముల నిచ్చట సంగ్రహముగను ననుక్తాంశముల విశదముగను వ్రాయబడుచున్నది.

—పంచ కాలానుష్ఠాన క్రమణిక.—

సర్వవర్ణ సర్వాశ్రమ ప్రపన్నులు ప్రతిదివసకాలము నైదు భాగములుగా విభజించుకొని యాయాకాలమునకు విధింపబడియున్న యనుష్ఠానముల క్రమముదప్పక యథాశక్తి ననుష్ఠింప వలయు. అయిదు విధములనగా నభిగమనోపాదానేజ్యా స్వాధ్యాయయోగములు. అభిగమనకాలమనగా జగత్కారణుండగు భగవంతుని ప్రాతఃకాలానుష్ఠాన పూర్వకముగా పొంద నభిగమించుకాలము. ఉపాదానకాలమనగాభగవదారాధనార్థద్రవ్యసంగ్రహకా

లము. ఇజ్యయనగా భగవదారాధనకాలము. స్వాధ్యాయ మనగాస్తోత్రానుసంధాన కాలక్షేపాదికాలము. యోగమనగా భగవద్ధ్యానకాలము.

శాండిల్యస్మృతౌ—"నివృత్తివైదికం కర్మ యత్ప్రోక్తం భవ భేషజం పంచకాలాత్మకంజ్ఞానం యచ్చబ్రహ్మైకదైవతం" అని యుపక్రమించి "మహద్విస్తరరూపోయమాచారః పాంచకాలికా సంక్షేపాత్ప్రబ్రవీమ్యద్య యథాశాస్త్రం యథామతి" అను పర్యంతము శాండిల్య స్మృతియందు బ్రహ్మైకదైవతమై భవౌషధమై పంచకాలాత్మకమగు నివృత్త వైదిక కర్మచెప్పబడుచున్న దనియు మహద్విస్తర రూపమగు పాంచకాలికా చారము యథా శాస్త్రము యథామతి సంక్షిప్తముగా వ్రాయబడుచున్న దనియు వక్కాణింప బడియె. "పంచకాల క్రమపరాః జ్ఞానవిద్యా విశారదాః శుద్ధాచారా మహాత్మానః పూజ్యాః భాగవతా స్స్వయం యత్ర భాగవతానిత్యం పంచకాలపరాయణాః నివసంతి సదాయుక్తాః తత్స్థానం నైమిశాద్వరం నివసంతిమహాత్మానో యత్రచైకాంతినోద్విజాః దేవా దేవర్షయో నిత్యం తద్దేశం పర్యుపాసతే హృదయేభక్తిహీనానాం నశాస్త్రంతుప్రకాశ్యతే తస్మాచ్ఛాస్త్రైర్దృఢాకార్యా భక్తిర్మోక్ష పరాయణైః వర్ణాశ్రమాచారవతా పురుషేణవిపశ్చితా విష్ణురారాధ్యతే పంథా నాన్య స్తత్తోషకారకః పంచేంద్రియస్య దేహస్య బుద్ధేశ్చ మనసస్తథా॥ ద్రవ్యదేశక్రియాణాం చ శుద్ధిరాచారయిష్యతే॥" అనుప్రమాణోక్తంబుగ పంచకాలక్రమపరులును జ్ఞానవిద్యావిశారదులును శుద్ధాచార మహాత్ములును పూజ్యులు నగు భాగవతు లెచ్చట నిత్యవాసముచేయుదురో యాస్థానము నైమిశారణ్యమునకంటె శ్రేష్ఠము; అట్టి యేకాంతులగు మహాత్ములెచటనివసించెదరో యాదేశమును దేవతులు దేవఋషులునుపాసింతురు. హృదయమున భక్తిహీనులగు వారికి శాస్త్రము ప్రకాశించదుగాన భక్తులై మోక్షపరాయణులగువారు శాస్త్రోక్తములదృఢముగా ననుష్ఠించతగు వర్ణాశ్రమాచారవంతులై విపశ్చితులగు పురుషులు శ్రీవిష్ణుదేవునారాధించెదరు వేరుమార్గమున భగవన్మహోల్లాసము కలుగదు. పంచేంద్రియ మనోబుద్ధియుక్తుడగు దేహికి ద్రవ్య దేశ క్రియాశుద్ధియే యాచారము.

—బ్రాహ్మ్యముహూర్త కర్తవ్యము.—

పరాశర సంహితాయాం.— "ప్రాతస్సూర్యోదయాత్పూర్వం ఘటికాత్రయమాత్రకే। ప్రపన్నః ప్రాఙ్ముఖోత్థాయ హరిహరి రితిబ్రువన్॥ ప్రక్షాళ్య కరపాణౌ చ గండూషాచమనం చరేత్। స్వచైకాంతే శుచౌ దేశే కుర్యాద్గుర్వాదికీర్తనం। శ్రీమన్నారాయణస్యైవం కీర్తనంభాషయాపివా।

తానేశిష్యాచార్యులుగా తిరువవతరించి తిరుమంత్రమును బయలు పరచిన నారాయణమహాఋషిసాయించినది.

శ్లో॥ బ్రాహ్మేముహూర్తే సత్వస్థో హరిర్హరి రితి
బ్రువన్ । ఉత్థాయ శయనే తత్ర సమాసీన
స్సమాహితః। వ్యర్థం వీక్ష్య గతం కాలం
నిర్విద్యాహామతఃపరం.

—శ్రీవంగిపురం నంబిగారు సాయించినది.—

శ్లో॥ బ్రాహ్మేముహూర్తే సంప్రాప్తేనిద్రాంత్యక్త్వా
ప్రసన్నధీః । హరిర్హరిర్హరిరితివ్యాహరేద్వై
ష్ణవః పుమాన్ ॥ ఉత్థాయ శయనేతస్మిన్నా
సీనో నియతేంద్రియః। తతస్తన్నిర్విణ్ణహృదయో
వ్యర్థ్యం వీక్ష్యగతం వయః॥

శ్లో॥ గురూన్ ప్రపద్య ప్రథమం తద్గురూంశ్చ తతోహరిం అనియు రహస్యామ్నాయ బ్రాహ్మణమునందు.—సచాచార్యవంశో జ్ఞేయో భవతి అచార్యాణామసావసావిత్యాభగవత్తః అని చెప్పబడియున్నది.

శ్రు॥ యస్య దేవేపరాభక్తిర్యథా దేవే తథాగురౌ ।
తస్యైతేకథి తాహ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః॥"

అని దేవగురుభక్తినేసర్వతత్త్వప్రకాశకారణమనికఠవల్లియందు జెప్పబడియున్నది.ఆపస్తంబాదులయందు"దేవమివఆచార్యముపాసీత" అనిచెప్పబడియున్నది.

పారమేశ్వర సంహితయందు. సంప్రబుద్ధ ప్రభాతేతు ఉత్థాయ శయనేస్థితః । నామ్నాసకీర్తనం కుర్యాత్ షోడశానాం ప్రయత్నతః ।

ప్రపత్యామనసావాచా గృహీభిక్షుశ్చకారయేత్ ॥" అనునట్లు ప్రపన్నుడు ప్రాతఃకాలమున సూర్యోదయాత్పూర్వము మూడు ఘడియలకు హరిహరిః యనియనుసంధించుచు తూర్పుముఖముగా నిదురలేచి కర చరణయుగ ప్రక్షాళనమొనర్చి నోరు పుక్కిలించి యాచమనముచేసి యేకాంతమై శుచియగు

---

ఓంనమో వాసుదేవాయ నమ స్సంకర్షణాయతే । ప్రద్యుమ్నాయ నమస్తేస్తు అనిరుద్ధాయతేనమః ॥ క్రమశః కేశవాదీనాం యావద్దామోదరం ద్విజః । నమోనమః కేశవాయ నమోనారాయణాయచ ॥ మాధవాయ నమశ్చైవగోవిందాయనమ స్తతః । విష్ణవేధనమస్కుర్యాన్నమస్తే మధుసూదన ॥ నమస్త్రివిక్రమాయాథ వామనాయ నమ స్తతః । నమస్తుశ్రీధరాయాథ హృషీకేశాయ తేనమః ॥ నమస్తేపద్మనాభాయ నమో దామోదరాయచ । దివ్య నామావతారాణాం దశానా మథకీర్తనం ॥ ఏకశృంగాదికానాంతు విహిత క్రమశః ప్రభోః । నమస్తే మీనరూపాయ కమఠాయనమ స్తతః ॥

నమోస్త్వాది వరాహాయ నారసింహాయ తేనమః । నమోవామన రూపాయనమోరామత్రయాయచ ॥ కుఠారజ్యాహలాస్త్రాయ నమఃకృష్ణాయవేధసే । కల్కిర్విష్ణోనమస్తేస్తు సర్వం సప్రణవంద్విజః ॥ యథాస్థిత క్రమేణైవ భేదాంస్త్వేతాన్ హరేర్విభోః । నమస్కుర్యాత్ప్రభాతేతు యోగాంతే తుదినక్షయే ॥ శబ్దేనోచ్చతరేణైవ సంహృష్టజనకేనతు । స్తోత్రాణి నాథమంత్రాణిఉదీర్యా వ్యానివైతతః।

—పంగిపురంనంబిగారును సంగ్రహముగా వ్రాయించినది.—

చికీర్షన్నిష్పితం కర్మ తన్నామాన్యనుకీర్తయేత్ । చతుర్భి ర్వాసుదేవాద్యై ర్నామభి స్సహ సంయుతః ॥ జపే ద్ద్వాదశ నామాని కేశవాదీని చాదరాత్ । దశావతార నామాని మత్స్యకూర్మాదికాన్యపి ॥ జపన్నుత్థాయ శయనా ద్దర్శయిష్య న్సదా హరిమ్॥

—శ్రీనారాయణమహర్షి వ్రాయించినది.—

"భగవచ్చరణాంభోజపరిచర్యావిధిక్రమం । ఏకాంతిభిరనుష్ఠేయం నిత్యం సమభిదధ్మహే ॥ వృథం వీక్ష్య గతం కాలం నిర్విద్యాహ మితః పరమ్। ఆరాధయేయం ధ్యాయేయం భజేయం పురుషోత్తమమ్ ॥ కీర్తయేయం నమస్యేయంచింతయేయమనారతమ్। వ్రజేయంశరణంచేతినిశ్చిత్యమనసాస్వయమ్"॥

ప్రదేశ మందాసీనుండై గురుపరంపరా పూర్వకముగ ద్వయమునను*సంధించి “ కూర్మాదీన్ దివ్యలోకాన్ తదనుమణిమయం మంటపం తత్రశేషం

హారీతస్మృతౌ చతుర్థోధ్యాయః.

అథవక్ష్యామి రాజేంద్ర విష్ణోరారాధనంపరం । ప్రత్యూషేస హసోత్థాయ సమ్యగాచమ్య వారిణా ॥ ఆత్మానం దేహమీశంచ చింతయేత్సంయతేంద్రియః । జ్ఞానానంద మయో నిత్యో నిర్వికారో నిరామయః ॥ దేహేంద్రియా త్పరస్సాక్షా త్పంచవింశాత్మకో హ్యహం । అహం దేహే నివత్స్యామి శేషభూతోహి శార్ఙ్గిణః ॥ శుక్లశోణిత సంభూతే జరారోగా ద్యుపద్రవే । మేదో రక్తాస్థి మాంసాది హేయద్రవ్యసమాకులే ॥ మలమూత్ర వసా పంకే నానా దుఃఖ సమాకులే । తాపత్రయ మహావహ్నౌ దహ్యమానే నిశం భృశం ॥ ఈషణత్రయ తృష్ణాహి బధ్యమానే దురత్యయే । క్లిశామి పాప భూయిష్ఠే కారాగృహ నిభే శుచౌ ॥ బహు జన్మ బహుక్లేశ గర్భవాసాది దుఃఖితే । వసామి సర్వ దోషాణామాలయే దుఃఖ భాజనే । అస్మా ద్విమోక్షణాకాంక్షయ ఆశ్రయిష్యామి కేశవమ్ ॥ వైకుంఠ పరమ వ్యోమ్ని దుగ్ధాబ్ధౌ వైష్ణవే పదే । అనంత భోగిపర్యంకే సమాసీనం శ్రియాసహ ॥ ఇంద్రనీల మణిశ్యామం చక్రశంఖగదాధరం పీతాంబరధరం దేవం పద్మపత్ర నిభేక్షణం । శ్రీవత్స కౌస్తుభోరస్కం సర్వాభరణ భూషితం । చింతయిత్వా నమస్కృత్వా కీర్తయేద్దివ్యనామభిః ॥ సంకీర్త్యనామసాహస్రం నమస్కృత్వా గురూనపి॥

తా॥ ఇట్లు హారీతస్మృతి ప్రమాణోక్తంబుగా ఓ రాజేంద్రా శ్రేష్ఠవిష్ణ్వారాధనమును జెప్పెదనువినుము. ప్రాతఃకాలమునందు నిదురలేచి జలముచే లెస్సగానాచమనముచేసి యింద్రియ జయశీలుండై ఆత్మయగు తన్ను దేహమునీశ్వరునిగూర్చి చింతింపవలయును. జ్ఞానానంద మయుడనై నిత్యుడనై నిర్వికారుడనై నిరామయుడనై దేహేంద్రియములకంటె పరుడనై పఞ్చవింశత్యాత్మకుడనై శార్ఙ్గపాణికి శేషభూతుడనగు నేను ఈదేహమునందు నివసించియున్నాను ఈదేహము శుక్లశోణిత సంభూతమై జరారోగాద్యుపద్రవస్థానమై మెదడు రక్తము మాంసము యెముకలు మొదలగు హేయ

తస్మిన్ ధర్మాదిపీఠం తదుపరికమలం చామరగ్రాహిణీశ్చ విష్ణుం దేవీం విభూషా యుధ గణ మురగం పాదుకే వైనతేయం సేనేశం ద్వార

ద్రవ్యములతో కూడినదై మలము మూత్రము క్రొవ్వు మురికి మొదలగు నానాదుఃఖ సమాకులమై తాపత్రయమనెడు మహాగ్నిచే నెల్లప్పుడు మిగుల దహింపబడెడిదై దురత్యయమయిన యీషణత్రయ తృష్ణలచే బధ్యమానమై యశుచియై కారాగృహ సమమై పాపభూయిష్ఠమయినది. ఇట్టి సర్వదోషమూలమై దుఃఖభాజనమైన దేహముతో బహుజన్మములెత్తి గర్భవాసాది బహుదుఃఖముల ననుభవించుచున్ననేను దీనివిమోచనముకొరకు వైష్ణవ పదంబగు పరమవ్యోమ వైకుంఠమందును క్షీరాబ్ధియందును అనంత భోగి పర్యంకంబున శ్రీదేవితోడ నాసీనుండై యున్న యింద్రనీలమణిశ్యాములుండును శంఖచక్ర గదాధరుండును పీతాంబరధారియు పద్మపత్రనిభేక్షణుండును శ్రీవత్సకౌస్తుభోరస్కుండును సర్వాభరణ భూషితుండునునగు దేవదేవుండగు కేశవుని యాశ్రయించి యతనినిమనంబునచింతించి నమస్కరించి యతని దివ్యనామములచేగీర్తించి సహస్రనామ సంకీర్తనంబు సేయుచు గురునమస్కారంబు జేసెదను.

శ్రీవంగిపురంనంబిగారు సాయించినది.

బ్రాహ్మే ముహూర్తే సంప్రాప్తే నిద్రాం త్యక్త్వా ప్రసన్నధీః । హరిర్హరిరితిబ్రూయా ద్వ్యాహరే ద్వైష్ణవః పుమాన్ ॥ ౧ ॥ ఉత్థాయ శయనే తస్మి న్నాసీనో నియతేంద్రియః । త్రస్త నిర్విణ్ణహృదయో వ్యర్థం వీక్ష్య గతం వయః ॥ ౨ ॥ తాపత్రయేణచాక్రాంత స్తీవ్రేణా ధ్యాత్మికాదినా । దావజే నాగ్నినాలీఢో భ్రామ్యన్నివ వనే మృగః ॥ ౩ ॥ సంసార వాగురాంతస్థో లూనపక్ష ఇవాండజః । అపశ్య న్నిర్గమోపాయ మాగామిష్వపి జన్మసు ॥ ౪ ॥ అకార్యై రతి బీభత్సైః క్రియమాణైః కృతైరపి । లజ్జితశ్చ విషణ్ణశ్చ స్మర్యమాణైః స్వకర్మభిః ॥ ౫ ॥ అవినీత మశిక్షాహార మసద్గుణాకరమ్ । అవధార్య స్వమాత్మాన మచికిత్స్య శుభాశ్రయమ్ ॥ ౬ ॥ దహ్యమానేంధనా న్తస్థోస్ఫురన్నివ కీటకః । అలబ్ధ నిర్గమ స్తిష్ఠ న్మధ్యే మరణ జన్మనోః ॥ ౭ ॥ విహ్వలశ్చ విషణ్ణశ్చ విమృశన్ స్వా

పాలాన్ కుముదముఖగణాన్ విష్ణుభక్తాన్ ప్రపద్యే" "సవ్యంపాదం ప్రసార్య శ్రిత దురితహరం దక్షిణం కుంచయిత్వా జానున్యాధాయ

---

మిమాందశామ్ । చింతయే త్వ్రిధమంచైవ మావర న్ప్రియ మాత్మనః ॥ ౮ ॥ సంసార చక్ర మారోప్య బలిభిః కర్మ రజ్జుభిః । కాలే నాకృష్య మాణస్య జంగమ స్థావరాత్మనః ॥ ౯ ॥ అహో మే మహతీయాతా నిష్ఫలా జన్మ సంతతిః । అనారాధిత గోవింద చరణాంభోరుహద్వయా ॥ ౧౦ ॥ అనాస్వాదిత సత్కర్మ జ్ఞాన భక్తి సుధా రసా । అదృష్టానంత సంసార సాగరోత్తారణప్లవా ॥ ౧౧ ॥ శ్రుతిస్మృత్యుదితాశేష సదాచార పరాఙ్ముఖీ । త్యక్తవర్ణ సమాచారా భ్రష్టా వైదిక వర్త్మనః ॥ ౧౨ ॥ అనుపాసిత సద్వృద్ధా స్వీకృతా సత్స మాగమా । అసంపాదిత శుశ్రూషా గుర్వాచార్య పితృష్వపి ॥ ౧౩ ॥ నిజ కర్మజ దేవాది దేహాధ్యస్తాత్మ భావనా । తద్భావనానుగోద్భూత సుఖ దుఃఖ వ్యవస్థితిః ॥ ౧౪ ॥ అసంభూత స్వయాథాత్మ్య జ్ఞాన జోత్తమ నిర్వృతిః । పశువ త్ప్రాకృతైరేవ గుణైరధిక నిర్వృతా ॥ ౧౫ ॥ నకర్మనిష్ఠానాత్మజ్ఞా నాపి భక్తియుతా హరౌ । నోద్యుక్తా భక్తిహీనత్వా త్తత్క్రియా స్వర్చనాదిషు ॥ ౧౬ ॥ కర్మభిః పుణ్య పాపాఖ్యై రవిద్యా పరనామభిః । ధూమై రివార్చిరా చ్ఛన్నం జ్ఞేయం జ్ఞాన మావృత్య దేహినః ॥ ౧౭ ॥ భూషయిత్వా స్వకం దేహం శబ్దాద్యై స్స్వార్జితైర్గుణైః । దర్శయిత్వా స్వసౌందర్య మాత్మనే తిష్ఠమానయా ॥ ౧౮ ॥ నిరస్తాతిశయాహ్లాదసుఖభావైకలక్షణమ్ । సంఛాద్యైవ స్స్వగుణైరేవ స్వరూపం పరమాత్మనః ॥ ౧౯ ॥ గుణమయ్యా ప్రకృత్యాఖ్య భగవన్మాయయానయా । స్వసంలీనా నంతజీవ కృతకర్మానురూపయా ॥ ౨౦ ॥ గుణ త్రయా శయానంత విచిత్ర పరిణామయా । అనాదు స్తరయాదేవ ప్రపత్తిరహితాత్మభిః ॥ ౨౧ ॥ ప్రలోభ్యమానా సతతం తస్మైవాత్యంత నిర్వృతా । అజానతీవ స్వహితం మూకస్వప్నానుకారిణా ॥ ౨౨ ॥ నిష్ప్రాణీయే నిరాలంబే నిఘాయే నిరుపద్రవే । ద్రాఘీ యస్య శుభే మార్గే యమస్య సదనం ప్రతి ॥ ౨౩ ॥ గచ్ఛతో మే సహాయస్య వర్ధయంతీ భయం మహత్ । అతీ

సవ్యేతర మితరభుజం నాగభోగేనిధాయ పశ్చాద్బాహుద్వయేన ప్రతి
భట శమనే ధారయన్ శంఖ చక్రే దేవీ భూషా దిజుష్టో జనయతు

త్రాపి సద్వైవైషా తిష్ఠతీవపురోమమ ॥ ౨౪ ॥ గతాయాస్త్వద్దృశం రూపం
వర్తమానేపిజన్మని । తత్రైవ సుమహాన్కాలో గతక్షణ ఇవాల్పకః ॥ ౨౫ ॥
అలబ్ధసుఖ సంస్పర్శ మకృతోఘా ఘనిష్కృతిః । వినైవ హరి పాదార్చా
మహో పశ్యత పవమే ॥ ౨౬ ॥ కింకరిష్యామిపదయో ర్నిపతిష్యామి కస్య
వా । దుస్తరాం దుర్దశామేతాంకథయిష్యామి కస్యవా ॥ ౨౭ ॥ ఇతఊర్ధ్వ
మహంతావ ద్యావజ్జీవం శ్రియశ్శ్రియః । పదయోరర్చనంకర్తుం యతమాన
స్సమాహితః ॥ ౨౮ ॥ అభిగచ్ఛన్ హరిం ప్రాతః పశ్చాద్ద్రవ్యాణిచార్జయన్ ।
అర్చయంశ్చతతోదేవం కాలేష్వాక్తేషుపంచసు ॥ ౨౯ ॥ వర్తమానస్సనాచైవ
పాంచకాలికవర్త్మనా । స్వార్జితైర్గంధపుష్పాద్యైః శుభైశ్శక్త్యనురూపతః ।
ఆరాధయన్హరింభక్త్యా గమయిష్యామివాసరాన్ ॥ ౩౦ ॥

తా॥ బ్రాహ్మ్యముహూర్తము సంప్రాప్తమగునప్పుడువైష్ణవుండునిదుర విడిచిప్రసన్నమనస్కుడై హరిర్హరియని యనుసంధించుచు పడకలోనుండి లేచి నియతేంద్రియుండైకూర్చుండి బహుకాలమువ్యర్థముగాగడచెనేయని చింతించి అవినీతుడనై శిక్షింపబడుటకు యోగ్యతలేకనసద్గుణసమూహమున కాశ్రయమై ప్రాయశ్చిత్తయోగ్యతయు కూడాలేక అశుభాశ్రయుడ నయిననేను అరణ్యములో కారాగ్నిచే నాక్రమింపబడి పరిభ్రమించు మృగమువలె తీవ్రమగునాధ్యాత్మికాదితాపత్రయములచే నాక్రమింపబడియున్నాననియు ఉరిలోచిక్కుపడిన కరెక్కలులేనిపక్షివలె సంసారమునతగులువడి ఉత్తరజన్మములయందునునిర్గమోపాయంబెఱుంగక యున్నాననియు తనకు తనకర్మములచే ఘటించిన యతిబీభత్సమగుదుష్కార్యములనుస్మరించి లజ్జించి ఖేదమునొంది యిరుపార్శ్వములయందు దహనమగుచుండు కట్టెలలోపలజిక్కుపడితపించు కీటకముమాడ్కి మరణజన్మముల మధ్య తగులువడి నిర్గమోపాయంబెఱుంగ కున్నవాడ నని యిట్టితనదశనుగూర్చి భయమునొంది నిశ్చేష్టితుడై దుఃఖించుచు ప్రథమమున తాను చిక్కుబడు మార్గమును చింతింపవలయును. మరియు జంగమ స్థావరరూపమగు సకలజంతువులుసంసారమనుచక్రమున బలమగు కర్మమనుత్రాటి

జగతాం శర్మవైకుంఠనాథః" అను ధ్యానశ్లోకములయందు జెప్పబడినప్రకా రము పరవాసుదేవుని వాసుదేవాది వ్యూహ మూర్తులను మత్స్యాది

చేకట్టబడి కాలమునను సరించి యీడ్వబడుచున్నవనియు అయ్యో శ్రీగోవింద చరణారవిందయుగ్మములను ఆరాధించకనే అనేక జన్మపరంపరలు నిష్ఫల ముగాగడచెనేయనియు సత్కర్మజ్ఞానభక్తులను సుధారసము పానముజేయని హేతువుచేతగదా అనంత సంసారసముద్రమును దాటదగునోడదొరకదయ్యో ననియు శ్రుతిస్మృతిచోదితమగు నశేషసదాచారములకు విముఖుడనై వర్ణ ధర్మములను విడిచి వైదికమార్గభ్రష్టుడనైతిననియు సద్వృత్తుల నుపాసిం చక అసత్సమాగమమునకొడబడి గుర్వాచార్య పితృ శుశ్రూషలుజేయనివాడ నైతిననియు స్వకీయకర్మములచే ఘటించిన దేవాది దేహములయందునాత్మ భావనచేసి తద్భావనవలన సంభవించు సుఖదుఃఖవ్యాసక్తుడ నయితిననియు ఆత్మస్వరూపయాథాత్మ్యజ్ఞానజమగు నుత్తమ నిర్వృతిబోడమనందునపశువు లకువలె ప్రాకృతగుణ నిర్వృతియే యధికమైయున్నదనియు కర్మజ్ఞాన భక్తి నిష్ఠలయం దన్వయము లేక శ్రీహరియందు భక్తిలేనందున తదర్చనాది కార్య ములయందును వ్యక్తుడకానైతిననియు పొగచే నగ్నిజ్వాలలాక్రమింప బడు నట్లు దేహ ధారిజ్ఞానము విద్యాసంబంధియగు పుణ్య పాపరూప కర్మముచే నావరింప బడియున్నదనియు చింతించి మఱియు నీయవిద్యతన సంబంధియగు దేహమును స్వార్జితమగు శబ్దాదిగుణములచే నలంకరించి తన సౌందర్యము నాత్మకు దర్శింపజేయుచు నిరతి శయానంద సుఖభావమే లక్షణము గాగల పరమాత్మ స్వరూపమును తనగుణములచే మరుగుపరచి గుణమయమై ప్రకృతి యను పేరుగల యీభగవన్మాయతనయందు లీనులైయున్నయనంత జీవకృత కర్మమున కనురూపముగా గుణత్రయాశ్రయమై యనంతవిచిత్రరూపములు గా పరిణమించుచు ప్రపత్తిరహితాత్ములకతిదుస్తరమై అత్యంత నిర్వృతమగు నీయవిద్యచే నెల్లప్పుడు వంచింపబడుచు మూగవాడు తనస్వప్నమునుచెప్పలేన ట్లుతనహితము నెరుగజాలనివానిగా జేయుచున్నదనియు మరియు పానీయము లేకనిరాలంబమైనీడలేనిదై ఆశ్రయశూన్యమైఅశుభంబగుదుర్గమమార్గంబగుయు మసదనమునుపొందించుచున్నదనియునిట్టి మార్గమునఅసహాయుడనై పోవుటచే

విభవమూర్తులను కేశవాది మూర్తులను ధ్యానించి నూటయెనిమిది దివ్య దేశ ధ్యాన శ్లోకాదులను తిరుప్పావును అనుసంధించి సమాహితచిత్తుండై బహుకాలము వ్యర్థముగా గడపితిని అని నిర్వేదనమునొంది.

"ఆరాధయన్ హరిం భక్త్యా గమయిష్యామి వాసరాన్। పతత్క్రియా విరోధీని ప్రాచీనాన్య శుభానిమే । త్వయైవ కృప యాదేవో వినాశ్యాస్మన్ మనోరథాన్ । పూరయంత్వితి సంప్రార్థ్య మంత్రిమేతదు దీరయేత్ ॥" అని శ్రీహరిని భక్తితో నారాధించుచు దినములుగడపెద. నీయారాధనాది క్రియలకు విరోధియగు ప్రాచీనకర్మముల దేవరవారే వినాశము నొందించి. యస్మన్మనోరథముల పూర్తిజేయుమని శ్రియఃపతిని ప్రార్థించి "త్వయ్యారాధన కామోయం వ్రతం చరితుమిచ్ఛతి ః సంకల్ప్య సిద్ధ్యై భగవన్ పూరయస్వ మనోరథాన్ ॥" అనునట్లు నియావ్యస్వరూప స్థితి ప్రవృత్తిగల స్వశేషత్వైకరసమగు నీయాత్మకు భగవంతుడొసగిన దేహేంద్రియాంతఃకరణముల గొని భగవంతుడు తానేతనప్రీత్యర్థముగా యోగ శేషమగు నభిగమనోపాదానేజ్యాస్వాధ్యాయ క్రియల నేతచ్ఛరీర విశిష్టుడగు నీయాత్మచే ననుష్ఠింప జేయుచున్నాడనియు నిట్లు

---

మహత్తరభయమునువృద్ధిబొందించి యిట్టి యవస్థగడచి పోయినదైన నది యేనిప్పుడు నాయెదుట నున్నట్లు తోచుచున్నదనియు యిట్లు గడచినదిగాక నీజన్మమందును దీర్ఘకాల మాలాగే క్షణము వలె గడచేననియు అయ్యోశ్రీహరిపాదార్చన జేయునందున లేశమైన సుఖ సంస్పర్శము లేక పాపరాశిక్షయించ కుండుట కనుబడుచున్నదని ఖేదించి అయ్యో! నేనేమి జేయుదునెవ్వని పాదముల బడుదును దుస్తరమగు నీదుర్దశ నెవరితో జుప్పుకొనువాడనిక మీదు నేను శ్రియఃపతి పాదముల సమాహితుడనై నర్చించెద ప్రాతఃకాలమున శ్రీహరిని గూర్చి యభిగమించి పిదప ద్రవ్యముల సంగ్రహించియనంతర మచ్ఛ్యుతునర్చించి తదుపరి మంత్రము జపించి తదనంతరముః భగవధ్యానముచేసి యిట్లు ప్రతిదినమున పాంచకాలిక వర్తనుడ నయ్యేదను స్వార్జితమగు శుభ గంధ పుష్పాదులచే శక్త్యనురూపముగా శ్రీహరినారాధించుచు గాలము గడపెద.

అనుష్ఠింపజేసెడు క్రియలు భగవద్బలముచే భగవద్వీర్యముచే భగవత్తేజముచే నే జేయుచున్నవాడననియు నను సంధింపవలయు.

*నీపాంచ కాలి కానుష్ఠాన ధర్మము లావశ్యక మని మంత్రసిద్ధాంత ఆగమ సిద్ధాంత తంత్ర సిద్ధాంత తంత్రాంత సిద్ధాంతరరూప

---

శ్రీయాళవందార్లు శ్రీభాష్యకార్లు సాయించినది.

* శ్లో॥ ఇదం మహోపనిషదం చతుర్వేద సమన్వితం । సాంఖ్యయోగ కృతాం తేన పంచ రాత్రాను శబ్దితః ॥ వేదాం తేషుయథా సారం సంగృహ్య భగవాన్ హరిః । భక్తాను కంపయా విద్వాన్ సంచిక్షేపయథా సుఖం ॥ ఇత్యాది ప్రమాణ ప్రతి పాదితప్రక్రియచే । అతి విదితత గహనగంభీర నిగమ శత శిఖర గత స్వరూపో పాయ పరమ పురుషార్థ జ్ఞాన వ్యవసాయ ప్రేమ సమ్యగాచారములను సాక్షాత్తు భగవంతుడే తన నాభీపద్మమునందు ప్రథమములో గలిగిన బ్రహ్మకు సాయించిన భగవచ్ఛాస్త్రము ఋగ్యజుస్సామాథర్వణ శాఖావిభాగములవలె "ఆగమాఖ్యం హిసిద్ధాంతం । సన్మాత్రైక ఫల ప్రదం । మంత్ర సంజ్ఞం హిసిద్ధాంతం చతుర్వర్గ ఫల ప్రదం ॥" "తంత్రాంతరం హిసిద్ధాంతం వాంఛితార్థఫల ప్రదం" అను ప్రమాణ ప్రకారము, ఆగమ సిద్ధాంత, మంత్ర సిద్ధాంత, తంత్ర సిద్ధాంతతంత్రాంతర సిద్ధాంతములనే అవాంతర తంత్రములచే విభజింప బడియున్నది

ఋగాది వేదభేదశ్శాఖాభేదములు, పుత్రశిష్యుల పూర్వపూర్వపరిగ్రహాను సారముగా వ్యపదేశింప బడియుండెడు ప్రకారము సిద్ధాంత భేదత దవాంతర భేదములు ప్రథమ పరిగ్రహాను సారముగా వ్యపదేశింప బడియున్నవి.

భారతమునందు "బ్రాహ్మణైః క్షత్రియై, ర్వైశ్యైశ్శూద్రైశ్చకృతలక్షణైః । అర్చనీయశ్చసేవ్యశ్చనిత్యయుక్తైః స్వకర్మసు ।" "సాత్వతంవిధిమాస్థాయగీత స్సంకర్షణేనయః" అని బ్రహ్మక్షత్రియ, వైశ్య, శూద్రులకును, అను శాసనికమునందు పుండరీక నారద సంవాదమున. "బ్రహ్మచారి గృహస్థోవా వానప్రస్థోథ భిక్షుకః । కేశవారాధనం హిత్వా నైవయాతి

పంచ రాత్ర సిద్ధాంత మందును శ్రీరంగ మాహాత్మ్యాదుల యందును మిగుల స్పష్టముగా చెప్పబడియున్నది.

---

పరాంగతిం॥" అని బ్రహ్మచారి గృహస్థ వానప్రస్థ సన్యాసులు భగవన్ముఖోద్గతమగు, భగవచ్ఛాస్త్ర మందు గల। సాత్వత సంహితలగు సాత్వతంత్రాదుల యందు చెప్పిన ధ్యాన స్తుతి ప్రణామార్చనాదులు నిత్యము స్వయం ప్రయోజనముగా నవశ్య కర్తవ్యమని చెప్పబడియున్నది.

భగవచ్ఛాస్త్రము నందు అహోరాత్రకాలమును అయిదువిధములుగా విభజింప బడియున్నది. అవి యేవి యనగా అభిగమన ఉపాదాన ఇజ్యా స్వాధ్యాయ యోగములు. ఈమైదింటిలో యోగమునకు శేషము అభిగమ నాదులు నాలుగు ఆ యభిగమనా దులలో జేయదగిన భగవత్కైంకర్య రూపమగు తత్తద్వర్ణాశ్రమ జాతి నిమిత్తాదిని యతధర్మములు భగవ ద్ధర్మనిష్ఠులందరికి సమము. కొందరు స్వస్వశాఖోక్త స్వస్వసూత్రోక్తప్రకారము పంచ కాలాను ష్ఠానములు జేయుచున్నారు. మరి గొందరు స్వస్వ సంహితోక్త ప్రకారము పంచ కాలా నుష్ఠానములు జేయుచున్నారు. ఈరెండు వర్గముల యందు అధికారి విశేషమాత్రమే భేదము తత్త చ్ఛిద్ధాంతోక్త అభి గమనాదు లైదు నాలుగు విధములగు పంచ రాత్రులకు సాధారణము.

పాద్మ సంహిత యందు బ్రహ్మోవాచ. "పంచకాలవిధి జ్ఞానాం ప్రాశస్త్యం భగవన్నిహ। కధితం పంచకేకాలా విధి యశ్చాపిషంచకే। మహ్యాంజి జ్ఞాస మానాయ కధయస్వ యధాతధం। నచేద్రహస్యమత్యంతం యద హంపృష్ట వానిదం॥" శ్రీభగవాను వాచ॥ "ఆద్యం కర్మాభి గమనము పాదానం తతః పరం। ఇజ్యాచ పశ్చాత్స్వాధ్యాయ స్తతో యోగ స్తతః పరం। పంచతే విధయస్తేషాం కాలాఃపంచైవతే క్రమాత్। కల్యాణా చరణాంస్తం యత్ కర్మజాతం చతుర్ముఖ॥ ఉత్థానాది క్రమాదేత దభి యానముదీరితం బ్రాహ్మే ముహూర్తే బుద్ధ్యేత ధ్యాయ న్నారాయణం పరం। ఉత్థాయా సీతశయనే కీర్తయన్నామ

## — అభిగమనకాలవిధిః —

ప్రాతఃకాలమునందు నిదురలేచి ధరణీధరుడగు శ్రీవరాహమూర్తిని ధ్యానించి "నమోస్తు ప్రియదత్తాయై తుభ్యందేవి వసుంధరే। త్వంమాతా

"వైష్ణవం" కించ - మరిన్ని "నమస్తే పంచకాలజ్ఞ పంచకాల పరాయణ। పంచకాలైక మనసాంత్వమేవగతి రవ్యయ॥" అని ఇత్యాదులయందు పాంచకాలిక ధర్మములు భగవంతునికి దోషసీయుండడమును నతనికి నత్యంత ప్రియముగా నుండడమును, తన్నిష్ఠులకువ్యవధానములేకనే భగవత్ప్రాప్తికలుగడమును ప్రతిపాదించుచున్నది.

జయాఖ్యసంహితయందు.

నారదః॥ ఏకోహిభూత్రియతేదేవ కాలోలోకేన చాపరః। పంచకాలస్త్వయోద్దిష్టః కిమేతన్మేత్ర సంశయః" భగవానువాచ॥ "ఏకస్యైవహికాలస్య వాసరీయస్యనారద। ఆప్రభాతం నిశాంతంవై పంచధాపరికల్పనా। పృథక్కర్మ వశాత్కార్యాన కాలాబహవః స్మృతాః॥" నారదః॥ "ఏకకాలాశ్రితానాంచ కర్మణాం లక్షణంవద। పరిజ్ఞాతైస్తుయైస్సద్యః కృతకృత్యోభవామ్యహమ్॥" భగవానువాచ" ॥ బ్రాహ్మేముహూర్తాదారభ్య ప్రాగంశం విప్రవాసరే। జపధ్యానార్చనస్తోత్రైః కర్మవాక్చిత్తసంయుతైః॥ అభిగచ్ఛేజ్జగద్యోనిం తతోభి గమనంస్మృతమ్। తతః పుష్పఫలాదీనా ముత్థాయార్జనమాచరేత్॥ భగవద్ధ్యాన నిష్పత్తి కారణం ప్రహరఃపరం। తదుపాదాన సంజ్ఞంవై కర్మకాల పదాశ్రితమ్। తతోష్టాంగేన యోగేన పూజయేత్పరమేశ్వరమ్। సాధికం ప్రహరంవిప్ర ఇజ్యాకాలస్తు సంస్కృతః। శ్రవణం చింతనం వాఖ్యా తపః పాఠసమన్వితా। స్వాధ్యాయసంజ్ఞాంతద్విద్ధి కాలాంశంమునిసత్తమ। దినావసానే సంప్రాప్తే పూజాంకృత్వా సమభ్యసేత్। యోగంనిశావసానేచ విశ్రమేదంత రీకృతమ్। పంచమేయోగసంజ్ఞోసౌ కాలాంశోబ్రహ్మసిద్ధిదః॥ వ్యాసాదయః, నవిష్ణ్వారాధనా త్పుణ్యం విద్యతే కర్మవైదికం। సర్వేషామేవ ధర్మాణా ముత్తమోవైష్ణవోవిధిః॥ ఈప్రకారమే సంహితాంతరములయందు సంగ్రహవిస్తరముగా పంచకాలవిధులు చెప్పబడియున్నవి.

సర్వలోకానాం పాదస్పర్శం క్షమస్వమే” అనునట్లు సర్వలోకములకుతల్లియగు శ్రీభూదేవీ పాదస్పర్శమునకై నన్నుక్షమించవలయునని ప్రార్థించి భూమి పైనడుగిడి “ఉత్తిష్ఠన్ చింతయ హరిం వ్రజన్ చింతయ కేశవం । భుంజన్ చింతయ గోవిందం స్పృశన్ చింతయమాధవం” అనునట్లు భగవద్ధ్యానముజేయుచు, శుచియగునొకదండమునకౌపీనాంతరీయోత్తరీయములనుకట్టియాదండమును చేతధరించుకొనిశౌచార్థముగాశౌచమృత్తికకరపాత్రదర్భాదులను,తిరుమణిపెట్టె నెత్తుకొని నదీతటాకములజేరి శ్రీరంగమందిరమును గీర్తించుచు నదీతీరమున శుచియగు ప్రదేశమునందు తాకొనిపోయినవానినన్నిటినినుంచి.

## —※ విణ్మూత్రోత్సర్జనము. ※—

అనంతరము శౌచార్థముదూరముగాపోయి శ్మశానహలాకృష్టమార్గభస్మలోష్ఠర సస్యగుల్మ సైకత గోష్ఠదేవాలయ పార్శ్వనదీపర్వత వల్మీక కరిష్ఠవృక్షచ్ఛాయాస్త్రీ బ్రాహ్మణసన్నిధిమొదలగు స్థలములవిడచి దూరముగాపోయి పాదుకలను దూరవిడచి శుష్కతృణ పర్ణాదులచే భూమిని మూసి “భూతబేతాళ సర్పాద్యా యక్షరాక్షస గుహ్యకాః । పరిత్యజంత్వి మందేశం బహిశ్శంకాంకరోమ్యహం” అనిచెప్పి ముమ్మారు కరధ్వనిచేసి ఉపవీతమును దక్షిణచెవిని తగిలించి ఉత్తరీయముతో శిరస్సును నాసికను నోరును మూసికొని మౌనముగానుండి పనాదికర్మమునుదీర్చుకొనవలయును దివాసంధ్యలయందు ఉత్తరముఖముగాను రాత్రికాలములందు దక్షిణముఖముగాను సూర్యాదులను చూడక కూర్చుండి మలమూత్రములను విసర్జించి తనమలమును తానుచూడక నందుపై ఉమియక వామహస్తముతో మేఢ్రమును పట్టుకొని.

## —※ శౌచవిధిః. ※—

పందికొక్కు త్రవ్వినమట్టిని పుట్టమట్టిని మార్గోత్థమగు మట్టిని విడిచి పూర్వమెత్తుకొనివచ్చిన శౌచయోగ్యమగు మట్టిని కుడిహస్తముతోనెత్తి శౌచముచేసికొనవలయు వాపీకూపతటాకాదులయందు బైటనుండు మృత్తిక నెత్తుకొనక మణికట్టుకులోపలనుండు మంటిని నెత్తుకొనవలయు. మలమూత్రములు విసర్జించక ముందుమృత్తికను సంపాదించుకొనక మలమూత్రములను

విసర్జించిన పిదప మంటిని గ్రహించెడు మూఢుడు కట్టువస్త్రముతో స్నానము జేయవలెను. మృత్తికదొరకనియెడల యిసుకతో జేసుకొనవలయు. మూత్రశౌచమునకు లింగమునకునొకతూరి మృత్తికనుంచికడుగవలయు. వామహస్తమునకు మూడుమారులు మంటినుంచికడుగవలయు. రెండుహస్తములకు రెండుమారులు మంటినుంచి కడుగుకొనవలయు. మలవిసర్జనముచేసినపుడు మలవిసర్జనమునకు ముందుగా శౌచము జేసికొని పిదప మూత్రశౌచము చేయవలయు ననంతరము పాదశౌచము చేసికొని తదనంతరము హస్తము శౌచము చేయవలయు. ఐదుమారులు అపానమునకు పదిమారులువామహస్తమునకు ఏడు ఆవర్తులు రెండు హస్తములకును జెప్పబడియున్నది. ఇట్లుగృహస్థుడాచరించవలయు, నింతకు రెండింతలు బ్రహ్మచారియు మూడింతలు వానప్రస్థుడును, నాల్గింతలు యతియు ననుష్ఠింపవలయు మధ్యాహ్న కాలమున నీప్రకారమే జరిగించవలయు రాత్రికాలమందు నిందున అర్ధమే చాలును.*

అశక్తునికి యథాశక్తిశౌచముచెప్పబడియున్నది స్త్రీశూద్రులకు అర్ధమే చెప్పబడియున్నది. మనస్సుకు శుద్ధితో చెడువరకు శౌచముచేసికొనవచ్చును పుణ్యతీర్థములయందు శౌచము జేయగూడదు. బ్రహ్మచారి యతి అంతర్లింగ విశోధనము జేయగూడదు ఒకవేళచేసెనేని చాంద్రాయణము చేయవలయు నాభికి క్రింద సకలమును వామహస్తముచే కడుగుకొన వలయును. ఆచమ

---

* పితామహస్తు సనత్కుమారాద్యైవ మాహ—"తతః పూర్వం సముత్థాయ ప్రాచీమేవోపనిష్క్రమేత్ । ఉదీచీంప్రాగుదీచీంవాశౌచంవాదక్షిణాందిశం ॥ యత్రోదకం ప్రభూతంతు తద్గత్వా శౌచమాచరేత్" అనియు "దేశం కాలంతథాజ్ఞానందివ్యద్రవ్యం ప్రయోజనం । ఉపపత్తిమవస్థాంచజ్ఞాత్వా శౌచంసమాచరేత్" అనిదేశకాలాదులచే శౌచాదులువేరువేరుగాభిన్నపడియున్నవనిచెప్పబడియున్నది. "అహ్నాయచ్చౌచముద్దిష్టంనిశార్ధంతుతతోభవేత్ । పథి పాదస్తతః ప్రోక్తోయథాశక్త్యాతురస్యతు" అనిమధ్యాహ్నశౌచమునకంటె రాత్రికాలమునందునర్ధమును మార్గమునందు పాదమును ఆతురునికి యథాశక్తియును శౌచముచేయునటులచెప్పియున్నది.

నాది సర్వము దక్షిణహస్తముతో చేసికొనవలయును జ్ఞాపకములేక ఉపవీతము కుడిచెవిని ధరించుకొనక మలమూత్రముల విసర్జనంచేసినేని ఆసూత్రమును పరిత్యజించి నూతన పవిత్రమును ధరించుకొనవలయు. ఉదకపాత్రచేత నుంచుకొని మలమూత్ర విసర్జనము చేయకూడదు తెలియక చేసినయెడల సచేల స్నానముచేయవలయు. ఉదకపాత్రమునుచేత నుంచుకొనిమూత్రపురీషవిసర్జనముచేసెనేని ఆయుదకము మూత్ర తుల్యమనియు మఱియు నాయుదకమును పానము చేసెనేని చాంద్రాయణముచేయవలయుననియుచెప్పబడియున్నది. ఏ స్థానమునందు శౌచము చేసుకొనుచున్నారో అచ్చటనే జలముచే చక్కగా గడుగుకొని యాస్థానమును జలమునుంచి శుద్ధిపరచవలయు కచ్ఛమును శిఖను గట్టుకొని విధిప్రకారము ఆచమనముచేయవలయు.

—ఆచమనక్రమము.—

మలమూత్ర రేతస్సులను విడచినప్పుడును భోజనా నంతరమును క్రమముగా నాలుగు యెనిమిది పండ్రెండు పదియారు మారులు గండూషము చేసినయెడల శుద్ధిగలుగుచున్నది విప్రుని దక్షిణ భాగమునందు నిత్యము దేవతలుండుటవలన తూర్పు ముఖముగా గూర్చుండి గండూషమును తన వామపార్శ్వమునం దుమియవలయును. ఈప్రకారముచేసి ఉపవీతమునుచక్కగాధరించుకొని కర్మాద్యంతములయందు శుద్ధ్యర్థముగా తూర్పు ఉత్తర ముఖముగా ఆచమనము చేయవలయు తెలియక మోహముచే పశ్చిమముఖముగా ఆచమనముచేసెనేని పునః ఆచమనముచేయ శుద్ధిగలుగును. మఱియు తెలియక దక్షిణాభిముఖముగా ఆచమనముచేసెనేని పునః స్నానముచేయుటచే శుద్ధిగలుగును స్నానభోజన పానమునందు ఆదియందొక మారును పిమ్మట రెండు మారులును ఆచమనముచేయవలెను. దానప్రతిగ్రహములుచేయునపుడును సాయంసంధ్యావందన బలికర్మములందును ఆదిలో రెండు పర్యాయములును అంత్యమునందొక మారును ఆచమనము చేయవలయు. పాదశౌచాదులు చేయక శిఖ ముడివేయక యజ్ఞోపవీతము సవరణ చేయక ఆచమనము చేసెనేని అశుచి యగును. అంగుష్ఠ కనిష్ఠలనగా బొటన వ్రేలు చిటికిన వ్రేళ్లనువదలి దక్షిణ హస్తమును గోకర్ణాకృతిగానొనర్చుకొని యుద్దుగింజమునుగునంతతీర్థమును పానముచేయు

వలయు. హోమాదిక్రియలు దక్షిణ హస్తముచే జేయవలయుగాన నావా స్తతలం బేమేక్రియల యందెట్లు పయోగించ వలయునో దానినిందు వివరింప బడునది బ్రాహ్మమనియు ప్రాజాపత్యమనియు పైతృక మనియు దైవతమని యు నలు తెరంగుల అంగుష్ఠమూలము బ్రాహ్మ్యమనియు కనిష్ఠమూలము ప్రా జాపత్యమనియు ప్రాదేశిని పైతృకమనియు శరాగ్రమును దైవత మనియుజె ప్పబడును.

— అంగన్యాస కరన్యాస క్రమము. —

జానువులకు క్రిందుగా జలమునందుప విష్టుడై కేశవాది నామములచే క్రమముగా మూడుమారులు తీర్థమును* స్వీకరించి యంగుళములచే బుద్బుదాది దోషములు లేనిజలమును స్పృశించి శిరస్సున ప్రోక్షించుకొనవలయు. పిదపజ లముచే ప్రతిఇంద్రియము స్పృశించవలయు; నెట్లనిన, బొటన దర్భ వ్రేళ్లజల ముచే చక్షువుల స్పృశించవలయు. బొటన జుట్టన వ్రేళ్ల జలముచే ఘ్రాణముల స్పృశించవలయు బొటన చిటికిన వ్రేళ్ల జలముచే శ్రవణములస్పృశించవలయు బొటన నడిమివ్రేళ్ల జలముచే బాహుమూలములస్పృశించవలయును. అంగుళ్య గ్రములచే నాభిని శిరస్సును స్పృశించవలయు.*

*శుచియైన ప్రదేశమునందుకుక్కుటాసనముగా గూర్చుండిదక్షిణ బాహువును జానువులోగానుంచుకొని తూర్పుముఖముగానైనను ఉత్తరము ఖముగానయినను గూర్చుండి దక్షిణహస్తతలమును గోకర్ణాకారముగా చే సుకొని వామహస్తముచే జలమును స్పృశించుచు దేవతీర్థముచే జలము నెత్తి ఉద్ధుగించ మునుగునంత తీర్థమును నిశ్శబ్దముగా అచ్యుతాయ నమః అనంతాయనమః, గోవిందాయనమః, అని ముమ్మారు ఆచమనముచేసి ముఖ మును తుడుచుకొని జలమును స్పృశించి కేశవాయనమః, అని అంగుష్ఠముచే దక్షిణకపోలమును, నారాయణాయనమః, అని అంగుష్ఠముచే వామకపోల మును మాధవాయనమః, అని అంగుష్ఠ అనామికలతో దక్షిణ నేత్రమును గోవిందాయనమః, అనివామనేత్రమును, విష్ణవేనమః, అనిఅంగుష్ఠతర్జనీలచేదక్షి ణనాసికను మధుసూదనాయనమః, అనివామనాసికను త్రివిక్రమాయనమః, అని అంగుష్ఠకనిష్ఠలతో దక్షిణ శ్రోత్రమును వామనాయనమః, అని వామశ్రోత్ర

## — దంతధావనక్రమము. —

*ఇట్లు క్రమముగా నాచమనముచేసికూర్చుండితూరుపుడుత్తరముగానైననీశాన్యాభిముఖముగానయిననుకుడిచేతినిపైకెత్తిజానువుకులోపలఉంచుకొనిదీనినిచక్కగాశోధించవలయును "శిరీషార్జునకారాచిరుబిల్వవేతసఖాదిరఔదుంబరఅపామార్గక్షీరవృక్షాగ్ర" అనుముండ్లుపాలుగలవృక్షములయొక్కపండ్రెండుఅంగుళములనిడువుగలకాష్ఠముచేతనైననుతృణపర్ణములచేతనయిననుపకాదశివినా జంబూనింబామ్రపత్రములచేతనయినా "ఆయుర్బలం యశో వర్చః ప్రజాఃపశువసూనిచ । బ్రహ్మప్రజ్ఞాంచ మేధాంచ త్వన్నోదేహి వనస్పతే" ఈమంత్రమును అనుసంధించి ప్రదక్షిణముగా దంతధావనము చేయువలయు వ్యతీపాత సంకృతి పర్వకాల వైధృతి విషువత్ పుణ్యకాలముల యందు దంతకాష్ఠమునువదలవలెను దంతకాష్ఠముదొరకనియెడలను నిషిద్ధదినములయందును పండ్రెండుమారులు జలముచే గండూషము చేసినట్లయితే ముఖశుద్ధికలుగుచున్నది.

---

మును శ్రీధరాయ నమః అని అంగుష్ఠ మధ్యముతో దక్షిణ భుజ మూలమును హృషీకేశాయనమః, అని వామభుజ మూలమును పద్మనాభాయ నమః, అని కేవలాంగుష్ఠముచే నాభితలమును హృదయమును దామోదరాయనమః, అని సర్వాంగుళములచే మూర్ధ్ని యందును ఇట్లు ప్రతి అంగములను ఉదక స్పర్శ పూర్వకముగా స్పర్శించ వలయునని చెప్పియుండినందున యథాసంప్రదాయ మనుష్ఠించవలయును.

* నారాయణమునిభిః— తీర్థంసంశోధ్యసంక్షాళ్య పాదావాచమ్య వాగ్యతః ! తృణైర్వా శాస్త్ర సంసిద్ధై ర్వటార్క ఖదిరాదిభిః ॥ దంతాన్ సంశోధ్యనిర్లిఖ్య జిహ్వాంగండూషయేన్ముహుః ॥ అనిసాయించియున్నది. దంతకాష్ఠముదొరకనియెడలను నిషేధ దినములయందును "అపాం ద్వాదశగండూషైర్ముఖశుద్ధి ర్భవిష్యతి॥" అనిపండ్రెండావర్తులుగండూషముచేసినట్లయితే ముఖశుద్ధికలుగుచున్నదని చెప్పియున్నది. "ప్రతిపత్పర్వ షష్ఠీషు చతుర్దశ్యష్టమీషుచ । దంతానాం కాష్ఠ సంయోగో దహత్యా సప్తమం కులమ్ ॥" అని నిషేధ తిథులను చెప్పియున్నది.

—పవిత్ర ధారణక్రమము.—

పిమ్మట వస్త్రసంశోధనముచేసికొని ముఖప్రక్షాళనము చేసి నేత్ర పర్యంతము చక్కగా కడుగుకొని కేశవాదినామములచే ఆచమనముచేసికొని వ్యాహృతులతో క్రమప్రకారము మూడు ప్రాణాయామములుచేసి భగవద్భాగవతాచార్య కైంకర్యశుద్ధ్యర్థము భగవదాజ్ఞా ప్రకారము చేయుచు స్నానని కరమున పవిత్రము ధరించుకొనవలయును. ఆపవిత్రము దర్భచేనైనను సువర్ణముచేతనయిన నుండవచ్చును. పవిత్రము అంగుళ్యగ్రమునందు ధరించినట్లయితే ఆయుస్సు తగ్గును. అంగుళీయాదిలో ధరించినట్లయి శ్వేతపక్షియముకలుగును. అనామిక మధ్యమున పవిత్రముధరించు కొనవలయు. ఆపవిత్రి అగ్రము నాలుగు అంగుళములును ముడి యొకయంగుళమును రెండంగుళముల వలయమును కలిగియుండడము పవిత్రలక్షణము. దర్భ పవిత్రముతో కరాంగాచమనముచేయవలయును.

—*స్నానవిధిః.*—

*ప్రాతః స్నానములేకయే కార్యము చేయతగదు దైవపిత్ర్యములకు స్నానముచేయుటచే నధికారియగు.మలినకాయుడును నవచ్ఛిద్రసమన్వితుడును దివారాత్రులు నిద్రించువాడును ప్రాతఃస్నానము చేసినయడల పరిశుద్ధి సిద్ధించును బ్రహ్మ క్షత్రియ వైశ్యులు మంత్రోక్తముగా స్నానముచేయవలయు; స్త్రీ శూద్రులు మంత్రముచెప్పక స్నానముచేయవలయు స్నానము శక్త్యనుగుణముగా సప్తవిధములై యున్నది మనుః—"మంత్రం భౌమంతథాగ్నేయం వాయువ్యందివ్యమేవచ। వారుణం మానసంచైవ సప్తస్నానాన్యను క్రమాత్" అనిమంత్రస్నాన, భౌమస్నాన, ఆగ్నేయస్నాన, వాయవ్యస్నాన, దివ్యస్నాన, వారుణస్నాన. మానసస్నానములని స్నానము ఏడువిధములు "ఆపోహిష్ఠా మయోభువః" అను మంత్రానుసంధానముచేత నయిననుద్వయమం

*ప్రమాణాంతరమునందు. "భువిమూర్ధ్నితథాకాశెమూర్ధ్న్యాకాశెతథాభువి। ఆకాశే భువిమూర్ధ్నిస్యాన్మంత్రస్నానమితీరితం ॥" అనిఆపోహిష్ఠాదిమంత్రములచేతనైన, ద్వయోత్తరవాక్యముచేతనైన, పాదమూర్ధ్నిహృదయమునందును, మూర్ధ్నిహృదయపాదమందును, హృదయపాదమూరులయందును క్రమముగా తీర్థమును ప్రోక్షించుకొనుట మంత్రస్నానమనిచెప్పియున్నది.

త్రోత్తర వాక్యాను సంధానముచేతనయిన మజ్జన మాడుట మంత్ర స్నాన మనబడును. మృత్తులేపనము శరీరమందలదుకొనుట పార్థివస్నానము. **హోమ** మభస్మము దేహమునందు పూసుకొనుట ఆగ్నేయస్నానము. గోరజస్సునొడల లిప్తముసేయుట వాయవ్యస్నానము. ఆతపముచేత పుడగుట వర్షముచే దడియుట దివ్యస్నానమనబడును. జలములో నవగాహించుట వారుణస్నానము. శ్రీవిష్ణువామ పాదాంగుష్ఠ జనితగంగాతీర్థము స్వశరీరమునందును బ్రహ్మరంధ్రిద్వారాశరీరాంతర్వర్తిన్మై ప్రవహించునట్లు భావించుటమానస స్నానము. దేహదౌర్బల్యముచేతనైనను దేశవైషమ్యకాల వైషమ్యములచేతనైన నీసప్త స్నానములలో దేనినను ష్ఠించినను యవియన్నియు సమానములగు. గ్రహణసంక్రాంతి విషువాత్యయవృద్ధులయందు స్నానదానాదు లవశ్యకర్తవ్యములు, "సమస్తజగదాధార శంఖచక్రగదాధర । అనుజ్ఞాందేహి మేదేవయుష్మత్తీర్థనిషేవణే" యనిభగవదనుజ్ఞకొని అఘమర్షణ స్నానముజేయవలయు. అఘమర్షణ స్నానమెట్లనిన చతుశ్రమముగా తీర్థపీఠము నుల్లేఖించి యందు భగవంతుని యావాహనముచేసి "ఆవాహయామిత్వాందేవి స్నానార్థ మగసుందరి। ఏహిగంగే నమస్తుభ్యంసర్వతీర్థసమన్వితే" యనునట్లు భగవంతుని వామాంగుష్ఠనిర్యాతగంగనుధ్యానించి "ఇమేగంగాం" అనిసర్వతీర్థము లను స్మరించి "విష్ణువామపదాంగుష్ఠ నఖస్రోతోవినిస్సృతే । తద్భక్తివిఘ్నరూపాత్వాం గేమాంమోచయైనసా" యనునట్లు శ్రీవిష్ణువామ పాదాంగుష్ఠ నఖమునజనించినయోగంగా నన్నుతరింపజేయుమని యంజలిజేసి అర్ఘ్యము నిచ్చు సమయమందు ప్రవాహమున కభిముఖముగను అన్యస్థలంబులు సూర్యుని కభిముఖముగనిలిచి నీటిలోమునిగి (అఘమర్షణ సూత్రము) మూలమంత్రము మంత్రరత్న

---

"అనంతాదిత్య సంకాశా వాసుదేవం చతుర్భుజం । శంఖచక్రగదాపద్మధారిణం వనమాలినం । శ్యామలం శాంత హృదయంప్రసన్నముఖపంకజం । దివ్యచందనలిప్తాంగంచారుహీనం శుభేక్షణం।హారకేయూర మకుటకుండలైరుపశోభితం । శ్రీవత్సవక్షసంశ్రీశమనంతం గరుడధ్వజం। ధ్వజ వజ్రాంకుశాబ్జాదిశంఖాంకిత పదద్వయం । తత్పాదపద్మజాంగంగాంనిపతంతీంస్వమూర్ధని।చింతయేద్బ్రహ్మరంధ్రేణప్రవిశంతంస్వకాంతినుం। తయాసంక్షాళితంధ్యాయేద్బాహ్యమాభ్యంతరంమలం । ఇత్యుక్తం మానసస్నానం సర్వస్నానాదికంపరమ్."

ములననుసంధించుచు స్నానముచేసి దక్షిణహస్తముతో జలమునెత్తిముమ్మారు మూలమంత్రముచే నభిమంత్రించి ప్రాగంజలిచే జలమునెత్తి విష్ణుపాదక్షాళిత గంగగాను విరజాతీర్థముగను, సరిద్వరకావేరి చంద్రపుష్కరిణీ స్వాచార్య భాగవత పాదోదకములుగా భావించి ముమ్మారాతీర్థమును శిరస్సున ప్రోక్షించుకొని దశ ద్వాదశ షోడశ అష్టావింశతిమార్లు మూలమంత్రమంత్రరత్నముల జపించుచు నవగాహనము చేయునపుడు ముమ్మారు జలములో మునిగిలేచి రెండాచమనములు చేయవలయు మరియు స్నానములు కంఠస్నాన కటిస్నానకాపిల స్నానములని మూడువిధములుగలవు. క్రమప్రకారముస్నానము సేయ శక్తిలేయానివారుదిగువ వివరింపబడియున్న స్నానములలోదేనినయినను చేయవచ్చును, కంఠముమొదలు పాదాంతమువరకు జలములో నవగాహించుట కంఠస్నానమనియు, కటిప్రదేశము మొదలు పాదాంతను వరకుజేయునది కటిస్నానమనియు, తడి వస్త్రముతో సకలావయవములను తుడిచిపరిశుద్ధి యగుట కాపిలస్నానమనియు చెప్పబడియున్నది.

—*తర్పణక్రమము.*—

స్నానానంతరముజలముతోనూర్ధ్వపుండ్రములధరించి దేవఋషిపితృతర్ప

పారమేశ్వరసంహితయందు "వినావివిధసంపక్తైః పంచాంగ స్నానమాచరేత్ । ముఖంకరద్వయో పేతంపా దౌకటితటావధి" అని పంచాంగస్నానము చెప్పియున్నది.

"స్త్రీసంగాద్యు పఘాతేషు స్నానం కుర్యాద్యథావిధి" అనిచెప్పియున్నది. శీతోదకస్నానము చేయుటకసమర్థులైనవారు ఉష్ణోదకస్నానముచేయవచ్చును—సప్తవిధ స్నానములలోవారివారిశక్త్యనుసారము చేయవచ్చును. "తీర్థంభాగవతం శుద్ధముపగచ్ఛేన్మహోహరం" అనియు "తత్తీర్థం సమాశ్రిత్యశుద్ధం భాగవతాశ్రితం" అనియు "జలంశుద్ధమ శుద్ధంవా । విష్ణువాస్తుసమీపతేః । విష్ణుగంగా సమంతీర్థం । మహాపాతకనాశనం । భవద్విధా భాగవతాస్తీర్థభూతాస్స్వయంప్రభో । తీర్థీకుర్వంతితీర్థాని । స్వాంతస్థేనగదాభృతా । యేభజంతి జగద్యోనిం । వాసుదేవ మనీశ్వరం । నతేభ్యోవిద్యతే తీర్థం అధికంరాజసత్తమ।యత్రభాగవతాస్నానం కుర్వంతి విమలాశయాః । తత్తీర్థమధికం విద్ధిసర్వపాపప్రణాశనం" అనిచెప్పియున్నది.

ణముల సేయవలయు "పూర్వంచాభిముఖో దేవాన్ ఉత్తరాభి ముఖో ఋషీన్ । దక్షిణాభి ముఖోపితౄన్ జలమధ్యేతు తర్పయేత్" అనుప్రకారను జలముతో తూర్పుముఖముగా దేవతలకును, ఉత్తరాభిముఖముగా ఋషులకును, దక్షిణాభిముఖముగా పితృవులకునుతర్పణము చేయవలయు "యేకే చాస్మత్కులేజాతా । యేచాస్యే గోత్రిణో మృతాః । తేగృహ్ణాం తుమయా దత్తం । వస్త్రనిష్పీడనోదకం" అని వస్త్రనిష్పీడనము పరిశుద్ధమైన భూమి యందు చేయవలయు ఈప్రకారముగా నాతీర్థముచే దేవఋషి పితృవులను భగవదాత్మకముగా ధ్యానించి తర్పణముచేసి తీర్థమును చక్కగాశోధించి శిఖోదకము జారనివ్వక దక్షిణాభి ముఖముగా తడివస్త్రమును నిష్పీడనము చేయవలయునని యొకపక్షము.—శ్రీవిష్ణుపురాణే. "శుచివస్త్రధరః స్నాతః। దేవర్షిపితృతర్పణం । తేషామే వహితీర్థేన కుర్వీత సుసమాహితః" అన్యత్రాపి "ధృతోర్ధ్వపుండ్రో దేవర్షీన్ । పితౄన్ సంతర్ప్యమంత్రితః" ఇత్యాది వచనములచే ఊర్ధ్వపుండ్రమును ధరించుకొని ఆయామంత్రములచే దేవ ఋషి పితృతర్పణము జేయవలయు.

—శుక్లవస్త్ర ధారణ క్రమము.—

అనంతరము ఆచమనముచేసి తీరమునకువచ్చి శుక్లవస్త్రముచే దక్షిణముఖముగానుండి అంగమును తుడుచుకొని అనంతరము హస్తముచే జలమెత్తి వ్యాహృతులచేతను మూల మంత్రముచేతను కటిసూత్ర కౌపీనశుక్లవస్త్ర ద్వయములను ప్రోక్షించి "దేవస త్వేతి" అని వస్త్రముల నెత్తుకొని "ఉదత్య" మని సూర్యునికిచూపి "అవధూత" మని విదిలించి "ఆవహ" యనిధరించుకొని స్నానవస్త్రమును పొడవుగ నెత్తుకొని తీరము నందుంచవలయు.

—ఊర్ధ్వపుండ్ర ధారణ క్రమము—

కటిసూత్రకౌపీన శుక్లవస్త్ర ద్వయమును ధరించుకొని పాదప్రక్షాళనము చేసికొని ఆచమనముచేసి శుద్ధపాత్రమునందు జలము నెత్తుకొనివచ్చి శ్రీమతే నారాయణాయనమః యని ఉత్తర వాక్యమను సంధించి యొక శుచియగు ప్రదేశమునందు కొంచెము తీర్థము ప్రోక్షించి మెత్తుగల పీటమీదతిరుమణి పెట్టెను వెంచేపుచేసి తగ్గయిన శుద్ధాసనముపై పద్మాసనుడైతూరుపు ముఖముగా గాని ఉత్తర ముఖముగా గాని తాను కూర్చుని హస్తప్ర

క్షాళనము చేసికొని మూడుమారులు చప్పట్లుతట్టి తిరుమణి పెట్టెను విచ్చిస్వర్ణ రజతాదులతో చేయబడిన ఉద్ధరణి గోకర్ణము లందైనను ముఖ్యముగానారికేళ ఉద్ధరణి గోకర్ణము లందైనను జలమును పూరించి "శ్రీరంగేయా దవాద్రౌచ" అనుప్రకారము కోవిల తిరునారాయణ పురము మొదలగు దివ్యదేశము లందుండు పరిశుద్ధమైన శ్వేత వృత్తికచే చేయబడిన తిరుమణి కోవును తనవామహస్తమునందునిచిదక్షిణహస్తముతో మూంసీ "శ్రీభూదేవ్యై నమః" యని అభిమంత్రించి గోకర్ణమునందుండు తీర్థమును కుడిహస్తముచే నెత్తిఎడమ హస్తమునందు నిచి తిరుమణి చేర్చుచు కాంస్యములచే లలాటమును చూచుకొనుచు నఖములచే తప్ప అంగుళీయములతోగాని స్వర్ణ రజత తులసీ కాష్ఠాదులచే చేయబడిన పుల్లలచేగాని కేశవాది ద్వాదశ స్థానము లందు వృత్తముగాను బద్ధాగ్రముగాను విచ్ఛిన్న మూలముగాను పాదము లేకను విరూపముగాను అపసవ్యముగాను ఉంచుకొనక సుస్పష్టముగాను మిక్కిలి మనోహరముగాను ఊర్ధ్వపుండ్రము శ్రీహరి చరణద్వయాకృతిగా తిరుమణి శ్రీచూర్ణము ధరించు కొనవలయు. పాద్మపురాణము నందు చెప్పినప్రకారము.— కేశవా యనమః యని లలాటమందును; నారాయణాయనమః యని కుక్షియందును; మాధవాయనమః యని వక్షమందును; గోవిందాయనమః యని కంఠమందును;* విష్ణవేనమఃయనిదక్షిణకుక్షియందును; మధుసూదనాయనమఃయని

---

*పాద్మపురాణే.— యస్మిన్ కస్మిన్ మహాభాగా వైష్ణవా ధారయంతిహి । తస్మిన్ వైవృత్తి కాగ్రాహ్యా శుభ్రాం రమ్యాంసునిర్మలం । అంతరాళం ద్వ్యంగుళం స్యాత్ పార్శ్వ మంగుళ మాత్రకం । మృదా శుభ్రేణవిలిఖేత్పుండ్రం మృదుతరం । శుభం లలాటె కేశవం ధ్యాయేన్నారాయణమథోదరే।వక్షస్థలే మాధవంతు గోవిందం కంఠకూబరే।విష్ణుంచదక్షిణేకుక్షౌ వామాంసే మధుసూదనం । త్రివిక్రమంసకంధదేశేవామనంవామపార్శ్వకే। శ్రీధరంసవ్యబాహౌతు హృషీకేశంతు కంధరే ।పృష్ఠేతు పద్మనాభం స్యాత్ గ్రీవాదామోదరం న్యసేత్ । తత్ప్రక్షాళన తోయేన వాసుదేవేతి మూర్ధని । లలాటెభుజ యుగ్మేతు పృష్ఠకే కంఠ కూబరే । ధారయే దూర్ధ్వపుండ్రాణివ

దక్షిణభుజమందును; త్రివిక్రమాయనమః యని దక్షిణకంఠమందును; వామనాయనమః యనివామకుక్షియందును; శ్రీధరాయనమః యనివామభుజమందును; హృషీకేశాయనమః యని వామమూపునను; పద్మనాభాయనమః యని పృష్ఠభాగమునను; దామోదరాయనమః యని మెడయందును; ఈప్రకారమనుసంధానముచేయుచు "కృత్వాకరండ బిల్వంచ" అనుప్రకారము బిల్వకాయయందుండు విష్ణ్వర్పితమగు రక్తవర్ణ హరిద్రాచూర్ణమగు శ్రీచూర్ణమును ఎడమహస్తమునందునిచి జలముంచి చేర్చి, శ్రీదేవ్యైనమః యని లలాటమందును; అమృతోద్భవాయైనమః యనిగర్భమందును; కమలాయైనమః యని వక్షమునను; చన్ద్రశోభిన్యైనమః యని కంఠమునందును; విష్ణుపత్న్యైనమః యని నాభికి కుడిభాగమునందును; వైష్ణవ్యైనమః యని కుడిభుజమందును; వరారోహాయైనమః యని కుడిమూపునను; హరివల్లభాయైనమః యని నాభికి ఎడమభాగమందును; శార్ఙిణ్యైనమః యని ఎడమ భుజమందును; శ్రీదేవదేవ్యైనమఃయనిఎడమమూపునను; శ్రీమహాలక్ష్మ్యైనమః యనిపృష్ఠభాగమునను; లోకసుందర్యైనమఃయని మెడయందును. ఇట్లు క్రమప్రకారము అనుసంధించుచు "ఓంనమఃకేశవా దీనామర్థం ధ్యాయన్ చతుర్ముఖ । ధృత్వా దామోదరాంతం వై శేషంతుశిరసిన్యసేత్" అని ఓరుమణి శ్రీచూర్ణములు రెంటిని కేశవాదిదామోదరాంతముగ పండ్రెండు స్థానముల యందును ఆకేశవాది మంత్రములఅర్థములను స్మరించుచు నుంచుకొనవలయు; నందు నవకాశములేనియెడల ఆద్యంతములగు లలాటమందును మెడయందును ఉంచుకొని పిమ్మట చెయికడగకనిలచిన శేషమును భూమియందు చిందకుండునటుల రెండుహస్తములనుచేర్చి శిరస్సున వ్రాసుకొనవలయు.

---

తురంగుళ మాయతం । కుక్షౌతత్ప్రాగ్వయోః ప్రోక్తమాయతంతుదశాంగుళం । బాహూర్వక్షస్థలే పుణ్డ్రమష్టాంగుళముదాహృతం । ఏవంద్వాదశపుండ్రాణి । బ్రాహ్మణ స్సతతం ధరేత్ । తత్తత్పుండ్రేషు తన్మూర్తిం ధ్యాత్వా మంత్రేణ ధారయేత్ । అంతరాశేషసర్వేషు హారిద్రాం ధారయేత్ శ్రియం తస్మాచ్ఛిద్రాన్వితం పుండ్రంస హరిద్రం శుభావహం । ధారయేద్బ్రాహ్మణో నిత్యం హరిసాలోక్య సిద్ధయే.

పిమ్మట కేశవాది మూర్తులను పిరాట్టిమార్లతో ఆయాస్థానముల యం దుఅంజలి పూర్వకముగా ధ్యానించి "ధృత్వాకంఠే స్వశిరసి పవిత్రంవిష్ణు ధారితమ్ । శ్రీకృష్ణతులసీకాష్ఠ మణిమాలాంగళేతథా । సహపద్మాక్ష మా లాంచ ముక్తాహారాదికంశుచి। శిఖాయాంవిష్ణునిర్మాల్యామ్ । చందనాద్యనులే పనం । అహర్నిశంధారయతో । నపునర్జననమ్ భవేత్ ॥ పునః ప్రక్షాళ్య హస్తౌతునాళికేరాఖ్యమాత్రుకే । గంగాగతంతు వృత్తోయం । పాదతీర్థ స్యవృత్తికాం । విష్ణుపాదోదకం తద్వత్ । గురుపాదోదకంతథా । గురుసా ద్యాది తీర్థంతు । భజేత్ జ్ఞానాత్మశుద్ధయే ॥ పునస్తత్పేటికాంబద్ధ్వా । జపే ద్గురు పరంపరామ్ । మూలమంత్రం మంత్రరత్నం । చరమశ్లోక పంచకం। శ్రీమద్వారాహచరమంశ్రీకృష్ణచరమంతథా । శ్రీరామచరమంతద్వత్ । శ్రీరంగ చరమంతథా। సుదర్శనాఖ్యంచరమంసకృద్ధ్యాయన్ తతోజపేత్ ॥అనిపెరుమా ళ్లకు సమర్పించినపవిత్రములను కంఠమునందు శిరస్సున ధరించుకొని శ్రీకృష్ణతు ళసీ కాష్ఠమణిమాలను పద్మాక్షమాలతోధరించుకొని, శుచియైన ముత్యాల హారాదులనుధరించుకొని,ముందుదినముపెరుమాళ్లకుసమర్పించినపుష్పాదులను శిఖనుధరించుకొనిచందనాదులనుబూసుకొని, అహర్నిశముండువారికి పునర్జన్మ ములేదు. "ఏవంమచ్చరణ ద్వంద్వం చందనే ప్రతిబింబితం । సేవ్యంప్రపన్నై ర్మద్భక్తైస్తథాలక్ష్మీర్మమప్రియా । మద్భక్తా మత్పదానిత్యంమద్వక్షస్థలవాసి నీ । జననీప్రాణభూతా స్యచందనేప్రతిబింబితా । సర్వైః ప్రపన్నైస్సంసేవ్యా మద్భక్తైర్నియతైస్సదా" అనిచెప్పబడినప్రకారముపెరుమాళ్లుపిరాట్టిమారుల అభయహస్తములనుతిరువడిచిహ్నములనుతనయాచార్యునిశ్రీపాదుకలనుశిరస్సు నధరించుకొని కరములు మొగిడ్చిలలాటాది పండ్రెండుస్థానములందు కేశవాది ద్వాదశ నామములుగాని (౧) ఊర్ధ్వపుండ్ర ధ్యానశ్లోకములుగాని అనుసం ధానముచేయుచు ఆయాస్థానముల యందంజలిచేసి, శ్రుతియందు "ఆచార్యా

(౧)—లలాటే సతతం దేవ్యా శ్రియాసహ విరాజితం । చతుశ్చక్రం నమస్యామికేశవం కనకప్రభం ॥

అమృతోద్భవ యాదేవ్యాస మాశ్లిష్ట మథోదరే । నారాయణం ఘన శ్యామం చతుశ్శంఖన్నమామ్యహం॥

ణామసావసావిత్ర్యాంభగవత్తః" । అనువచనప్రకారము తన యాచార్యునిచే ప్రసాదింపబడిన (౧) వాక్య గురుపరంపరయగు పదుమూడు వాక్యములను,

నిత్యంకమల యాశ్లిష్టంహృదయేహం దయాంబుధిం । మాధవంమణి భృంగాభంచింతయామిచతుర్గదం॥

దేవ్యాచచంద్రశోభిన్యాదేవం కంఠేవిరాజితం । చంద్రహాసంచతుశ్శా ర్ఙ్గంగోవిందమభిసంశ్రయే॥

విష్ణుపత్న్యాఖ్యయాదేవ్యా కుక్షౌ దక్షిణపార్శ్వకే । విష్ణుంచతుర్హా లంవందేపద్మకింజల్కసన్నిభం॥

వైష్ణవీసంజ్ఞయా దేవ్యాకలితం దక్షిణేభుజే । చతుర్ముసలమబ్జాభం సంశ్రయేమధుసూదనం॥

దక్షిణాంశేదయావార్ధింవరారోహాధిపంప్రభుం।అగ్నివర్ణంచతుఃఖడ్గం భావయామిత్రివిక్రమం॥

హరిప్రియాపతింకుక్షి వామపార్శ్వస్థపుండ్రకం । వామనం బాలసూ ర్యాభం చతుర్వజ్రంవిభావయే॥

వామబాహౌమహాబాహుంశార్ఙ్గిణంపతిమవ్యయం । శ్రీధరం పుండరీ కాభంచతుఃపట్టసమాశ్రయే॥

దేవదేవికయాదేవ్యా శ్రితంవామాంససంశ్రితం । చతుర్ముద్గరమభ్యేమి హృషీకేశం తటిత్ప్రభం॥

పృష్ఠేసుహృదయాదేవ్యామహాలక్ష్మ్యావిరాజితం । పంచాయుధంపద్మ నాభం నమస్యామ్యర్కరోచిషం॥

సదాకకుద్గతంలోక సుందరీపతిమవ్యయం । దామోదరం చతుష్పాశం ఇంద్రగోపనిభంభజే॥

(౧)వాక్యగురుపరంపర—అస్మద్గురుభ్యోనమః॥అస్మత్ పరమగురుభ్యో నమః ॥ అస్మత్ సర్వగురుభ్యోనమః ॥ శ్రీమతేరామానుజాయనమః॥ శ్రీపరాంకుశదాసాయనమః ॥ శ్రీమద్యామునమునయేనమః ॥ శ్రీరామమిశ్రాయనమః॥ శ్రీపుండరీకాక్షాయనమః॥శ్రీమన్నాథమునయేనమః॥ శ్రీమతేశఠకోపాయనమః॥ శ్రీమతేవిష్వక్సేనాయనమః ॥ శ్రీయైనమః ॥ శ్రీధరాయనమః ॥

(౩)కూరత్తాళ్వార్ సాయించిన శ్లోకగురుపరంపరయు.(౪) తిరుమంత్రం (౫) ద్వయం(౬)చరమశ్లోకముననుసంధించి "ఆచార్యవాన్ పురుషోవేద" అనేశ్రుతి వాక్యప్రకారము తనయాచార్యుడు చేసినయుపకారములనుచింతించి "సదాచార్యవంశో జ్ఞేయః" అనువచనప్రకారము తమయాచార్యవంశపరంపరతనయలు ప్రారంభించి స్వాచార్యపర్యంతమైన తనయలను (౭) మణవాళ మహామునులు మొదలు పెరియపెరుమాళ్లు పర్యంతమగు తనయల ననుసంధించవలయు.

(౩)కూరత్తాళ్వార్ సాయించినశ్లోకగురు పరంపర—శ్లో॥అస్మద్దేశిక మస్మదీయపరమాచార్యానశేషాన్ గురూన్, శ్రీమల్లక్ష్మణయోగిపుంగవమహాపూర్ణం మునిం యామునం। రామం పద్మవిలోచనం మునివరం నాథ శఠద్వేషిణం। సేనేశంశ్రియమిందిరా సహచరంనారాయణంసంశ్రయే॥

(౪)తిరుమంత్రం—ఓంనమోనారాయణాయ॥

(౫)ద్వయం—శ్రీమన్నారాయణచరణౌశరణంప్రపద్యే,శ్రీమతేనారాయణాయనమః॥

(౬)చరమశ్లోకం — సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకంశరణంవ్రజ। అహంత్వాసర్వపాపేభ్యో మోక్షయిష్యామిమాశుచః॥

(౭)మణవాళమహామునుల తనయ—శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవం। యతీంద్రప్రవణంవందే రమ్యజామాతరంమునిం॥

తిరువాయిమొళిప్పిళ్లతనయ—నమశ్శ్రీశైలనాథాయకుంతీనగరజన్మనే। ప్రసాదలబ్ధపరమప్రాప్యకైంకర్య శాలినే॥

పిళ్లలోకాచార్యుల తనయ—లోకాచార్యాయ గురవే కృష్ణపాదస్య సూనవే। సంసారభోగిసందష్టజీవజీవాతవేనమః॥

వడక్కు-తిరువీధి పిళ్ల తనయ—శ్రీకృష్ణపాద పాదాబ్జే నమామిశిరసా సదా। యత్ప్రసాదప్రభావేనసర్వసిద్ధి రభూన్మమ॥

నంబిళ్ల తనయ—వేదాంతవేద్యామృతవారిరాశేర్వేదార్థసారామృతపూరమగ్ర్యం। ఆదాయవర్షంతమహంప్రపద్యే కారుణ్యపూర్ణంకలివైరిదాసం॥

నంజీయర్ తనయ— నమో వేదాంత వేద్యాయ జగన్మంగళహేతవే। యస్యవాగమృతాసారపూరితంభువనత్రయం॥

పిమ్మట హస్తములను శోధించుకొని గంగలోనుండు మృత్తికచే చేయబడినతీర్థ వడి లేక శ్రీపాద తీర్థముచే చేయబడిన తీర్థవడి పెరుమాళ్లతీర్థము ఆచార్య శ్రీపాదతీర్థము, భాగవత శ్రీపాదతీర్థములను, గురుపరంపర మూలమంత్ర

---

భట్టర్ తనయ—శ్రీపరాశరభట్టార్యశ్శ్రీరంగేశపురోహితః। శ్రీవత్సాంకసుతశ్శ్రీమాన్ శ్రేయసే మేస్తుభూయసే ॥

ఎంబార్ తనయ—రామానుజపదచ్ఛాయా గోవిందాహ్వానపాయినీ। తదాయత్తస్వరూపానా జీయాన్మద్విశ్రమస్థలీ॥

ఎంబెరుమానార్లతనయ—యోనిత్యమచ్యుత పదాంబుజ యుగ్మరుక్మ వ్యామోహిత స్తదితరాణి తృణాయమేనే। అస్మద్గురోర్భగవ తోస్యదయైక సింధోరామానుజస్యచరణౌశరణం ప్రపద్యే॥

పెరియనంబితనయ— కమలా పతి కల్యాణ గుణామృత నిషేవణం। పూర్ణకామాయ సతతంపూర్ణాయ మహతేనమః ॥

శ్రీయాళవందార్ తనయ—యత్పదాంభోరుహ ధ్యాన విధ్వస్తా శేష కల్మషః। వస్తుతాముపయాతోహంయామునేయనంనమామితం ॥

మణక్కాల్నంబితనయ— ఆయత్నతోయామునమాత్మదాసమళర్క పత్రార్పణనిష్క్రయేణ। యఃక్రీతవానాస్థితయావరాజ్యంనమామితంరామమ మేయసత్వం॥

ఉయ్యక్కొండార్ తనయ—నమఃపంకజనేత్రాయ నాథశ్రీపాదపంకజే। న్యస్తసర్వభరాయాస్మత్కులనాథాయధీమహే॥

శ్రీమన్నాథమునులతనయ—నమోచింత్యాద్భుతక్లిష్ట జ్ఞాన వైరాగ్య రాశయే। నాథాయమునయేగాధ భగవద్భక్తిసింధవే ॥

నమ్మాళ్వార్ తనయ—మాతాపితాయువతయ స్తనయావిభూతిస్సర్వం యదేవనియమేనమదన్వయానామ్। ఆద్యస్యనఃకులపతేర్వకుళాభిరామం శ్రీమత్తదంఘ్రియుగళం ప్రణమామిమూర్ధ్నా ॥

సేనమొదలియార్ తనయ— శ్రీరంగ చంద్రమస మందిరయావిహర్తుం విన్యస్యవిశ్వచిదచింతయనాధికారం। యోనిర్వహత్య నిశమంగుళి ముద్రయైవ సేనాన్యమన్యముఖాస్తమశిశ్రయామః॥

